# గరుడయానం

(లండన్, ఏంస్టర్ డామ్, ప్యారిస్, సానెన్‌లలో చేసిన ప్రసంగాలు)

జిడ్డు కృష్ణమూర్తి

తెలుగుసేత: నీలంరాజు దమయంతి



ప్రగతి పబ్లిషర్స్

హైదరాబాదు (ఆం.ప్ర.)

**GARUDAYAANAM : J. Krishnamurti**
Telugu translation of · **The Flight of the Eagle**
Translated by *Neelamraju Damayanthi*
(Authorised by Krishnamurti Foundation India)



Published with permission by **Pragathi Publishers,** Hyderabad

| | |
|---|---|
| First Edition | July, 2003 |
| No of Copies | 1000 |

**Price: Rs.60-00**

*Sole Distributors:*
**Visalaandhra Publishing House,**
Abids, Hyderabad - 500 001
E-mail· visalaandhraph@yahoo com

*For Copies·*
**Visalaandhra Book House,**
(Abids, Sultan Bazar) Hyderabad
Vijayawada, Visakhapatnam, Guntur,
Tirupati, Hanmakonda, Anatapur, Kakinada

*Printed at* · **Sri Kalanjali Graphics,** Narayanaguda, Hyderabad

# ఇందులో...

## ప్రథమ భాగం

## ప్రసంగాలూ-ప్రశ్నలూ



## ద్వితీయ భాగం

## సంవాదాలు

# ఇంతవరకు తెలుగులో వెలువడిన జిడ్డు కృష్ణమూర్తి రచనలు

1. కృష్ణమూర్తి తత్వం – పరిచయ సంపుటం
2. శ్రీలంక సంభాషణలు
3. గతం నుండి విముక్తి
4. ఈ విషయమై ఆలోచించండి
5. ముందున్న జీవితం
6. ధ్యానం
7. విద్య అందు జీవితమునకుగల ప్రాధాన్యత
8. మన జీవితాలు – జిడ్డు కృష్ణమూర్తి వ్యాఖ్యానాలు
9. స్వీయజ్ఞానం
10. స్వేచ్ఛ (ఆదిలోనూ–అంతంలోనూ)
11. నీవే ప్రపంచం
12. గరుడయానం

ప్రతులకు :

**కృష్ణమూర్తి ఫౌండేషన్, ఇండియా**

చెన్నై - 600 028.

**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**

హైదరాబాద్ - 500 001.

# 1. స్వేచ్ఛ

## ఆలోచన, సుఖము, బాధ

మనలో చాలామందికి స్వేచ్ఛ అనేది ఒక భావమేకానీ, వాస్తవంకాదు మనం స్వేచ్ఛను గురించి మాట్లాడుకునేటప్పుడు కూడా బాహ్యప్రపంచంలోని స్వేచ్ఛనే కావాలంటాం మన చేసే పన్లుగానీ, ప్రయాణాలుగానీ మనయిష్టానుసారమే జరగాలనీ మనల్ని మనం భిన్నరీతులలో స్వేచ్ఛగా వ్యక్తం చేసుకోవాలనీ మన అభిమతాన్ననుసరించే ఆలోచించాలనీ అనుకుంటాము బాహ్యవ్యక్తీకరణలోని ఈ స్వేచ్ఛ, ముఖ్యంగా నియంతృత్వ-నిరంకుశత్వ ధోరణులు ఉన్న దేశాలలో అత్యంత ప్రధానమైన విషయమైనట్లు కనిపిస్తుంది ఏ దేశాలలోనైతే బాహ్యంలో స్వేచ్ఛ సాధ్యమౌతున్నదో, అక్కడి వ్యక్తి మరింత సుఖంకోసం మరిన్ని వస్తువులకోసం వెంపర్లాడుతుంటాడు

స్వేచ్ఛ అంటే ఏమిటీ అని మనం లోతుగా విచారణ చేసి చూస్తే, అంతరంగంలో పూర్తిగా, సంపూర్తిగా స్వేచ్ఛ కలిగి వుండటమే ముఖ్యమనీ, అటుపైన, అది బాహ్యంలో సమాజంలోగానీ, సంబంధాలలోగానీ, తనంతటతానే వ్యక్తమౌతుందని తెలుస్తుంది ఇంత బలీయంగా నిబద్ధింపబడిన ఈ మనిషి మనసు, ఎప్పటికైనా అలాంటి స్వేచ్ఛను పొందగలదా అని మనల్ని మనం ప్రశ్నించుకోవలసివున్నది మనసు ఎప్పుడూ తన స్వంత నిబద్ధతా పరిధులలోనే నివసిస్తూ వ్యవహరిస్తూ ఉండవలసిందేనా, దానికిక స్వేచ్ఛ దొరికే అవకాశమేలేదా? ఈ భూమిపై, తనకిక్కడ బాహ్యంలోనూ, అంతరంగంలోనూ స్వేచ్ఛ ఎలాగూ దొరకదని, వాగ్రూపకంగా అర్థంచేసుకున్న ఆ మనసు మరో ప్రపంచంలో స్వేచ్ఛను సృష్టించుకోవడం మొదలుపెడుతుందని గ్రహించవచ్చు. ముందెన్నడో ముక్తి లభిస్తుందని, స్వర్గం దక్కుతుందని

స్వేచ్ఛను గురించిన సిద్ధాంతపరమైన, భావపరమైన ఊహలనన్నిటినీ, పక్కన పెట్టినప్పుడే మన మనసులు మీది, నాది-పరాధీనతనుంచీ భయాందోళనలనుంచీ, చేతనలోని, అవ్యక్తచేతన అట్టడుగు పొరల్లోని రెండింటిలోని అసంఖ్యాకమైన సమస్యలనుంచి ఎప్పటికైనా స్వేచ్ఛనందగలవా? అని మనం చూడగలం సంపూర్ణమానసిక స్వేచ్ఛ కలదా? అప్పుడే ఆ మనసుకి, నిత్యజీవితపు వాస్తవాలనుంచి తప్పించుకోకుండానే-కాలంతో నిమిత్తంలేని, ఆలోచనా నిర్మితంకానిదేదో సృష్టించగలదు

మనిషి మనసులో అంతర్గతంగానూ మానసికంగానూ పూర్తి స్వేచ్ఛ ఉంటే తప్ప, సత్యమంటే ఏమిటో చూడడం దానికి సాధ్యం కాదు, యాంత్రికంగా చేసే నిత్యకృత్యాల వల్ల కలిగే విసుగు, ఒంటరితనం, నైరాశ్యం, ఆదుర్దాలనుంచి తప్పించుకోకుండానే భయంచే సృష్టించుకున్నదీ, మనం నివసిస్తున్న సమాజం చేత లోక సంస్కృతిచేత

రూపుదిద్దబడని ఒక యదార్థతత్వమేదైనా ఉంటే, దానిని వీక్షించుటకు ఈ సంపూర్ణ స్వేచ్ఛ అవసరం అలాంటి సంపూర్ణ స్వేచ్ఛ వాస్తవమేనా అని కనుగొనటానికి మనిషి తన నిబద్ధతనీ, తన సమస్యల్నీ, విసుగుజనింపచేసే తన లోతులేనితనాన్ని, ఏదో శూన్యత, ఏదో కొరత నిండినట్లుండే తనదైనందిన జీవితాన్ని గురించి తెలుసుకోవాలి అన్నిటినీమించి భయాన్ని గురించి తప్పకుండా తెలుసుకోవాలి తనను గురించి తాను తెలుసుకోవడమనేది, అంతర్మథనంతో కానీ విశ్లేషణతో కానీ కాకుండా వాస్తవంగా తానెలా ఉన్నాడో, దానిని గురించిన స్పృహతో మనసులో పేరుకుపోయి ఆటంకపరిచే అన్ని విషయాలనుంచీ పూర్తిగా స్వేచ్ఛ నొందడం సాధ్యమేనా అనేది చూడాలి

మనం చేయబోతున్న ఈ పరిశోధనకు స్వేచ్ఛ ఎంతో అవసరం ఎపుడో అంతంలో కాదు, ఆరంభమందే స్వేచ్ఛ ఉంటే తప్ప, మనిషి అన్వేషించలేడు పరిశోధించలేడు, పరీక్షించనూలేడు లోతుగా చూడాలంటే స్వేచ్ఛ ఒకటే కాదు, పరిశీలించుటకు అవసరమైన క్రమశిక్షణకూడా ఉండాలి స్వేచ్ఛ, క్రమశిక్షణ కలిసే ప్రవర్తిల్లుతాయి అయితే స్వేచ్ఛ పొందడానికి మనిషి క్రమశిక్షణతో వుండితీరాలి అని మాత్రంకాదు ఇక్కడ మనం 'క్రమశిక్షణ' అనే పదాన్ని, సంప్రదాయం ఆమోదించిన అర్థంలో వాడటంలేదు అంటే అనుసరణ, అనుకరణ, అదుపులో పెట్టడం, తయారుచేసిన ఓ నియమావళి ననుసరించుటం వంటివి కాదు

అయితే ఆ పదం యొక్క మూలార్థంలో, అనగా 'నేర్చుకోనుట' అనే అర్థంలో వాడుతున్నాము నేర్చుకోవడమూ, స్వేచ్ఛ, కలిసే, వుంటాయి స్వేచ్ఛ, తనదైన క్రమశిక్షణను, తనతోటే తీసుకు వస్తుంది అయితే, ఆ క్రమశిక్షణ ఏదో ఒక ఫలితాన్ని సాధించుటకుగాను, మనసు తనపై విధించుకున్నది కాదు ఇవి రెండూ అవసరం స్వేచ్ఛ నేర్చుకునే క్రియ స్వేచ్ఛ ఉంటే తప్ప, మనిషి తన గురించి తాను నేర్చుకొనలేడు స్వేచ్ఛ ఉన్నప్పుడే మనిషి పరిశీలించగలడు ఏదో ఒక పద్ధతి, సూత్రం, భావం ప్రకారం కాకుండా, వాస్తవంలో తానెలా ఉన్నాడో దానినే పరిశీలించాలి అటువంటి పరిశీలన, అటువంటి గ్రహింపు, అటువంటి చూపు తనదైన క్రమశిక్షణను, నేర్చుకునే లక్షణాన్ని తీసుకువస్తుంది అందులో అనుసరించటం, అనుకరించటం, అణచిపెట్టడం లేక అదుపులో పెట్టటం అనేవి ఎంతమాత్రం ఉండవు అందులో ఓ గొప్ప అందం ఉన్నది

మన మనసులు నిబద్ధింపబడ్డాయి. అది స్పష్టంగా తెలుస్తున్న వాస్తవం ప్రత్యేకమైన ఒక సంస్కృతీ లేక సమాజమూచేత నిబద్ధింపబడి పలురకాల ప్రభావాలకు లోనయాయి సంబంధాలలోని ఒత్తిడీ, ఒరిపిడీ, ఆర్థిక, నైసర్గిక, విద్యాసంబంధిత అంశాలు మతానుసరణవంటి వాటిద్వారా నిబద్ధింపబడ్డాయి భయాన్ని, దాని పూర్తి స్వరూప స్వభావాలను చూసి, దానినెప్పటికీ పూర్తిగా, సంపూర్తిగా పరిష్కరించుకోలేకపోవడం వల్ల, మన మనసులు భయాన్ని ఆమోదించి, సాధ్యమైతే దాన్నుంచి తప్పించుకోవడం అలవాటు చేసుకున్నాయి. కనుక, మనమొదటి ప్రశ్న ఇంతభారమైపోయిన ఈ మనసు తన నిబద్ధతనే కాక, తన భయాలను కూడ పూర్తిగా పరిష్కరించగలదా? కారణమేమంటే ఆ భయమే మనల్ని నిబద్ధతను అంగీకరించేటట్లు చేస్తున్నది కనుక.

ఈ పదజాలాన్నీ, భావాల్ని మాత్రం వింటేనే సరిపోదు - అలా వింటే వాటికి ఉండేవిలువ ఏమీ లేదు - కానీ శ్రవణ క్రియద్వారా మీ మనసులోని స్థితిగతుల్ని పదాల ఆధారంతోను, పదాలతో నిమిత్తం లేకుండాను, రెండు విధాలుగానూ పరిశీలిస్తూ, భయాన్నుంచి మనసెప్పటికైనా విముక్తి చెందగలదా అని విచారణ చేయాలి భయాన్ని అంగీకరించకుండానూ, తప్పించుకోకుండాను 'నేను ధైర్యాన్ని పెంచుకొని దానిని ప్రతిఘటిస్తాను' అని అనకుండానూ ఏ భయంలోనైతే, మనిషి చిక్కుకుపోయాడో, ఆ భయాన్ని గురించి పూర్తి ఎరుకతో వుంటూ దానిని పరిశీలించాలి ఈ భయమనే గుణం నుంచి మనిషి బయటపడితే తప్ప, అతడు దేనినీ విశదంగా, లోతుగా చూడలేడు ఇపుడు స్పష్టమైనదేమంటే ఎక్కడ భయం ఉంటుందో, అక్కడ ప్రేమ ఉండదు అని

కనుక, ఈ మనసెప్పటికైనా, భయం నుంచి నిజంగా స్వేచ్ఛ నొందగలదా? నాకెలా కన్పిస్తున్నదంటే గంభీరమైన మనస్సు కలవారెవరైనా ప్రప్రథమంగా అడగవలసిన, పరిష్కరించవలసిన ముఖ్యమైన ప్రశ్నల్లో ఇది ఒకటని భౌతికపరమైన భయాలు, మానసికపరమైన భయాలు దేహ బాధకు సంబంధించినవి భౌతిక భయాలు, గతంలో కలిగిన ఆ బాధ స్మృతిరూపంలో ఉన్నందువల్లనూ, భవిష్యత్తులో ఆ బాధ పునరావృతం అవుతుందేమోనన్న తలపువల్లనూ కలిగే మానసిక భయాలు ఇంక వృద్ధాప్యం, మరణం గురించిన భయాలు భౌతిక అభద్రతను గురించి, రేపటి అనిశ్చిత పరిస్థితిని గురించిన భయాలు, గొప్ప విజయం పొందలేనేమో, ఏదీ సాధించలేనేమో, వికృతంగా కనిపించే ఈ ప్రపంచంలో ఏ ప్రత్యేకతా లేకుండా పోతానేమోననే భయం, విధ్వంసాన్ని గురించిన భయం, ఒంటరితనం గురించి భయం, ప్రేమించలేకపోవటం, ప్రేమించబడకపోవటం వల్ల కలిగే భయం వగైరాలెన్నో ఇలా వ్యక్తమయే భయాలేకాక, వ్యక్తం కాకుండా ఉన్న భయాలెన్నో ఈ భయాల సంపుటినుంచి మనసుపూర్తిగా స్వేచ్ఛ నొందగలదా? మనసు కనుక, 'నావల్లకాదు', అనేటట్లయితే, అది తననుతాను అశక్తురాలిగా చేసుకున్నది, తనను తాను వక్రీకరించుకున్నదన్నమాట అందువల్ల దానికి గ్రహించేశక్తి అర్థంచేసుకునేశక్తి ఉండవు అది పూర్తి నిశ్శబ్దంలో మౌనంగా నెమ్మదిగా ఉండలేకపోతుంది అది చీకటిలో ఉన్న మనసు వంటిది, చీకటిలో వుంటూ వెలుగుకోసం వెతుకుతూ దానినెప్పటికీ కనుగొనలేక పదాలతో, భావాలతో సిద్ధాంతాలతో కూడిన ఓ 'వెలుగుని' సృష్టించుకుంటుంది

భయంతోనూ, దాని మొత్తం నిబద్ధతతోనూ అత్యంత భారమైపోయిన ఆ మనసు, దాని నుంచెప్పటికైనా స్వేచ్ఛనొందగలదా? లేక జీవితంలో భయం అనివార్యమైన విషయం అని మనం అంగీకరించక తప్పదా? మనలో చాలామంది అలాగే దాని నంగీకరించి దానిని భరించి ఊరుకుంటున్నాం మనమేంచేయాలి? మానవమాత్రుణ్ణైన నేనుగానీ మానవమాత్రులైన మీరుగానీ ఈ భయం నుంచి, ఎలా బయట పడాలి? ఏదో ఒక ప్రత్యేక భయం నుంచి కాదు, మొత్తం భయం నుంచి, ఆ భయం యొక్క పూర్తి స్వరూప స్వభావాలనుంచి ఎలా విముక్తి చెందాలి?

భయమంటే ఏమిటి? ఇక్కడ నాదొక సూచన వక్త చెపుతున్నారు గదా అని మీరంగీకరించనక్కర్లేదు వక్తకి ఏమాత్రం అధికారం లేదు వక్త టీచరూ కాదు, గురువూ

కాదు ఈయనే మీకు గురువైనట్లయితే, మీరు ఆయనకు అనుయాయులవుతారు మీరు అనుయాయులయితే, మిమ్మల్ని మీరు నాశనం చేసుకోవడమేకాక గురువుని కూడా నాశనం చేస్తారు భయము అనే ఈ ప్రశ్నలోని సత్యమేమిటో ఎంత సంపూర్తిగా కనుగొనాలని ప్రయత్నిస్తున్నామంటే, ఆ మనసు ఇక ఎప్పటికీ భయమనేది లేకుండా ఉండాలి, అప్పుడే అది మరొకరిపై అంతర్గతంగానూ మానసికంగానూ ఆధారపడేలక్షణాల మొత్తాన్నుంచి స్వేచ్ఛ నొందుతుంది స్వేచ్ఛలోని సౌందర్యమంతా మీ జీవించే తీరులో ఎక్కడా ఏ ముద్రమిగల్చకుండా సాగిపోవడంలో వున్నది గరుడపక్షి తనయానంలో ఏ గుర్తూమిగల్చదు శాస్త్రజ్ఞుడు మిగులుస్తాడు స్వేచ్ఛ అనే అంశం గురించి చేస్తున్న ఈ విచారణలో శాస్త్రీయమైన పరిశీలనేకాక, అసలు ఏ గుర్తూ లేకుండా ఎగిరే గరుడపక్షి రీతి కూడా కావాలి రెండూ అవసరమే పదాలతో చేస్తున్న వివరణా, పదాలతో నిమిత్తం లేని గ్రహింపూ రెండూ తప్పనిసరిగా వుండాలి వర్ణన ఎపుడూ వర్ణించబడుతున్న వస్తువు యొక్క వాస్తవరూపంకాదు, అలాగే వివరణ ఎప్పటికీ వివరించబడుతున్న వస్తువు కానేరదు. పదమెన్నటికీ వస్తువుకాదు

ఇదంతా సుబోధకమైనట్లయితే, ముందుకి పోగలం వక్తద్వారా అతని మాటల ద్వారా అతనిభావాలు లేక ఆలోచనలద్వారా కాకుండా భయంనుంచి మనసుపూర్తి స్వేచ్ఛను పొందగలదేమో, మనంతటమనమే కనుగొనగలం ఈ మొదటి భాగమంతా ఉపోద్ఘాతం కాదు. మీరు కనుక దానిని సరిగా విని అర్థంచేసుకోనట్లయితే తర్వాత భాగానికి వెళ్ళలేరు

విచారణచేసి చూడడానికి స్వేచ్ఛ ఉండాలి, స్వేచ్ఛ ఉండితీరాలి ఎందుకంటే పూర్వాభిప్రాయాలనుంచి, నిర్ణయాలనుంచి, భావాలు, ఆదర్శాలు, అపోహలనుంచి స్వేచ్ఛ నొందినపుడే మీ అంతటమీరు ఆ భయాన్ని నిజంగా పరిశీలించగలరు

మీరు భయాన్ని అత్యంత సమీపంగా, అతి సన్నిహితంగా పరిశీలిస్తున్నపుడు భయమనే దసలుంటుందా? అనగా 'పరిశీలకుడే', 'పరిశీలించబడేది' అయినపుడు మాత్రమే అత్యంత సమీపంగా, అతి సన్నిహితంగా భయమంటే ఏమిటో పరిశీలించగలరు మనమిపుడు అందులోనికే వెడుతున్నాము కనుక, భయమంటే ఏమిటి? అది ఎలా పుట్టుకువస్తున్నది? భౌతికదేహానికి కలిగే ప్రమాదాలవలెనే స్పష్టంగా ఉండే భౌతికపరమైన భయాలు ఉన్నాయి వాటికి తక్షణ స్పందన ఉంటుంది వాటిని అర్థంచేసుకోవడం చాలాసులభం మనం అందులోకి ఎక్కువగా వెళ్ళనవసరం లేదు కానీ, మనం మాట్లాడుతున్నది మానసిక భయాలను గురించి, ఈ మానసిక భయాలెలా ఉత్పన్నమౌతున్నాయి? వాటికి మూలం ఏమిటి? అదీ విషయం, నిన్న సంభవించిన దానిని గురించిన భయం వున్నది. ఆ తర్వాత ఇవాళ కానీ, రేపు కానీ జరగబోయే దానిని గురించి భయం మనకు యిప్పటికే తెలిసిన దానిని గురించిన భయమొకటి, తెలియని దానిని గురించిన భయం మరొకటి, అనగా రేపటిని గురించినది ఆలోచన నిర్మింపబడిన తీరునిబట్టే భయం పుట్టుకు వస్తున్నదని ఎవరైనా స్వయంగా గ్రహించగలరు నిన్ననేదైతే సంభవించి మనిషిని భయపెట్టిందో, దానిని గురించి ఆలోచించటం వల్లనూ, భవిష్యత్తుని గురించి ఆలోచించినందువల్లనూ భయం – అవునా? ఆలోచనే భయాన్ని

పెంచుతున్నది - కాదా? ఈ విషయం సరిగ్గా తెలుసుకోండి వక్త చెప్తున్నారు కదా అనీ అంగీకరించవద్దు భయానికి మూలం ఆలోచనే అనే విషయం మీ అంతట మీరే ఖచ్చితంగా తెలుసుకోండి కొంతకాలం క్రితం కలిగిన బాధ, ఆ మానసిక వ్యధను గురించి ఆలోచిస్తూ, అది మళ్ళీ రాకూడదనీ అసలు జ్ఞప్తికే రాకూడదనే ఆలోచనలు సాగుతుంటే, అవి భయాన్ని మరికాస్త పెంచుతాయి మనం అక్కడినుంచి ముందుకి సాగుదామా? దీనిని మనం బాగా విశదంగా చూస్తేతప్ప, ముందుకు పోలేము ఒక సంఘటన, ఓ అనుభవం, అలజడిని కలిగించిన ఆ స్థితి, ఆ దుఃఖం, ఆ బాధలను గురించి ఆలోచిస్తుంటే, ఆ ఆలోచనే భయాన్ని తీసుకువస్తున్నది ఆలోచన, ఇప్పటికే కొంతవరకు మనకు మానసిక భద్రతను కల్పించింది, ఆ భద్రతకేమాత్రం భంగం వాటిల్లినా దానికిష్టం వుండదు ఏ అలజడైనా దానికి ప్రమాదకరమే అందువల్ల భయం

ఆలోచనే భయానికి కారణం, సుఖానికి కూడా ఆలోచనే కారణం మనిషికి ఒక సుఖానుభవం కలిగింది ఆలోచన దానిని గురించి ఆలోచిస్తూ దానినలాగే కొనసాగించాలంటుంది అది సాధ్యంకానపుడు ప్రతిరోధం, ఆగ్రహం, నిరాశ, భయం మొదలు కనుక భయానికీ, సుఖానికీ కూడా ఆలోచనే మూలకారణం కాదా? ఇది మాటలతో చేసిన నిర్ణయంకాదు భయాన్నుంచి తప్పించుకోవాలని చేసిన సూత్రీకరణా కాదు అనగా ఎక్కడ సుఖం ఉన్నదో, అక్కడ బాధ, భయం, ఆలోచనద్వారా కొనసాగుతున్నవి సుఖం వెంబడే బాధ, ఈ రెండూ అవిభాజ్యమైనవి రెంటికీ ఆలోచనే కారణం సుఖ, భయాలను గురించి ఆలోచించడానికి రేపు అనేరోజుగానీ, మరుక్షణం కానీ లేవు అని తెలిసినపుడు, రెండూ ఉండవు అక్కడి నుంచి కదులుదామా? దీనిని మీరు ఒక భావంలా కాకుండా మీ అంతటమీరే కనుగొన్న విషయం అయినపుడు మీకది వాస్తవం ఔతుంది నిజమౌతుంది అపుడే మీరు ఆలోచనే సుఖాన్నీ, భయాన్నీ పెంచుతున్నది అని చెప్పగల్గుతారు మీకు శృంగారక్రియలో ఆనందం కలిగింది, అదే సుఖం అనిపిస్తుంది తర్వాత దానిని గురించిన భావ చిత్రాలు మదిలో మెదులుతాయి. ఆలోచించడం మొదలుపెడతారు అవే 'ఆలోచనా చిత్రాలు' వాటిని గురించి ఆలోచిస్తుంటే, ఇపుడు మనోచిత్రరూపంలో ఉన్న ఆ సుఖానికి, ఆలోచన బలం చేకూరుస్తుంది దానికేదైనా విఘాతం వస్తే బాధ, ఆందోళన, భయం, అసూయ, కష్టం, కోపం, క్రౌర్యం మొదలైనవన్నీ ప్రకోపిస్తాయి మీరు సుఖపడరాదు అని మేము అనడం లేదండీ.

ఆనందం సుఖంకాదు మహదానందాన్ని ఆలోచన తెచ్చిపెట్టలేదు. అది పూర్తిగా భిన్నమైనది. సుఖ, భయాలనుపెంచే ఆలోచనా స్వరూపాన్ని మీరు అర్థంచేసుకున్నపుడే ఆ ఆనందాన్ని కానీ ఆ మహదానందాన్ని కానీ, మీ అనుభవంలోకి తెచ్చుకోగలరు.

ఇపుడు ఉదయించే ప్రశ్న మనిషి ఆలోచనని ఆపివేయగలడా? ఆలోచనే భయాన్ని, సుఖాన్ని పెంచుతున్నట్లయితే, సుఖం ఉన్నచోట బాధా ఉండక తప్పదనేది స్పష్టంగా తెలిసే విషయం - అపుడెవరైనా ఇలా ప్రశ్నించుకుంటారు· ఆలోచన అంతం అవగలదా? దానర్థం, అందాన్ని ఆస్వాదించడం కానీ, అందాన్ని అనుభవించడం కానీ, అంతంచేయమనికాదు ఇదెలాంటిదంటే, ఓ మేఘాన్ని లేక ఒక వృక్షాన్ని, దానికుండే

సౌందర్యాన్ని సాంతంగా, సంపూర్ణంగా, నిండుగా చూచి ఆనందించడం లాంటిది కాని, ఆలోచన అదే అనుభవాన్ని రేపుకూడ పొందాలనీ, నిన్నచూచిన ఆ మబ్బునీ, ఆ చెట్టునీ, ఆ పూవునీ, ఆ చక్కని ముఖాన్నీ చూసి సంతోషించిన స్థితి మళ్ళీ దక్కాలనీ అంటే, నిరాశనీ, భయాన్నీ, సుఖాన్నీ, బాధనీ ఆహ్వానించినట్లే అవుతుంది

కనుక, ఆలోచన అంతం కాగలదా? ఇది సరైన ప్రశ్నేనా? సరైన ప్రశ్న కానేకాదు కారణం ఏమంటే, సుఖంతో సంబంధంలేని పారవశ్యాన్ని, పరమానందాన్ని కోరుతున్నాము, ఆలోచనని అంతం చేయడం ద్వారా సుఖభయాల ఉత్పాదితం కాని మహత్తరమైన దానిని పొందాలని ఆశిస్తున్నాము జీవితంలో ఆలోచనకు ఉన్నస్థానమేమిటో చూడాలికానీ, ఆలోచనని అంతం చేయడం ఎలా అని ప్రశ్నించరాదు ఆలోచనకు క్రియ, నిష్క్రియలకు ఉన్న సంబంధం ఏమిటి? చర్యనాచరించే సమయంలో, ఆలోచనకీ చర్యకీ ఉన్న సంబంధంమేమిటి? సుందరమైనదానిని చూసి ఆనందపారవశ్యంలో మునిగినప్పుడు ఆలోచన అసలు వస్తుందా? అపుడు రానట్లయితే, ఇకదానిని రేపటికి తెచ్చుకోవడమనేది ఉండదుగదా? నేను కనుక్కోవాలి ఓ పర్వతసౌందర్యాన్ని, ఓ చక్కని ముఖాన్ని, ఓ జలరాశిని చూస్తూ ఆనందిస్తూ ఉన్నప్పుడు ఆలోచనవచ్చి, దానినో మలుపుతిప్పి, 'నాకీ ఆనందం రేపుకూడా లభించాలి' అని ఎందుకంటున్నదో నేను కనుక్కోవాలి

చర్య జరిగే సమయంలో చర్యకూ ఆలోచనకూ ఉన్న సంబంధం ఏమిటో నేను కనిపెట్టాలి. ఆలోచన యొక్క అవసరమే లేనప్పుడు ఆలోచన ఎందుకు జోక్యం చేసుకుంటున్నదో నేను కనుక్కోవాలి ఆ ఆకాశనేపథ్యంలో ఒక్క ఆకు కూడా లేని ఆ అందమైన చెట్టు నాకు అత్యంత సుందరంగా కనిపించింది అది చాలునాకు అంతటితో అది అంతమైనట్లే. అపుడు ఆలోచన ప్రవేశించి, 'నాకీ సంతోషం రేపుకూడా కావాలి అని ఎందుకంటోంది? చర్య చేసే సమయంలో ఆలోచన ఉండవలసిందేనిని కూడా నేను చూశాను చర్యలోని నైపుణ్యమే, ఆలోచనలోని నైపుణ్యం ఆచరించే చర్యకూ–ఆలోచనకూ ఉన్న సంబంధం ఏమిటి? ప్రస్తుతం, మన చర్య భావాలమీద సూత్రాలమీద ఆధారపడి వుంటోంది చేయవలసిన చర్యపై ముందే నాకొక భావమో, సూత్రమో ఉన్నట్లయితే నేను చేసినది ఆ భావానికీ, ఆ సూత్రానికీ దరిదాపుగా వుంటుంది ఆచరించిన చర్యకి, ఆ భావానికి, అనగా ఆ ఆదర్శం, ఆ ఉండాలనుకున్నది మధ్య విభజన ఏర్పడ్డది ఏ విభజనైనా, మానసికపరమైన విభజనైనా సరే ఘర్షణను పెంచి తీరుతుంది నాకు నేను వేసుకుంటున్న ప్రశ్న ఏమంటే "ఆచరించిన చర్య అసంపూర్ణమౌతుంది ఆలోచనదేనినైనా చూసీ చూడడంతోటే, తక్షణం జరిగేచర్య ఏమైనా ఉన్నదా? ఉన్నట్లయితే, ఇక భావాన్ననుసరించి, సూత్రప్రకారం విడిగాచర్య నాచరించవలసిన దేముంటుంది? చూచుటే చేయుటైపోయే చర్య ఏమైనా ఉన్నదా, అందులో ఆలోచించుటే చర్య అవుతుందా? ఆలోచనే భయాన్నీ సుఖాన్నీ పెంచుతున్నదని గ్రహించాను ఎక్కడసుఖం ఉంటే, అక్కడ బాధవుంటుందని, బాధవుంటే ప్రతిఘటన వుంటుందని చూశాను స్పష్టంగా చూశాను అలా చూసిన చూపే తక్షణచర్య, ఆ చూపులో తత్సంబంధమైన చింతనా, తర్కమూ, సుస్పష్టమైన ఆలోచన అన్నీ యిమిడి వున్నాయి అయినప్పటికీ, ఆ చూపూ తక్షణమే, తదనుగుణమైన చర్యా తక్షణమే అందువల్ల దానినుంచి విముక్తి లభించినట్లే

మనమధ్య ఈ భావప్రసారం సరిగా జరుగుతున్నదా? మెల్లిగా కదలండి ఇది అత్యంత కఠినం, 'అవును అని అంత సులభంగా అనేయవద్దు మీరు కనుక అవును అని అనగలిగితే మీరీహాలును వదిలివెళ్లేసరికే మీరు భయంనుంచి విముక్తులవాలి ఏదో యాదాలాపంగా అవును అని అంటే మాత్రం, మీరు పదపరంగా, మేధాపరంగా అర్థం చేసుకుని అంటున్నారన్న మాట దానికి ప్రయోజనం ఉండదు మీరూ, నేనూ ఇక్కడ ఈ ఉదయం భయమనే అంశాన్ని పరిశోధిస్తున్నాము కనుక మీరీ హాలునుంచి బైటికి వెళ్ళేసరికల్లా, భయంనుంచి పూర్తి స్వేచ్ఛనొందాలి దానర్థం, మీరు అపుడు ఓ స్వేచ్ఛాజీవి, ఓ విభిన్న వ్యక్తి, సంపూర్ణ పరివర్తనం చెందిన ఓ మానవుడు అవుతారు ఎప్పుడో రేపు కాదండీ, ఇప్పటికిప్పుడే, ఆలోచన భయాన్ని, సుఖాన్ని పెంచుతుందని స్పష్టంగా చూశారు మన విలువలన్నీ నైతిక, సాంఘిక, మత, ఆధ్యాత్మిక రంగాలలోని విలువలన్నీ- ఈ సుఖ, భయాలమీదనే ఆధారపడి వున్నవని చూశారు ఈ సత్యాన్ని గనుక మీరు గ్రహిస్తే - ఆ సత్యాన్ని గ్రహించడానికి మీకు అసాధారణమైన ఎఱుక ఉండాలి ఆలోచన యొక్క ప్రతికదలికనీ హేతుబద్ధంగా, ఆరోగ్యకరంగా స్వచ్ఛచిత్తంతో పరిశీలిస్తూవుంటే, ఆ పరిశీలనే సంపూర్ణచర్య అదే జరిగితే ఈ హాలునుంచి మీరు బైటికి వెళ్ళేసరికి భయం నుంచి పూర్తిగా విముక్తులవుతారు లేని పక్షంలో నేను ఈ భయంనుంచి బయట పడటమెలా' అని రేపు కూడా ప్రశ్నిస్తూనే వుంటారు

ఆలోచన ఏ చర్యలోనైనా ప్రవర్తిల్లవలసిందే మీరు ఇంటికి వెళ్ళవలసినపుడు ఆలోచించాలిసిందే బస్సునిగానీ రైలునిగానీ అందుకోవలసినపుడూ, ఆఫీసుకి వెడుతున్నపుడూ చేసే ఆలోచన సమర్థవంతంగానూ, తటస్థంగానూ, నిష్పాక్షికంగానూ భావోద్వేగరహితంగానూ ఉండాలి అటువంటి ఆలోచన శక్తివంతమైనది అలాకాక, మీ గతానుభవాన్ని ఆధారం చేసుకున్న ఆలోచనని, స్మృతులద్వారా భవిష్యత్తులోకి తీసుకుపోయేటట్లయితే, అపుడు చేసేచర్య అసంపూర్ణం అందువల్ల ఒకరకమైన ప్రతిఘటన వగైరాలు మొదలవుతాయి

ఇపుడు మనం తర్వాతి ప్రశ్నదగ్గరికి వెడదాం, దానిని ఇలా ప్రశ్నించుకుందాం ఆలోచనకు మూలం ఏమిటి? ఆలోచించేవారెవరు? స్మృతులుగా పోగుచేసుకున్న పూర్వ జ్ఞానము, అనుభవాలనుంచి వచ్చే స్పందనే ఆలోచన అనీ, ఏ సవాలుకైనా ఆ నేపథ్యం నుంచే ఆలోచన స్పందిస్తుందనీ ఎవరైనా గ్రహించవచ్చు మీరెక్కడవుంటారు? అని మిమ్మల్నెవరైనా ప్రశ్నిస్తే తక్షణం స్పందించి సమాధానమిస్తారు కనుక, ప్రతి ఆలోచనకు వెనుక జ్ఞప్తి, అనుభవాలు, విజ్ఞానమూ అనే నేపథ్యం ఉంటుంది అందుచేత ఆలోచన ఎప్పటికీ కొత్తదికాదు, ఆలోచన ఎప్పుడూ పాతదే గతంతో ముడి వేయబడింది కాబట్టి, దానికెప్పటికీ స్వేచ్ఛకూడ ఉండదు స్వేచ్ఛ లేనందువల్ల అదెన్నటికీ నూతనమైనదానిని దేనినీ చూడజాలదు నేనిదంతా స్పష్టంగా అర్థంచేసుకున్న వెంటనే మనసు నిశ్చలమైపోతుంది జీవితమనేది ఒక చలనంవంటిది, అనేక సంబంధాలలో సతతం సాగిపోయే చలనం. ఆలోచన, కదిలిపోతున్న ఈ చలనాన్ని జ్ఞప్తిగా గతస్మృతిగా పట్టుకుందామని ప్రయత్నిస్తూ, విఫలమై జీవితమంటేనే భయపడుతుంది.

ఇదంతా చూసి, - పరీక్షించుటకు స్వేచ్ఛ అవసరమనీ చూసి - విశదంగా విడమర్చి పరీక్షించాలంటే, అణిచిపెట్టుట, అనుకరణలు కాకుండా, నేర్చుకునే క్రమశిక్షణ ఉండాలనీ గ్రహించాము.

మనసు గతంచేత, సమాజంచేత ఎలా నిబద్ధింపబడిందో చూశాము మెదడు నుంచి త్రోసుకు వస్తున్న మొత్తం ఆలోచన పాతదేననీ, అందువల్ల నూతనమైన దానినీ దేనినీ అది అర్థం చేసుకోలేదనీ, తెలుసుకున్న మనసు, సంపూర్ణంగా నిశ్చలమైపోతుంది - దానిని నిశ్చలం చేయటానికి - అదుపులో పెట్టలేదు, రూపు మార్చలేదు అసలు దీనికి ఓ పద్ధతీ, మార్గమూ లేవు - జపానులోని జెన్ అయినా, భారతదేశపు మరో విధానమైనా ఒకటే, ప్రయోజనం లేదు, పద్ధతి ద్వారా మనసుని నిశ్చలం చేయగలమని అనుకోవటమంత తెలివితక్కువతనం మరొకటి లేదు మొత్తం విషయాన్నీ - ఏదో సిద్ధాంతపరంగా కాక నిజంగా చూసినపుడు-ఆ గ్రహింపులో నుంచి ఓ చర్య ఆవిర్భవిస్తుంది, ఆగ్రహింపే భయవిముక్తికీ చర్య కనుక, ఏ భయమైనా ఉద్భవిస్తున్న సమయంలో, తక్షణం దానిని గ్రహించడమే దానినంతం చేసినట్లవుతుంది

ప్రేమ అంటే ఏమిటి? మనలో చాలామందికి అది సుఖం, అందువల్ల భయం, దానినే మనం ప్రేమ అంటాం భయాన్ని, సుఖాన్ని అర్థం చేసుకున్న తర్వాత, అపుడు ప్రేమ అంటే ఏమైవుంటుంది? దీనికి సమాధానం, ఎవరిస్తారు? - ఈ వక్తనా? ఆ మతగురువా, లేక పుస్తకమా? బయటి నుంచి ఎవరైనా మీరు చేస్తున్నది అద్భుతంగా ఉందని, దానినే కొనసాగించండని చెప్పబోతున్నారా? లేక, మనం స్వయంగా సుఖాన్ని, భయాన్ని, బాధనీ, వాటి స్వరూప స్వభావాలను, పరీక్షించి, పరిశీలించి, విశ్లేషణారహితంగా చూచి, ఆ 'పరిశీలకుడు', ఆ 'ఆలోచించేవాడు', ఆలోచనలో భాగమేనని కనుగొన్నామా? ఆలోచించటమే లేనపుడు, 'ఆలోచించేవాడూ' వుండడు, ఆ రెండు విడదీయలేనివి, ఆలోచన చేసేవాడే, 'ఆలోచన' - ఇలా దానిని చూడడంలో ఓ అందం, ఓ సూక్ష్మం గోచరిస్తాయి భయమనే అంశాన్ని విచారణ చేయపూనుకున్న ఆ మనసు ఇపుడెక్కడ వున్నది? బోధపడిందా? ఈ మొత్తాన్ని తరచుకుంటూ వెళ్ళిన ఈ మనసు ప్రస్తుత స్థితి ఏమిటి? ఇంతకు ముందు ఉన్న స్థితీ, ఇపుడు చేరిన స్థితీ ఒకే విధంగా ఉన్నాయా? అది విషయాన్ని అత్యంత సన్నిహితంగా చూసింది, ఆలోచన, భయం, సుఖం అనే అంశాల స్వరూపాన్ని చూసింది ఆ మొత్తాన్నీ చూసింది, ఇప్పుడు దాని వాస్తవ స్థితి ఏమిటి? దానికి మీరు తప్ప, మరెవ్వరూ సమాధాన మివ్వలేరు అనేది స్పష్టం మీరు కనుక అందులోకి నిజంగా ప్రవేశించిచూసినట్లయితే, ఆ మనసు సంపూర్ణ పరివర్తనం చెందిందని, మీరే గ్రహిస్తారు

**ప్రశ్న: (వినపడలేదు)**

**కృష్ణమూర్తి:** ప్రశ్నించడమేనేది అత్యంత సులభమైన విషయాలలో ఒకటి బహుశ మనలో కొంత మంది, వక్త మాట్లాడుతున్న సమయంలోనే, ఏమి ప్రశ్న వేద్దామా అని ఆలోచిస్తూ వుండి వుంటారు వినడం మీదకన్నా, మనం వేసే ప్రశ్న మీదనే మనకు శ్రద్ధ ఎవరైనా తమనితాము ప్రశ్నించుకోవలసిందే, ఇక్కడే కాదు, ఎక్కడైనాను మనకు లభించే సమాధానంకన్నా, 'సరైన' ప్రశ్నను అడగడం మరింత ముఖ్యం. సమస్యకు

పరిష్కారం, సమస్యను అర్థం చేసుకోవడంలోనే వున్నది. సమాధానం సమస్యకు ఆవల ఉండదు సమస్యలోనే ఉంటుంది సమాధానం మీద, పరిష్కారం మీద మాత్రమే శ్రద్ధ ఉంటే, వారా సమస్యను స్పష్టంగా చూడలేరు మనలో చాలమంది, సమస్య వంక చూడకుండానే, దానిని పరిష్కరించేద్దామనే ఆతురతలో ఉంటారు – సమస్యలోకి చూడాలంటే, మనిషికి శక్తీ, తీక్షణతా, గాఢాభినివేశం ఉండాలి మనలో చాలా మందికి ఉండే సోమరితనం, బద్ధకం పనికిరాదు – పైగా మరెవరైనా పరిష్కరిస్తే బాగుండుననుకుంటాము మన సమస్యల్ని – అవి రాజకీయపరంగానీ, మతపరంగానీ, మానసిక పరంగానీ – అవి ఏవైనాగానీ, పరిష్కరించటానికి ఎవరూలేరు సమస్య వంక చూడాలనుకున్నా, పరిశీలించాలనుకున్నా మనిషిలో ఎంతో జీవశక్తి ఉండాలి, తీవ్రత, గాఢాభినివేశం ఉండాలి, అలా పరిశీలించే సమయంలోనే, సమాధానం స్పష్టంగా కనిపిస్తుంది

దీనర్థం, మీరు ప్రశ్నల నడగరాదని కాదు,

మీరు ప్రశ్నించాలిసిందే, మీరు ప్రతిదానినీ, ప్రతివారు చెప్పిన దానినీ, వక్త చెప్పిన దానినైనా సరే, సందేహించాలిసిందే

**ప్రశ్న: స్వంత సమస్యలను చూస్తున్నప్పుడు, అంతర్మథనమనే ప్రమాదం లేదా?**

**కృష్ణమూర్తి:** ప్రమాదం ఎందుకు ఉండరాదు? రోడ్డు దాటలన్నా ప్రమాదం ఉంటుంది చూడటం ప్రమాదకరం కాబట్టి చూడకూడదనా మీ అభిప్రాయం? ఇంతకు మునుపు చెప్పిన విషయమే తిరిగి చెప్తున్నందుకు ఏమీ అనుకోవద్దు – ఒకప్పుడు నన్ను చూడవచ్చిన, ఒక సంపన్నుని విషయం గుర్తుకు వచ్చింది – ఆయన, "మీరు మాట్లాడుతున్న విషయం పై నాకెంతో శ్రద్ధ కలిగింది నాకున్న అనేకానేక సమస్యలను మీతో చర్చించి, పరిష్కరించుకుందామన్న ఆశతో వచ్చాను తమతెలివి తక్కువలో, మనుష్యులు మాట్లాడే మాటలు మీకు తెలిసినవేగదా? అన్నాడు నేను అలాగే రండి, తరచిచూద్దామన్నాను", ఇద్దరం సంభాషించుకున్నాం, ఆయన చాలాసార్లే వచ్చాడు రెండవ వారం గడిచిన తర్వాత, "నాకు భయంకరమైన కలలు వస్తున్నాయి, భీతావహంగా ఉన్నాయి నాచుట్టూ ఉన్న ప్రతి ఒక్కటి కనిపించకుండాపోతున్నది అన్నీ అదృశ్యమైపోతున్నాయి," అన్నాడు కొంతసేపు ఆగి, "బహుశ, నాలోకి నేను తరచిచూచుకున్నదాని ఫలితం యిదే అయ్యుంటుంది ఇందులోని ప్రమాదాన్ని నేను గ్రహించాను" అన్నాడు ఆ తర్వాత ఆయన మరిరాలేదు

మనమందరం క్షేమంగా ఉండాలనుకుంటాము, మన ఈ చిట్టి, అత్యల్పమైన లోకంలో సురక్షితంగా ఉండాలని కోర్తాం, చక్కని క్రమతగల ఈ ప్రపంచంలో నిజానికి క్రమంలేనప్పటికీ, దానిలోనూ, మన ప్రత్యేక సంబంధాల ప్రపంచంలోనూ ఏ అలజడీ రాకూడదంటాం – భార్యాభర్తల సంబంధమే చూడండి, ఒకరినొకరు విడువకుండా, కలిసి జీవిస్తున్నప్పటికీ – అందులో దుఃఖం, అపనమ్మకం, భయం ఉన్నాయి అందులోని ప్రమాదం – అసూయ, ఆగ్రహం, ఆధిపత్యాలు

నిర్భయంగా, ప్రమాదరహితంగా మనలోకి మనం చూచుకునే మార్గం ఒకటి ఉన్నది, తననుతాను నిందించుకోకుండా, సమర్థించుకోకుండా, వ్యాఖ్యానించకుండా.

తీర్పు – తీర్మానం చేయకుండా, విలువకట్టకుండా కేవలం, చూడటం మాత్రమే చేయాలి అలా చేయడానికి, వాస్తవంగా ఉన్నదానిని, పరిశీలించే సమయంలో నేర్చుకొనడానికి మనసు తహతహలాడాలి 'ఉన్న స్థితి'లో ఉన్న ప్రమాదం ఏమిటి? మనుష్యులు హింసాపరులు, నిజంగా 'ఉన్నస్థితి' అది, వారిలోని హింసాగుణంవల్లనే ఈ ప్రపంచమింత ప్రమాదభరితం అయింది, హింసించాలనే తత్వం, భయం యొక్క ఫలితమే దానిని పరిశీలించడంలో, ఆ భయాన్ని పూర్తిగా నిర్మూలించే ప్రయత్నం చేయడంలో ఉండే ప్రమాదం ఏమిటి? – భిన్న సమాజాన్నీ, భిన్నమైన విలువల్నీ నెలకొల్పుతామేమోననా?

అంతరంగంలోని మానసిక రంగంలోని విషయాలను యధాతథంగా పరిశీలంచడంలో, ఓ గొప్ప అందం ఉన్నది, దీనర్థం, విషయాలను ఉన్నవి ఉన్నట్లుగా అంగీకరించడం కాదు; 'ఉన్నస్థితి'ని తిరస్కరించమనీ, దానిని గురించి ఏదో చేయమనీ అనడంలేదు 'ఉన్నస్థితి'ని గ్రహించిన ఎరుకే, తనలోతానే ఉత్పరివర్తనాన్ని తీసుకువస్తుంది అయితే, మనిషి 'చూసే' కళను తెలుసుకోవాలి 'చూసేకళ', అంటే, అంతర్మథన కళాకాదు లేక అంతర్విశ్లేషణ కళాకాదు, కేవలం ఎంపిక ఏమాత్రం లేకుండా పరిశీలించాలి

**ప్రశ్న: అప్పటికప్పుడు ఆకస్మికంగా కలిగే భయం లేదా?**

**కృష్ణమూర్తి:** మీరు దానిని భయం అంటారా? అగ్ని దహిస్తుందని ఎరిగినపుడు, కొండకొసను చేరామని తెలిసినపుడు దాని నుంచి ఒక్క గంతువేసి దూరంపోవడం, భయం వల్లనా?

అలాగే ఓ అడవిజంతువునికానీ, ఓ సర్పాన్నికానీ చూసినపుడు వెనక్కి అడుగువేయడం, భయం చేతనా? – లేక అది తెలివై వుంటుందా? కొండకొస వద్ద పొంచి వుండే ప్రమాదాల విషయంలో నిబద్ధీకరింపబడ్డారు కాబట్టి, ఆ తెలివి, నిబద్ధత యొక్క ఫలితం అయ్యుండవచ్చు, అదే లేనట్లయితే, మీరు పడిపోవడం, అంతటితో అంతమైపోవడం జరిగేది మీ తెలివి మిమ్మల్ని జాగ్రత్తగా ఉండమని హెచ్చరిస్తున్నది, ఆ తెలివిని భయమనగలమా? అయితే, మనల్ని మనం వేర్వేరు జాతులకు, వేర్వేరు మతాలకు చెందిన సమూహాలుగా విభజించుకోవటంలో తెలివి ప్రవర్తిల్లుతున్నదా? – మీకూ – నాకూ మధ్య, మనకు – వారికీ మధ్య, మనం బేధం చేసినపుడు, అది తెలివి అవుతుందా? ప్రమాదాలకు దారితీసే, మనుష్యుల్నీ వేరుచేసే, యుద్ధాలకు దారితీసే ఈ భేదక్రియలో తెలివి ప్రవర్తిల్లుతున్నదా లేక భయమా? అక్కడ ఉన్నది భయమే, తెలివికాదు మరో విధంగా చెప్పాలంటే, మనల్ని మనం ముక్కలు చేసుకున్నాము, మనలో ఒక భాగం అవసరమైనపుడు తెలివితో వుంటున్నది– కొండకొస నుంచిగానీ, అటువైపు వెడుతున్న బస్సు నుంచిగానీ తప్పించుకోవడంలోలాగా కానీ జాతీయతలోని ప్రమాదాన్ని, మనుష్యుల్ని విభజించి వ్యవహరించడంలోని ప్రమాదాన్ని చూడటానికి, తగినంత తెలివి మనలో లేదు కనుక, మనలో ఒక భాగం – అత్యల్ప భాగం – తెలివితో ఉంటున్నది మిగిలిన దానిలో లేదు ఎక్కడైతే శకలాలుగా చేసుకోవడం జరుగుతుందో, అక్కడ ఘర్షణ ఉండకతప్పదు, అక్కడ దుఃఖం ఉండి తీరుతుంది, ఘర్షణలోని సారసంగ్రహం ఈ విభజనే, మనలోని ఈ వైరుధ్యాలే ఆ వైరుధ్యాలు సమన్వయించబడేవికాదు మనల్ని

మనం సమన్వయించుకోవాలి అనటం, మన వింత నైజాలలో ఒకటి. దాని అర్థమేమిటో నాకు మాత్రం బోధపడదు విభజించబడి, వ్యతిరేకిస్తున్న రెండు స్వభావాలను సమైక్యం చేయబోతున్న వారెవరు? సమన్వయించ బూనుకున్న ఆ వ్యక్తి కూడ ఆ విభజనలో భాగమే కదా! కానీ, మనిషి కనుక ఆ మొత్తాన్నీ చూసినపుడు, ఎంపికలేకుండా దానిని గ్రహించినపుడు – అక్కడ విభజన ఉండనే ఉండదు

**ప్రశ్న: సరైన ఆలోచన, సరైన చర్యల మధ్య భేదమేమైనా ఉన్నదా?**

**కృష్ణమూర్తి:** ఆలోచన – చర్యలను మీరు సరైన అన్న పదంతో వర్ణిస్తే ఆ 'సరైన' చర్య 'సరికాని' చర్య అవుతుంది – అవునా? మీరు 'సరైన' అనే పదం వాడుతున్నారంటేనే, సరైన దేమిటో, అప్పటికే మీకో అభిప్రాయం ఏర్పడిందన్నమాట ఏది 'సరైనది' అని మీరభిప్రాయపడ్డారో, అది 'సరైనదే'కాదు, కారణమేమంటే, ఆ 'సరైన చర్య' మీ పూర్వాభిప్రాయాల మీద, మీ నిబద్ధత మీద, మీ భయం మీద, మీ సంస్కృతి మీద, మీ సమాజం మీద, మీ స్వంత, వింత భావాలు, భయాలు, మతపరమైన ఆంక్షలు వగైరాల మీద ఆధారపడి వుంటుంది మీకు కొన్ని నీతి – నియమాలు, ఉన్నాయి నియమాలతో కూడిన ఆ నమూనాయే సరైనది కాదు, నీతి బాహ్యామైనది. సమాజనీతిలో నీతిలేదు దానికి మీరంగీకరిస్తారా? అంగీకరిస్తే, మీరు ఆ సామాజిక నీతిని తిరస్కరించినట్లే, దానర్థం దురాశ, ఈర్ష్య, అసూయ, ఆకాంక్షాపరత్వం, జాతీయతావాదం, వర్గారాధన, అలాగే మిగిలిన వాటినీ తిరస్కరించి, 'అవును, సమాజ నీతిలో నీతి మృగ్యమైంది' అని మీరంటారు మరి ఆ మాట మీరు నిజంగా అంటున్నారా, లేక, కేవలం ఏవో నాలుగు పదాలు మాత్రమే ఉచ్చరిస్తున్నారా? సర్, జీవితంలో నిజమైన నీతి, నిజమైన గుణం కలిగుండటమనేది అత్యంత అసాధారణమైన విషయాలలో ఒకటి, అలాంటి నీతికీ, సమాజ పరిసరాల ప్రభావాలతో మలచబడిన ప్రవర్తనకీ సంబంధమేమాత్రం ఉండదు మనిషి నిజంగా గుణవంతుడవాలంటే స్వేచ్ఛకావాలి సమాజనీతిగా వర్తిల్లే దురాశ, అసూయ, పోటీ – స్పర్థ, విజయారాధన వంటివాటిని మీరనుసరిస్తున్నంతకాలం మీకు స్వేచ్ఛలేదు – మతపెద్దలు, సంఘపెద్దలు నీతిగా పరిగణించేవన్నీ మీకు తెలిసినవేగదా

**ప్రశ్న: ఇది సంభవించేవరకు మేము వేచి ఉండవలసిందేనా! లేక మేము పాటించదగు క్రమశిక్షణ ఏమైనా ఉన్నదా?**

**కృష్ణమూర్తి:** చూచుటే చేయుట అని గ్రహించడానికి క్రమశిక్షణ అవసరమంటారా? అవసరమా?

**ప్రశ్న: నిశ్చలమైన మనసు గురించి మాట్లాడుతారా-క్రమశిక్షణతో అది లభిస్తుందా? లభించదా?**

**కృష్ణమూర్తి:** సర్, చూడండి, సైనిక విన్యాసాలు చేసే మైదానంలో, ఓ సైనికుడు, చేతిలో తుపాకిని సరిగ్గా పట్టుకుని, నిశ్చలంగా, నిరారుగా నిల్చుంటాడు. అతని చేత డ్రిల్లు చేయిస్తారు, రోజూరోజూ ప్రతిరోజూ డ్రిల్లు చేయిస్తారు, అతనికే మాత్రం స్వేచ్ఛలేకుండా చేస్తారు అతను చాలా నెమ్మదిగా ఉంటాడు అయితే దానిని నిశ్చలత అందామా? చిన్నపిల్లవాడు ఒక బొమ్మలో లీనమైపోతే, అది ప్రశాంతత అవుతుందా?

– ఆ బొమ్మని తీసేయండి, పిల్లవాడు తన సహజ స్థితికి వచ్చేస్తాడు క్రమశిక్షణతో (సర్, ఎప్పటికీ గుర్తుండేలాగా అర్థం చేసుకోండి ఇది చాలా సులభం) క్రమశిక్షణ నిశ్చలతని తీసుకువస్తుందా! అది మందకొడితనాన్ని, స్తబ్ధుగా ఉండే లక్షణాన్ని తీసుకురావచ్చు, కానీ తీవ్రమైన చురుకుదనం కలిగుంటూనే, నిశ్చలంగా ఉండగలిగే స్థితిని తీసుకురాగలదా?

**ప్రశ్న: సర్, ఈ ప్రపంచంలో ఇక్కడ ఉండవల్సిన మమ్మల్ని మీరేమి చేయమంటారు?**

**కృష్ణమూర్తి:** చాలా సులభం, సర్ నాకేమీ అఖ్ఖర్లేదు అది మొదటిది రెండవది జీవించండి, ఈ ప్రపంచంలో జీవించమంటున్నాను ఈ ప్రపంచం అత్యద్భుత సౌందర్యభరితమైనది ఇది మన ప్రపంచం, మనం జీవించడానికే ఉన్నదీ పుడమి కానీ మనం జీవించడంలేదు మనం సంకుచిత మనస్కులం, మనల్ని మనం విడదీసుకున్నాం, ఆందోళనాభరితులం, భీతావహులం అందువల్ల మనం జీవించడంలేదు మనకు దేనితోనూ సంబంధంలేదు అందుచేత, ఏ కాకులమై నిరాశతో క్రుంగిపోయినాం ఆనందంతో, మహదానందంతో జీవించడమంటే ఏమిటో మనకు తెలియడంలేదు మనిషి తనలోని మూర్ఖత్వాన్నంతా వదిలించుకోవడమెలాగో తెలుసుకున్నప్పుడు మాత్రమే అతడు ఆ విధంగా జీవించగలడని నేను చెప్తున్నాను

మనిషి తన తోటి మనుష్యులతోనే కాక, భావాలతో, ప్రకృతితో, ప్రతి ఒక్కదానితో తనకి గల సంబంధాన్ని ఎఱుకతో చూడగలిగినప్పుడు మాత్రమే ఆ మూర్ఖత్వాన్నుంచి స్వేచ్ఛనొందటం సాధ్యం అవుతుంది

అలాంటి సంబంధంలోనే, మనిషి తానేమిటో, తన భయం, ఆందోళన, నైరాశ్యం, ఒంటరితనాలేమిటో, తనలోని ప్రేమ రాహిత్యమేమిటో కనుగొనగలడు ఇతరులు చెప్పిన సిద్ధాంతాలు, వారి పదజాలం, తత్సంబంధిత విజ్ఞానం మనిషి కెంతైనా వున్నది, తనని గురించి మాత్రం అతనికేమీ తెలియటంలేదు – అందువల్లనే, అతనికి ఎలా జీవించాలనేది తెలియడంలేదు

**ప్రశ్న: మానవ మస్తిష్కానికి సంబంధించి, చేతనలోని వివిధ స్థాయిలను గురించి మీరేమంటారు? మెదడు దైహికమనీ, మనసు మాత్రం దైహికం కాదనీ, అనిపిస్తుంది. పైగా, మనసులో, వ్యక్తమౌతున్న భాగం, అవ్యక్తంగా ఉన్న భాగం, ఉన్నట్లుతోస్తుంది. ఈ వివిధ భావాల మధ్య మేము స్పష్టంగా ఎలా చూడగలం?**

**కృష్ణమూర్తి:** మనసు – మెదడుల మధ్య బేధమేమిటి అని గదా ప్రశ్న, అంతేనా, సర్, దేహంలో భాగమైన ఈ మెదడు, గత వేలాది సంవత్సరాలుగా, తాను పొందిన అనుభవాలు, వాటి తాలూకు జ్ఞాపకాలు, సేకరించిన విజ్ఞానం తనలో యిముడ్చుకుంటూ, పరిణామ క్రమంలో రూపుదిద్దుకుంటూ వచ్చిన – ఈ మెదడు మొత్తం మనసులో ఒక భాగం కాదా? – స్థాయీ బేధం తప్ప, అందులో వ్యక్తమౌతున్నది, వ్యక్తం కాకుండా ఉన్నది, రెండూ ఉన్నట్లే కదా? భౌతికమేకాక, భౌతికం కాని–మానసికమైన దానితో సహా, ఆ మొత్తం ఒక్కటి కాదా? దానిని వ్యక్తం అవుతున్నదీ, వ్యక్తంకానిదీ, మెదడు–మెదడుకానిదని విభజించినది మనం కాదా? ఆ మొత్తాన్నీ సంపూర్ణంగా, అవిభాజ్యంగా చూడలేమా?

అవ్యక్తంగా ఉన్నది, వ్యక్తమౌతున్న దానికి అంత భిన్నంగా ఉన్నదా? మనం దానిని విభజించబట్టిగానీ, అది మొత్తంలో భాగం కాదా? అందులో నుంచి ఓ ప్రశ్న ఉదయిస్తుంది వ్యక్తమౌతున్న భాగం అవ్యక్తరూపంలో ఉన్న దాని నెలా తెలుసుకోగలదు? దినమంతా పనిచేస్తూ, - నిశ్చయభావంతో ఉండే మనసు - అవ్యక్తంగా లోన ఉన్న దానిని పరిశీలించగలదా?

విషయాన్ని తరచి చూడటానికి మనకు సమయం ఎంత ఉన్నదో నాకు తెలియదు మీరు అలిసిపోలేదా? సర్, వెచ్చని గదిలో కూర్చుని ఎవరి కంఠ స్వరాన్నో వింటూ, దీనిని ఒక వినోదంగా దిగజార్చకండి మనం అత్యంత గంభీరమైన విషయాలతో వ్యవహరిస్తున్నాము, దీనికి ఎంతో శ్రమించాలి, మీరు కనుక అలా చేసివుంటే, అలిసిపోయే వుంటారు మెదడు తడవకు కొంతవరకు మాత్రమే స్వీకరించగలదు ఈ అవ్యక్తము - వ్యక్తములకు సంబంధించిన విషయాన్ని పరిశీలించుటకు చాలా పదునైన, స్పష్టమైన మనసు అవసరం. గంటన్నరసేపు సాగిన ఈ సంభాషణ తర్వాత, మీకు అంతశక్తి వుంటుందనుకోను. మీ అంగీకారంతో మనం ఈ ప్రశ్నను తర్వాత తీసుకుందామా?

*లండన్, మార్చి 16,1969*

# 2. విచ్ఛిన్నత

## విభజన, వ్యక్తము, అవ్యక్తము, 'తెలిసినదానికి' మరణించుట

మనం ఈ సాయంత్రం, వ్యక్తము - అవ్యక్తము, ఉపరితలపు మనసు - చేతన లోతుల్లోని పొరలు అనే అంశాలను గురించి మాట్లాడదల్చుకున్నాము మనం మన జీవితాన్ని శకలాలుగా - వ్యాపార జీవితం, సాంఘిక జీవితం, సాంసారిక జీవితం, మతపర జీవితం, క్రీడాజీవితమంటూ, విభజించటం యెందుకో నాకు విస్మయం కలిగిస్తుంది స్వంత జీవితాన్ని, ఇలా విభజించుకోవటమే కాక, సమాజంలోనూ, మనము - వారు, మీరు - నేను, ప్రేమ - ద్వేషం, మరణం - జీవనం అంటూ ఎందుకు వేరుచేసినట్లు? జీవన - మరణాల మధ్య, చేతన - అచేతనల మధ్య, వాణిజ్య - సామాజిక జీవనాల మధ్య, కుటుంబ - వ్యక్తిగత జీవితాల మధ్య అంతరమెంత మాత్రం లేని ఒక జీవిత విధానం ఉన్నదా అని కనుగొనడానికి, విషయాన్ని లోతుగా తరచిచూడవలసి వున్నదనుకుంటున్నాను

జాతుల మధ్య, మతాల మధ్య, వర్గాల మధ్య ఏర్పడిన ఈ విభజనలే మనిషిలో ఇంత వేర్పాటు తనాన్ని ప్రోదిచేసినాయి, అందులో వైరుధ్య మెంతగానో ఉన్నది - మనమీ విధంగా ఎందుకు జీవించాలి? ఇది పెంచుతున్న గందరగోళం, సంఘర్షణ, యుద్ధం అంతా యింతాకాదు, ఇది బాహ్యంలోనే కాక, అంతరంగంలోను అచ్చమైన అభద్రతను తెచ్చిపెట్టింది

దైవం - దయ్యం, మంచి చెడు, 'ఉండాలనుకున్నది' 'ఉన్నది' మధ్య అంతరం అమితంగా ఉన్నది

ఈ సాయంత్రం మనం భిన్న జీవితవిధానాన్ని కనుగొనే ప్రయత్నం చేస్తే అది, ఎంతో ప్రయోజనకరం సిద్ధాంతపరంగా లేక మేధాపరంగా కాకుండా, వాస్తవ జీవిత విధానంలో - విభజన ఎంత మాత్రం లేకుండా, అందులోని చర్యలు ముక్కలు అవకుండా, ప్రతిచర్య, ఇతర చర్యలన్నిటితో సంబంధం కలిగివుంటూ, ఆ మొత్తం, నిరంతరం, ఏకైక ధారగా సాగిపోగల జీవిత విధానాన్ని కనుగొనవలసివున్నది

విచ్ఛిన్నంకాని జీవన విధానాన్ని కనుగొనటానికి, ప్రేమ - మరణం అనే అంశాలను తరచి చూడవలసి వున్నది వాటిని కనుక అర్థం చేసుకుంటే, అవిభాజ్యంగా, అనుస్యూతంగా, అమితమైన తెలివితో భాసిల్లే జీవిత విధానం మనకు స్ఫురించవచ్చు విచ్ఛిన్నం అయిన మనసులో తెలివి లోపిస్తుంది, పలురంగాలలో,

పలురకాలుగా జీవితం గడిపే వ్యక్తి, ఎంత నీతిమంతుడిగా పేరు పొందినా – అందులో తెలివిలోపించినట్లే లెఖ్ఖ

చీలికలు వాలికలైపోయిన వివిధ భాగాలను దగ్గరకు చేర్చి, పూర్ణం చేద్దామనుకోవడం, తెలివిగలపని కాదనేది స్పష్టం కారణమేమంటే, అందులో సమన్వయ కర్త యిమిడి ఉంటాడు అన్ని భాగాలను, కూర్చి, సమన్వయించాలనుకున్న వ్యక్తి కూడా విచ్ఛినమైన భాగాలలో ఒక భాగమే కదా!

మనిషి జీవితంలో, సమూల విప్లవం సంభవించాలంటే, కావలసింది అమితమైన తెలివి, గాఢాభినివేశం అపుడే పరస్పర విరుద్ధమైన చర్యలు లేకుండా అది సతతం సంపూర్ణంగా సాగే చలనమౌతుంది మనిషి జీవితంలో అటువంటి మార్పు తీసుకురావలెనంటే గాఢాభినివేశం కావాలి పరమ ప్రయోజనకరమైనదేమైనా చేయవలెనంటే, మనిషిలో ఈ గాఢాభినివేశం ఉండితీరాలి – అది సుఖం కానేరదు విచ్ఛిన్నం కాని, వైరుధ్యంలేని అలాంటి చర్యను, అర్థం చేసుకోవాలంటే, ఈ గాఢాభినివేశం ఉండక తప్పదు మేధకు సంబంధించిన భావాలుగానీ, సూత్రాలుగానీ మనిషి జీవిత విధానాన్ని మార్చలేవు 'ఉన్నస్థితి'ని అర్థం చేసుకోవడంలో మాత్రమే మార్పు సాధ్యమౌతుంది దానికోసం, మనిషిలో, ఈ తీవ్రత, గాఢాభినివేశం ఉండాలి

దైనందిన జీవితంలోనే, ఎక్కడో సన్యాసాశ్రమ జీవితంలో కాదు – ఈ గాఢాభి నివేశమూ, తెలివీ కలిసి ప్రవర్తిల్లే గుణం ఉన్న జీవిత విధానాన్ని కనుగొనాలంటే, మనిషి సుఖస్వరూపాన్ని గురించి అర్థం చేసుకోవలసివున్నది ఇంతకు ముందొక రోజున మనం సుఖం అనే అంశాన్ని తరచిచూశాము, ఏ అనుభవమైనా ఒక క్షణకాలం ఆనందం యిచ్చినట్లయితే, ఆలోచన మనసులో దానినెలా నిలుపుతుంటుందో, దానిని గురించి మనం ఆలోచిస్తుంటే ఆ సంతోషం ఎలా స్థిరపడి పోతుంటుందో చూశాము. ఎక్కడ సుఖం ఉంటుందో అక్కడ బాధ, భయం ఉండకతప్పవు ప్రేమ సుఖమవుతుందా? మనలో చాలమందికి ఉండే నైతిక విలువలు సుఖం మీదనే ఆధారపడ్డాయి, ఉన్నతమూ, ఉదాత్తమూ, అదేదైనా కానీ, దాని కోసం తననుతాను త్యాగం చేయాలనుకున్నా, దాని ననుసరించటం కోసం, తననుతాను, అదుపులో పెట్టుకుంటున్నా, అది సుఖం యొక్క ప్రేరణే, ప్రేమ సుఖాన్నిచ్చే ఒక వస్తువా? పైగా, 'ప్రేమ' అనే పదం అనేకార్థాలతో బరువెక్కిపోయింది ప్రతివారు రాజకీయవాదుల వద్ద నుంచి, భార్యాభర్తల వరకు ఆ పదాన్ని బహుతేలికగా వాడేస్తున్నారు కానీ, ఆ పదానికి ఉన్న లోతైన అర్థాన్ని బట్టి చూస్తే, ఆ ప్రేమ మాత్రమే, ఎంత మాత్రం విచ్ఛిన్నమవని జీవిత విధానాన్ని తీసుకురాగలదు భయం ఎప్పుడూ సుఖంలో భాగమే, సంబంధాలలో ఎక్కడ ఏ రకమైన భయం ఉన్నా అక్కడ చీలికలూ తప్పవు అప్పుడు విభజనా తప్పదు

ఇది నిజంగానే ఒక లోతైన విషయం మనిషి మనస్సెపుడూ, ఇతరుల ఎడల వ్యతిరిక్త భావంతో, తననుతాను ఎందుకు విభజించుకుంటుందో, తత్ఫలితంగా జనించే హింస ద్వారా తానేమి సాధించదల్చుకున్నదో, తరచి చూడాలి మానవ మాత్రులమైన మనం, యుద్ధానికి దారితీసే జీవిత విధానానికే కట్టుపడివుంటున్నప్పటికీ, అదే సమయంలో మనం శాంతి కావాలీ అంటాం, స్వేచ్ఛ కావాలీ అంటాం అయితే, మనం

కోరే శాంతి భావపరమే, సిద్ధాంతపరమే, ఈ మధ్యలో మనం చేసే ప్రతిచర్య మానల్ని నిబద్ధిస్తుస్తూనే వుంటుంది

మానసికరంగంలో, కాలానికి సంబంధించి, ఒక విభజన జరిగింది గతము (నిన్నటిది), నేడు, రేపు అని విభజించారు ఈ విధమైన విభజనే లేని జీవిత విధానం ఉన్నదేమో, కనుగొనటానికి ఈ అంశాన్ని విచారణ చేయాలి అంతర్గతంగా కాలాన్ని గత, వర్తమాన భవిష్యత్తులుగా – విడగొట్టటమే, విభజనకు కారణమైనదా అనే విషయాన్ని పరిగణించాలి మెదడునంతా, జ్ఞప్తి రూపంలో నింపివేసిన గతం – అనగా 'తెలిసినది' - అదే విభజనను తెస్తున్నదా? లేక, 'పరిశీలకుడు', 'అనుభవిస్తున్నవాడు', 'ఆలోచించేవాడు'–తాను పరిశీలిస్తున్నదాన్నుంచి, అనుభవిస్తున్నదాన్నుంచి ఎప్పుడూ ఎడంగా ఉండటమే విభజనకు కారణమౌతున్నదా? లేక అహంభావ – స్వార్థపూరిత చర్యలు, అనగా, 'నేను', 'మీరు' అంటూ విడిపోయి, సృష్టించే ప్రతిఘటనలు, వేర్వేరు వ్యాపకాలు – ఇవే విభజనకు కారణమా? ఈ విషయ విచారణలో, మనిషి ఈ అంశాలనన్నిటినీ తెలుసుకుని వుండాలి, కాలము, 'పరిశీలకుడు' పరిశీలించబడే విషయం నుంచి తననుతాను వేరు చేసుకొనుట, అనుభవించేవాడు అనుభవానికి భిన్నమనుకొనుట, సుఖం, ఈ మొత్తానికీ ప్రేమకీ సంబంధమేదైనా ఉన్నదా అనేది చూడాలి

ఆలోచన సృష్టించబట్టి కానీ – మానసికరంగంలో, రేపు అనేది నిజంగా ఉన్నదా! వ్యావహారిక కాలమానంలో రేపు అనేది ఉన్నది, మనసులోనూ, మానసికరంగంలోనూ రేపు అనేది నిజంగా ఉన్నదా? భావరూపంలో రేపు అనేది వుంటే అప్పటి చర్య అసంపూర్ణమౌతుంది అటువంటి చర్య విభజనకు, వైరుధ్యానికి దారితీస్తుంది రేపు – భవిష్యత్తు, ఉన్నవి అని భావించడమే – నేటి పరిస్థితుల్ని మనం స్పష్టంగా చూడలేకపోవడానికి కారణం – అవునా? 'నేను రేపు మరింత స్పష్టంగా చూస్తానులే', అంటుంటారు మనిషి బద్ధకస్థుడు, కనుగొని తీరాలన్న తీవ్రాభినివేశమూలేదు, గాఢాసక్తీలేదు చివరికెలాగో చేరుకుంటాములే, తుదకు అర్థం అవుతుందిలే అనే భావాల్ని ఆలోచన సృష్టిస్తుంటుంది, అలాగైతే, కాలం అవసరమే, ఎన్నో రోజులు కావాలి. కాలం అవగాహనను తెస్తుందా, మనిషికి స్పష్టంగా చూడగల శక్తినిస్తుందా?

మనసు గతము నుంచి విడవడగలదా, అపుడే అది కాలంచేత బంధింపబడదు మానసికరంగంలో, రేపు అనేది దానికి తెలిసిన పరిధిలోనే వుంటుంది; అలా అయితే, తెలిసిన దానినుండి అది విముక్తి చెందడం సాధ్యమౌతుందా? తెలిసినదానితో సంబంధం లేని చర్య జరిగే అవకాశం ఉన్నదా?

మనుష్యుల మధ్య భావప్రసారం అతికష్టమైన విషయాల్లో ఒకటి వాగ్రూపకమైన ప్రసారం తప్పదనేది స్పష్టం, కానీ అంతకన్నా లోతుగా జరిగే ప్రసారస్థాయి మరొకటి ఉన్నదని నేననుకుంటాను. పదాలతో జరిగే సంధానమే కాక హృదయానుసంధానం ఉండాలి. అందులో ఇద్దరమూ, సమాన స్థాయిలో, సమాన తీవ్రతతో, సమాన గాఢాభి నివేశంతో పాల్గొంటాం; అపుడు మాత్రమే అనుసంధానం సంభవిస్తుంది. అది పదాలతో జరిగే భావప్రసారంకన్నా అత్యంత ప్రధానమైనది మనం ఇపుడు మాట్లాడుకుంటున్నది, జటిలమైనటువంటిదీ, నిత్యజీవితపు లోతులను స్పృశించేదీ అయిన విషయం కనుక,

పదాలతో జరిగే సంధానమే కాక, హృదయానుసంధానం కూడ అవసరం మానసికరంగంలో సంభవించాల్సిన సమూల విప్లవం గురించే మనకు శ్రద్ధ అది ఎపుడో, సుదూర భవిష్యత్తులో కాదు, ఇప్పటికిప్పుడే, ఈ రోజే, ఇంతగా నిబద్ధింపబడిన ఈ మానవుని మనసు తక్షణం మారగలదేమో మనం కనుక్కోవాలి అలా మారిన మనసులోని చర్య సతతం సంపూర్ణంగా వుంటుంది, ముక్కలవదు, కనుక పశ్చాత్తాపాలు, ఆశాభంగాలు, బాధలు, భయాలు, ఆదుర్దాలు, అపరాధ భావనలు వగైరాలతో మనసు తూట్లుపడదు ఆ మొత్తాన్ని మనసు బయటకు తోసేసి, సంపూర్ణ స్వేచ్ఛతో, యవ్వనస్ఫూర్తితో, నిష్కపటంగా ఎలా ఉండగలదు? అదీ, అసలు ప్రశ్న. పరిశీలకునికీ – పరిశీలించబడేదానికీ, అనుభోక్తకీ – అనుభవించబడే దానికే మధ్య విభజన ఉన్నంతవరకు – అలాంటి సమూల విప్లవం, సాధ్యపడుతుందనుకోను ఈ విభజనే ఘర్షణను తీసుకువస్తుంది విభజన ఎక్కడ, ఏ రూపంలో ఉన్నా, ఘర్షణలు రాకమానవు, ఘర్షించడం ద్వారా, పోరు ద్వారా, పోరాటాల ద్వారా, పైపై మార్పులు కొన్ని సంభవించవచ్చునేమోగానీ, లోతైన మానసిక పరిధిలో మార్పు రాజాలదు అనేది స్పష్టం కనుక, ఈ మనసు, ఈ హృదయం, ఈ మెదడు, ఈ మొత్తం స్థితి విభజన అనే ఈ సమస్యతో ఎలా వ్యవహరించగలదు?

మనం వ్యక్తచేతన – లోలోని పొరలు అనగా 'అవ్యక్తచేతన' అనే అంశాన్ని తరచి చూద్దామనుకున్నాము ఈ విభజన ఎందుకు ఏర్పడిందని అడుగుతున్నాము; వ్యక్తమౌతున్న మనసులో – దాని దైనందిన వ్యాసంగాలు, చింతలు, సమస్యలు, లోతులేని సంతోషాలు, జీవనోపాధి నిమిత్తం సంపాదన మొదలైన వాటితో నిండిపోయింది ఇక మనసు లోపలి పొరల్లో – నిగూఢమైన ఉద్దేశ్యాలు, దాని వాంఛలు, బలవంతపరిచే కోర్కెలు, దాని భయాలు ఉంటాయి ఈ రెంటి మధ్య విభజన ఎందుకున్నట్లు? కృత్రిమమైన వినోదాలతో, వేడుకలతో – అవి మతపరంగానీ, మరితరంగానీ, వాటినే నిరంతరం కోరుతూ, అనంతంగా వదరుతూ, లోతులేని వ్యాపకాలతో మనం, మనసుని నింపుకున్నందువల్లనే, ఈ విభజన జనిస్తున్నదా? కారణమేమంటే, ఈ విభజన ఉన్నంతకాలం పైపై మనసు, తనలోకి తాను లోతుగా తవ్వుకుంటూ పోజాలదు.

మనసు లోలోపలి పొరల్లో నున్న విషయమేమిటి?– మానసిక శాస్త్రజ్ఞులైన, ఫ్రాయిడ్ వంటి వారి ప్రకారం కాదు – వారందరూ చెప్పినదానిని మీరు చదవకుండానే ఎలా తెలుసుకుంటారు? మీలో అవ్యక్తంగా ఉన్నదేమిటో ఎలా కనుగొంటారు? మీరు దానిని గమనిస్తారు, అవునా? లేక, మీకు వచ్చే స్వప్నాలను వివరించడం ద్వారా, మీలో అవ్యక్తంగా ఉన్నదానిని తెలుసుకోవచ్చుననుకుంటున్నారా! ఆ స్వప్నాలను అనువదించబోతున్న వారెవరు? ఆ నిపుణులా? – వారు కూడ వారి ప్రత్యేక నైపుణ్యంతో నిబర్ధించబడే వుంటారు ఇపుడు

**ప్రశ్న: అసలు స్వప్నాలే లేకుండా నిద్రించటం సాధ్యమేనా? – సరిపడని ఆహారం తీసుకున్నందువల్ల, సాయంకాలం, అతిగా భుజించినందువల్ల వచ్చే పీడకలలను మినహాయిస్తే.**

**కృష్ణమూర్తి:** అవ్యక్తచేతన – ప్రస్తుతానికీ పదం వాడుదాం–అది దేనితో నిర్మితమైంది? – గతంతో అనేది స్పష్టం, మొత్తం స్వజాతీ చైతన్యం, దాని శేషం, కుటుంబ

సంప్రదాయం, వివిధ మత,సమాజ ప్రభావాలు-లోనదాగి, చీకటిలో కనుగొనబడకుండా ఉన్నాయి, ఆ మొత్తాన్ని స్వప్నాలు లేకుండా, కనుగొనటానికి, బహిర్గతం చేయటానికి వీలవుతుందా - విశ్లేషకుని వద్దకు వెళ్ళకుండానే! - అలా చేసినపుడు నిరంతరం చురుకుగా ప్రవర్తిల్లే ఆ మనసు, నిద్రించిన వేళలో నిశ్శబ్దమైపోతుంది మనసు ఆ విధంగా నిశ్చలమైంది కాబట్టి, నిత్యజీవితంలోని ఆందోళనలు, భయాలు, చింతలు, సమస్యలు, అత్యవసరంగా చేయవల్సిన పనులకు సంబంధం లేని భిన్న గుణాన్ని, భిన్న చైతన్యాన్ని ఆ మనసు అందుకోవచ్చునేమో! అది కనిపెట్టటం - సాధ్యమైతే - అనగా స్వప్నాలే లేకుండా నిద్రించటమెలా అనే విషయం అలా నిద్రించిన మనసు, మర్నాటి ఉదయం, మేల్కొంచినపుడు, దానిలో నిజంగానే తాజాదనం ఉట్టిపడుతుంది పగటివేళలో, అది జాగరూకతలో ఉంటూ, లోనుండి అందుతున్న సూచనలను, సంజ్ఞలను గ్రహిస్తూ వుండాలి ఇదంతా, మనిషి తన సంబంధాలలోనే కనుగొనగలడు ఇతరులతో మీకుగల సంబంధాన్ని గమనిస్తూ, గర్హించకుండా, తీర్పుచెప్పకుండా, విలువకట్టకుండా, కేవలం మీరెలా ప్రవర్తిస్తున్నారో, మీ ప్రతిక్రియలెలా వున్నాయో అలా గమనిస్తూ వుండాలి, ఎంపిక లేకుండా చూస్తూవుండాలి, అలా కేవలం పరిశీలిస్తూవున్నప్పుడు, ఆ పగటి సమయమందే, లోనదాగి ఉన్న అవ్యక్తచేతన వెలికితేబడుతుంది

మనం ఈ అవ్యక్తచేతనకు, ఇంతలోతైన ప్రాధాన్యతను అర్థాన్ని ఎందుకు కల్పిస్తున్నాం? - ఎంతయినా, వ్యక్తచేతన ఎంత అల్పమైనదో, ఇదికూడా అంతే వ్యక్తమౌతున్న మనసు కనుక అసాధారణమైన చురుకుదనంతో, గమనిస్తూ, వింటూ, చూస్తూ ఉనట్లయితే, వ్యక్తమౌతున్నమనసు, వ్యక్తం కాకుండా ఉన్నదానికన్నా అత్యంత ప్రాధాన్యతను కలిగివుంటుంది, ఆ స్థితిలో అవ్యక్తచేతనలోని విషయాలన్నీ బైటికి వచ్చేస్తాయి, వివిధ పొరల మధ్య నున్న విభజన అంతమౌతుంది బస్సులో కూర్చున్నా, మీ భార్యతో, లేక మీ భర్తతో మాట్లాడుతున్నా, ఆఫీసులో ఉన్నా, రాస్తున్నా, ఒంటరిగా ఉన్నా - అసలెన్నడైనా మీరు ఒంటరిగా ఉంటేనూ - మీ ప్రతి క్రియలనన్నిటినీ గమనిస్తూవుంటే, ఈ మొత్తం పరిశీలనా ప్రక్రియలో, ఈ చూచే క్రియలో (పరిశీలకునికీ - పరిశీలించబడేదానికీ మధ్య విభజన ఏమాత్రం ఉండదు) వైరుధ్యం అంతమైపోతుంది

మీకు విషయం కొంతవరకు స్పష్టమైతే, అపుడు మనమిలా అడగవచ్చు ప్రేమ అంటే ఏమిటి? ప్రేమ సుఖమా? ప్రేమ అసూయనా? ప్రేమ స్వాధీనతా సూచకమా? ప్రేమ శాసిస్తుందా? - భర్త భార్యనీ, భార్య భర్తనీ శాసిస్తుంటారా? ఖచ్చితంగా ఇవేవీ ప్రేమకాదు అయినప్పటికీ ఇదంతా ప్రేమయే అని అనుకుని, ఆ బరువునంతా మోస్తున్నాం అలా భావించే, మనుష్యులు భర్తతో, లేక భార్యతో, లేక మరెవరితోనో, 'నేను నిన్ను ప్రేమిస్తున్నాను' అంటుంటారు మనలో చాలామంది, ఏరకంగానైతేనేమి, ఈర్ష్యాళువులం మరొకరితో పోల్చుకున్నందువల్లా, కొలిచిచూచుకున్నందువల్లా, ఇపుడున్నట్లుగాక మరోరకంగా ఉండాలనుకున్నందువల్లా ఈర్ష్య జనిస్తుంది ఆ అసూయను ఉన్నది ఉన్నట్లుగా చూసి, అదెన్నటికీ తిరిగి సంభవించకుండా, దాన్నుంచి

పూర్తిగా విముక్తి చెందగలమా? - అలా చేయకపోతే, ప్రేమ జనించదు ప్రేమకు కాలంతో నిమిత్తం లేదు, ప్రేమ కృషితో సాధించగలిగింది కాదు, అది సుఖమిచ్చే వస్తువుకాదు

మరణం అంటే ఏమిటి?-ప్రేమకు, మరణానికి గల సంబంధమేమిటి? 'మరణాని'కి గల అర్థాన్ని, అవగాహన చేసుకున్నప్పుడు - మాత్రమే ఈ రెంటిమధ్య ఉన్న సంబంధాన్ని కనుగొనగలం అది అర్థంచేసుకోవాలంటే, జీవించడమంటే ఏమిటో తప్పనిసరిగా అర్థంచేసుకోవాలి వాస్తవంలో, మన జీవితం ఎలాంటిది?-మన నిత్యజీవితం, ఏదో సిద్ధాంతపరమైనదీ, మేధాపరమైనదీకాదు, ఇలా ఉండాలి అని మనం పరిగణించేదికాదు, అదంతాకల్ల నిజంగా జీవితమంటే ఏమిటి?-సంఘర్షణలూ, నైరాశ్యమూ, ఒంటరితనము, ఏకాకితనంతో గడుపుతున్నదే మనదైనందిన జీవితం నిద్రిస్తున్నా-మేల్కొన్నా అదొక రణరంగం దానినుంచి పలురకాలుగా తప్పించుకోచూస్తాం - సంగీతం, కళలు, మ్యూజియములు, మత, వేదాంత సంబంధమైన వినోదాలు వగైరాలతో, వాటిననుసరించి పలుసిద్ధాంతాలను ప్రతిపాదిస్తూ, తత్సంబంధిత విజ్ఞానంలో చిక్కుకుపోతూ-అలా ఏదేదో చేసి తప్పించుకోచూస్తామేకానీ, జీవితమని పిల్చుకుంటున్న ఈ యుద్ధభూమిలో, సదా దుఃఖాన్నే కలిగించే ఘర్షణలను మాత్రం అంతం చేయం

దైనందిన జీవితంలోని దుఃఖం అంతం అవగలదా? మనసు సమూలంగా మారితే తప్ప, మనజీవితానికి అర్థంలేదు-ప్రతిరోజు ఆఫీసుకి వెళ్ళడం, జీవనభృతినార్జించడం, కొన్ని గ్రంథాలను పఠించడం, నేర్పుగా వాటిని ఉదహరించగలగడం, చక్కని విషయ పరిజ్ఞానం కలిగుండడం - ఇలాంటివెన్ని ఉన్నప్పటికీ, ఆ జీవితం నిరర్థకం, అచ్చమైన బూర్జువా జీవితం ఈ పరిస్థితులనన్నిటినీ తెలుసుకున్నతర్వాత జీవితానికొక అర్థాన్ని కల్పించి, దానికొకింత ప్రాధాన్యత నివ్వడానికై, జీవిత లక్ష్యాన్ని, సార్థక్యాన్ని గుర్తించిన తెలివైనవారి కొరకు అన్వేషించడం మొదలుపెడతారు-ఇదికూడా జీవితాన్నుంచి తప్పించుకునే మరోమార్గం ఈ రకమైన జీవితం సమూలంగా మారవలసి వున్నది.

మరణాన్ని చూసి మనకీ భయమెందుకు?-చాలామందిలాగే. దేనిని చూసి భయం! మరణమని పిలువబడుతున్నదాని ఎడల మీ స్వంతభయాలను పరిశీలించండి-మనం దేనిని జీవితమని పిల్చుకుంటున్నామో, ఆ యుద్ధం అంతం కాబోతున్నదని భయపడుతున్నామా! ముందేమికానున్నదో, ఆ తెలియని దానిని గురించి మనకు భయం తెలిసిన వస్తువులను వదిలిపెట్టి పోతున్నందుకుభయం ఈ సంసారంతో, ఈ పుస్తకాలతో, ఈ ఇంటితో, ఇంటిలోని సామానుతో, దగ్గరివారితో మనకు గల అనుబంధం తెగిపోతున్నందుకు భయం, తెలిసిన విషయాలను వదిలిపెట్టటానికి భయం ఆ తెలిసినవేమో, అపుడపుడు రేఖామాత్రంగా లభించిన ఆనందం తప్పిస్తే, దుఃఖంతో, బాధ నిరాశలతో గడిపేదే మన జీవితం, ఈ నిరంతర పోరాటానికి అంతులేదు; దానినే మనం జీవితమంటున్నాం - దానిని వదిలిపెట్టడానికే మనకీ భయం 'నేను' అనగా, మనం కూడబెట్టుకున్నదాని ఫలితంగా రూపొందిన అ'నేనే'నా-తానంతమైపోతానేమోనని భయపడుతున్నది? - అందుకనే అది భవిష్యత్తుని ఆశిస్తుంటుంది, అందువల్ల పునర్జన్మ ఉండాలంటుంది తూర్పుదేశాలన్నీ పునర్జన్మ సిద్ధాంతాన్ని నమ్ముతాయి దాని ప్రకారం, మీరు పైజన్మలో ఒకింత పై మెట్టులోనే జన్మిస్తారంటారు ఈ జన్మలో అంట్లుకడిగేవారైనా,

మరుజన్మలో రాకుమారుడో, అలాంటిదే మరేదో అయేవీలుందంటారు–మీ పాత్రలను శుభ్రం చేసేందుకు మరెవరో వస్తారు నిజంగా పునర్జన్మలో విశ్వాసం ఉన్నవారికి, ఈ జన్మలో తామెలాఉన్నారనేదే అత్యంత ప్రధానంకావాలి, మీరు ఏంచేస్తున్నారు, ఎలా ప్రవర్తిస్తున్నారు, మీ ఆలోచనలెలా ఉన్నవి, మీ కార్యకలాపాలేమిటి అనే వాటిమీదనే, మీ మరుజన్మ ఆధారపడి వుంటుంది, మీరు సత్కరించబడినా, లేక శిక్షింపబడినా కానీ, తమ ప్రవర్తన ఎలా ఉంటున్నది అనే విషయం, వారికి ఈషణ్మాత్రమైనా పట్టడం లేదు దేవుడి మీద, స్వర్గం మీద ఉన్న నమ్మకాలలాగే ఇది కూడ మరో నమ్మకం అయిపోయింది వాస్తవానికి ఇప్పుడు ఈరోజు మీరెలా ఉన్నారు, మీ ప్రవర్తనెలా ఉన్నదన్నదే ముఖ్యం, బాహ్యంలోనేకాదు, అంతరంగంలో కూడా పశ్చిమదేశాలవారు, 'మరణం' గురించి హేతువాదాన్ని ఆధారం చేసుకుని, ఓదార్చుకుంటారు, వారినిబద్ధత, వారి మతాన్ననుసరించి ఉంటుంది

నిజానికి, మరణమంటే ఏమిటి? అంతం అవడమేనా? భౌతికజీవి, వృద్ధాప్యంవల్ల, వ్యాధిగ్రస్థమైనందువల్ల, ప్రమాదాలవల్ల నశించబోతున్నది మనసులో బహుకొద్ది మంది మాత్రమే వృద్ధాప్యాన్ని అందంగా, హుందాగా గడుపుతారు కారణమేమంటే, మనం ఎన్నోయాతనలకు గురైవుంటాం, పెద్దవారమౌతున్నకొద్దీ, ఆయా చిహ్నాలన్నీ మన ముఖం మీద ద్యోతక మౌతుంటాయి – గతంలో జరిగిన విషయాలను గుర్తుచేసుకుంటూవుంటే, వృద్ధులమైనామన్న విచారం పెనవేసుకుంటుంది

మనిషి తనకు 'తెలిసిన' ప్రతి ఒక్కదానికీ, ఏరోజుకారోజు మానసికంగా మరణించగలడా? 'తెలీనదానినుండి' స్వేచ్ఛ ఉంటేతప్ప ఏదైతే 'సాధ్యం'కాగలదో అదెన్నటికీ పట్టుబడదు ప్రస్తుతం మనకు, 'సాధ్యం' అయేవన్నీ 'తెలిసిన' దాని పరిధిలోనే ఉంటున్నవి, కానీ, స్వేచ్ఛ కనుక సిద్ధిస్తే, అపుడు 'సాధ్యమయేది' అపారం మనిషి, తన పూర్తిగతానికి, అన్ని అనుబంధాలకీ, భయాలకీ, ఆందోళనలకీ, గర్వాతిశయాలకీ, ఎంతపూర్తిగా మరణించాలంటే, మర్నాడు మేల్కొనేసరికి, నూతన మానవుడవాలి, అలాచేయగలమా? 'ఇది ఎలాచేయాలి', 'ఆ పద్ధతి ఏమిటి' అని మీరడుగుతారు పద్ధతి ఏమీలేదు. ఎందుకంటే, 'పద్ధతి'లో రేపు చేద్దాము అనే భావం యిమిడివుంటుంది రోజూ రోజూ, ఎన్ని రోజులైనాసరే, సాధన చేస్తూవుంటే, తుదకు ఏదో సాధించవచ్చుననే భావం, అందులో యిమిడి వుంటుంది అలాకాక అందులోని సత్యాన్ని తక్షణం చూడగలరా – వాస్తవంగా, మేధాపరంగా కాదు, – గతానికి చెందిన ప్రతి ఒక్కదానినీ, మానసికంగా అంతంచేస్తే తప్ప, ఆ మనసు నూతనత్వంతో, నిష్కాపట్యంతో, యవ్వన స్ఫూర్తితో, చైతన్యంతో, గాఢాభినివేశంతో ఉండజాలదు కానీ, మనం గతాన్ని వదిలిపెట్టం, ఎందుకంటే మనమేగతం, మన ఆలోచనలన్నీ గతం మీదనే ఆధారపడ్డాయి, మొత్తం విజ్ఞానం గతమే, కనుక మనసు దానిని పోనివ్వదు, ఒకవేళ వదిలిపెట్టాలనే ప్రయత్నం చేసినా, ఆ ప్రయత్నం కూడ గతంలో నుంచి పుట్టుకువచ్చిందే కాబట్టి, గతమే మరోస్థితిని అందుకోవాలని ఆశిస్తుంటుంది

ఆ మనసు అసాధారణమైన నిశ్చలతలో ఉండాలి, నిశ్శబ్ధమైపోవాలి, మొత్తం విషయాన్ని, ఏరకంగానూ ప్రతిఘటించకుండా, ఏ మార్గంతోనూ నిమిత్తంలేకుండా

చూసినట్లయితే, అది అపూర్వమైన నిశ్శబ్దంలో ఉండిపోతుంది మనిషి ఎప్పుడూ అమరత్వాన్ని కోరుతూనే వున్నాడు, ఓ చిత్రానికి రంగువేస్తాడు, దానిపై తనపేరు లిఖిస్తాడు అదొకరకమైన శాశ్వతత్వం తనపేరు చిరస్థాయిగా వుండాలని, తనకు సంబంధించినదేదో మిగిల్చిపోవాలని అనుకుంటాడు అతనిదగ్గర-సాంకేతిక పరిజ్ఞానాన్ని మినహాయిస్తే - ఏముందని యివ్వడానికి? అసలు అతనెవరు? మీరుగానీ, నేనుగానీ మానసికంగా ఎవరం? మీకు బ్యాంకులో పెద్ద ఎకౌంటు ఉండవచ్చు, నాకన్నా తెలివిగలవారై వుండవచ్చు ఇదో, అదో, కానీ, మానసికంగా మనలో ఉన్నదేమిటి? మాటలమూటలం, మనకున్నవల్లా మన జ్ఞాపకాలు, మన అనుభవాలు, ఇవే మనం కొడుక్కియివ్వాలనుకున్నది, పుస్తకంలో రాసినా, వర్ణచిత్రంలో చిత్రించినా, అన్నిటా ఉన్నది 'నేను' ఈ 'నేను' అత్యంత ప్రధానమైపోయింది, తోటివారినందరినీ వ్యతిరేకించే ఈ 'నేను', తనకన్నా విస్తృతమైనదానితో తాదాత్మ్యంచెందాలనీ, కృతకృత్యురాలినవాలనీ, తనకో గొప్ప గుర్తింపు రావాలనీ అంటుంది - మిగతావన్నీ మీకు తెలిసినవే కదా ఈ 'నేను'ని కనుక మీరు పరిశీలిస్తే అది ఒక పెద్ద జ్ఞాపకాల మూట అనీ, వట్టి మాటలు మాత్రమేననీ తెలుస్తుంది, దానినే మనం పట్టుకువేళ్ళాడేది, మీకు-నాకు మధ్య వారికి-మనకి మధ్య వేర్పాటు భావనలకు అదే మూలం

దీనినంతా మీరు అర్థం చేసుకున్నప్పుడు - మరొకరిద్వారా కాకుండా, మీ అంతట మీరే, దానినత్యంతసమీపంలో గమనించినపుడు, ఏరకమైన తీర్పు-తీర్మానాలు, అణిచిపెట్టడాలు లేకుండా, కేవలం పరిశీలనగా చూస్తూవుంటే - మరణమనేది చేతనైనపుడు మాత్రమే ప్రేమ సాధ్యం కాగలదని, మీరు గ్రహిస్తారు. ప్రేమ జ్ఞప్తికాదు, ప్రేమ సుఖం కాదు ప్రేమ శృంగారానికి సంబంధించినదని చెప్పబడింది-మళ్ళీ, విభజన మొదలు పవిత్రప్రేమ అనీ, అపవిత్ర ప్రేమ అనీ - ఒకదానికి ఆమోదం, మరొకదానిని గర్హించడం, ఖచ్చితంగా, ఇవేవీ ప్రేమకాదు గతానికీ, గతానికి చెందిన అన్ని అవస్థలకీ, ఘర్షణలకీ, దుఃఖానికీ'మృతి' చెందితే తప్ప, మనిషి 'ప్రేమ' దరికి పూర్ణంగా, సంపూర్ణంగా రాజాలడు అపుడే ప్రేమ నెలకొంటుంది, అటుపైన, ఆ మనిషి ఏదైనా చేయగలడు

మొన్నటిరోజున, మనం చెప్పుకున్నట్లు, ప్రశ్నను అడగడం అతిసులభం, ప్రయోజనకరమైన ప్రశ్నను అడిగి, మీ అంతట మీరే దానిని పూర్తిగా పరిష్కరించేవరకు, ఆ ప్రశ్నతోనే ఉండిపోండి, అలాంటి ప్రశ్నకే ప్రాధాన్యముంటుంది, కానీ యాదాలాపంగావేసే ప్రశ్నకు అర్థం లేదు

**ప్రశ్న: 'ఉన్నస్థితి'-'ఉండాలనుకున్నస్థితి'ల మధ్య మీరు భేదం చేయకపోతే, ఉన్నదానితోనే తృప్తిగా ఉండిపోయి, మీచుట్టూ జరుగుతున్న ఘాతుకాల పట్ల. చింతే లేకుండా, వుండిపోతారేమో?**

**కృష్ణమూర్తి:** 'ఉండాలనుకున్న స్థితి'లోని వాస్తవం ఏమిటి? దానికేమైనా వాస్తవికత ఉన్నదా? మనిషిలో ఉన్నది హింస కానీ ఉండాలనుకునేది 'శాంతి' ఉండాలనుకున్న దానిలో, ఉన్న యదార్థమేమిటి? అసలు మనం అలా 'ఉండాలనుకోవడం' దేనికి ? రెంటి మధ్య బేధమంతమైపోతే, మనిషి ప్రతిదానికీ సమ్మతిస్తూ, పట్టించుకోకుండా ఉంటాడా? నాకు అహింస అనే ఆదర్శం లేకపోతే, నేను హింసను అంగీకరిస్తానా?

అతిపురాతన కాలం నుంచీ, అహింసను గురించి బోధిస్తూనే వున్నారు 'చంపవద్దు' 'కరుణ కలిగి ఉండుము' వగైరాలెన్నో వాస్తవమేమంటే, మనిషి హింసాపరుడు, అదీ 'ఉన్నస్థితి' హింస అనివార్యమని భావించినట్లయితే, అతడు నిర్లిప్తంగా ఉండిపోతాడు – ఇప్పుడున్నట్లే యుద్ధాన్ని జీవిత విధానంలో భాగంగా ఎంచుకున్నాడు కనుకనే దానినలా కొనసాగిస్తున్నాడు, మతం, సమాజం, తదితరులు మనిషినే కాదు, జంతువులను కూడ చంపవద్దని ఎన్నో ఆంక్షలు పెట్టినప్పటికీ, అతను యుద్ధాలకు పోతూనేవున్నాడు ఆహారనిమిత్తం జంతువులను వధిస్తూనేవున్నాడు మీకు ఏ ఆదర్శమూ లేదనుకోండి, అపుడు మీరు ఉన్నస్థితిలోనే వుండిపోతారు అది మనిషిని సంతోషంగా వుంచుతుందా? లేక, మీలో శక్తీ, ఆసక్తీ, ప్రాణశక్తీ విజృంభించి, 'ఉన్నస్థితి'ని పరిష్కరించేటట్లు చేస్తుందా? అహింస అనే ఆదర్శాన్ని కలిగుండటం, 'హింస' అనే వాస్తవాన్నుంచి తప్పించుకోవడం కాదా? అలా తప్పించుకోకుండాను, వాస్తవంగా ఉన్న హింసను, దానిని హింస అనే పేరుతో గర్హించకుండాను, తీర్పు-తీర్మానం చేయకుండాను, వాస్తవంగా ఉన్న హింసను ఎదుర్కొన్నట్లయితే, అలాంటి మనసు పూర్తిగా విలక్షణమైన గుణాన్ని సంతరించు కుంటుంది, అందులో ఇంక హింస ఉండదు అటువంటి మనసు హింసనంగీకరించదు, హింస అంటే, కేవలం ఎవరినో చంపడమో, గాయపర్చడమో మాత్రమే కాదు అటువంటి హింస వక్రీకరణలోను, అనుసరించడం, అనుకరించడంలోను ఉన్నది సమాజనీతికి అనుగుణంగా జీవించడంలోను ఉన్నది స్వంత వింత నైతిక సూత్రాలను పాటించడంలోను ఉన్నది హింసే మనసుని ఏ విధంగా అదుపులో పెట్టినా, అణిచిపెట్టినా కూడ, అది వక్రీకరణలో ఒక రూపం, అందువల్ల అది హింసే 'ఉన్నస్థితి'ని అర్థం చేసుకోవాలన్నా, యదార్థమేమిటో కనుక్కోవాలన్నా మనిషిలో ఓ రకమైన ఉద్రిక్తత, గమనిక తప్పకుండా ఉండాలి వాస్తవమేమంటే, జాతీయత పేరుతో సృష్టించిన విభజనే యుద్ధాలకు ప్రధాన కారణం, మనం దానికి అంగీకరించాము, జండా నారాధిస్తున్నాం, ఇక మతాలు సృష్టించిన విభజనలున్నాయి, మేము క్రిస్టియన్లం, మేము బౌద్ధులం, అదో, ఇదో అంటూ ఆ యదార్థ వాస్తవాన్ని, ఆ 'ఉన్నస్థితి'ని పరిశీలించటం ద్వారా విముక్తి చెందలేమా? అయితే, పరిశీలించబడిన దానిని, మనసు వక్రీకరించుకోనపుడే మీరు దానినుండి విముక్తి చెందగలరు

**ప్రశ్న: భావబద్ధమైన చూపుకీ, వాస్తవంగా చూసే చూపుకీ తేడా ఏమిటి?**

**కృష్ణమూర్తి:** మీరో చెట్టును భావపరంగా చూస్తారా లేక వాస్తవంగా చూస్తారా? మీరో పుష్పాన్ని చూసినపుడు, దానిని నేరుగా చూస్తారా, లేక దానిని గురించి మీకున్న వృక్షశాస్త్ర పరిజ్ఞానాన్ని, సాధారణ పరిజ్ఞానాన్ని అడ్డంపెట్టుకుని, – లేక ఆ పుష్పం మీకిస్తున్న సంతోషంతో చూస్తారా? దానినెలా చూస్తారు? భావపరమైన చూపయినట్లయితే, – అది ఆలోచన ద్వారా చూడబడినట్లు – అప్పుడది చూడబడినట్లవుతుందా? మీరు మీ భార్యను కానీ, మీ భర్తనుగానీ యథాతథంగా చూస్తారా? – లేక అతని గురించి కానీ, ఆమెను గురించి కానీ, మీకేర్పడిన మనో చిత్రాన్ని చూస్తారా? ఆ మనోచిత్రమే మీ భావచిత్రం కనుక దాని ద్వారా చూసిన

చూపు, భావబద్ధమవుతుంది అయితే, మీలో మనోచిత్రమే లేనపుడు, మీరు వాస్తవాన్నే చూడటం జరుగుతుంది అపుడే మీ మధ్య అసలైన సంబంధం నెలకొంటుంది

కనుక, మనోచిత్రాలను నిర్మిస్తూ, ఆ చెట్టుని కానీ, ఆ భార్య లేక ఆ భర్తనుగానీ, ఆ స్నేహితుణ్ణిగానీ, తదితరులనుగానీ, యధాతథంగా చూడనివ్వకుండా ఆటంకపరుస్తున్న ఆ పరికరం ఏమైవుంటుంది? నేను ఎంతకాదనుకున్నా, నన్ను గురించి, అనగా ఈ వక్తను గురించి కూడా మీకో మనోచిత్రం ఉండే వుంటుంది-అవునా? ఈ వక్తను గురించి మీకో మనోచిత్రం ఉన్నట్లయితే, మీరీ వక్త చెప్పే మాటలను వినడం లేదనే అనుకోవాలి మీ భర్తను గానీ, మీ భార్యనుగానీ, మరితరులనుగానీ మనోచిత్రం ద్వారా చూస్తున్నట్లయితే, మీరు వారిని సరిగ్గా చూడడం లేదన్నమాట మీ మనోచిత్రాన్ననుసరించి వారిని చూస్తున్నందువల్ల, మీ మధ్య సంబంధం లేనట్లే, మీరు 'నేను నిన్ను ప్రేమిస్తున్నానని' చెప్పవచ్చుగాక, కానీ ఆ మాట అర్థరహితం

మనసు, మనోచిత్రాలను రూపొందించటం మానివేయగలదా? మనం ఇపుడు మాట్లాడుకుంటున్న అర్థంలో - సవాలు ఎదుర్కొంటున్న ఆ క్షణంలోనే, మనసులో ముద్రపడబోతున్న తరుణంలోనే, మనసు కనుక, సంపూర్ణ సావధానతలో ఉన్నట్లయితేనే, అది సాధ్యమౌతుంది ఓ చిన్న ఉదాహరణ, మిమ్మల్నెవరో పొగిడారు, అది మీ కిష్టం ఆ యిష్టమే మనోచిత్రాన్ని నిర్మిస్తుంది కానీ, మీరా పొగడ్తను ఇష్టంకానీ, అయిష్టంకానీ లేకుండా సంపూర్ణ సావధానతతో విన్నట్లయితే, మనసులో మనోచిత్రమిక రూపొందదు మీ రాతనిని మిత్రుడనీ పిలవరు, తద్భిన్నంగా మిమ్మల్ని అవమానపరిచినవారిని శత్రువుగానూ పరిగణించరు 'మనోచిత్ర రూపకల్పన' మనసులో సావధానత లేనపుడే సంభవిస్తుంది సావధానతలో ఉంటే, ఏ రకమైన భావం రూపొందదు చేసిచూడండి, మీరే కనుగొనగలరు ఎంతో సులభం ఓ చెట్టుని కానీ, ఓ పుష్పాన్నిగానీ లేక ఓ మబ్బునిగానీ సంపూర్ణ సావధానతలో ఉండి చూస్తే, మీలో నుంచి వృక్షశాస్త్ర పరిజ్ఞానంకానీ, మీ యిష్టాయిష్టాలుగానీ, ముందుకు తోసుకురావు, మీరు అలా చూస్తూ వుండిపోతారు - దానర్థం, మీరా చెట్టుతో తాదాత్మ్యం చెందుతారని కాదు - మీరెలాగూ ఆ చెట్టు కాలేరు మీరు మీ భార్యనుగానీ, మీ భర్తనుగానీ లేక మిత్రుణ్ణిగానీ, మనోచిత్రం లేకుండా చూచిన వేళలో, మీ మధ్య అపుడు ఏర్పడే సంబంధం పూర్తిగా విలక్షణంగా వుంటుంది; అక్కడ ఆలోచన ఎంతమాత్రం ప్రవేశించదు; అక్కడే ప్రేమ ఆవిర్భవించే అవకాశం ఉంటుంది

**ప్రశ్న: ప్రేమ, స్వేచ్ఛ ఒక దానినొకటి అనుసరించి వుంటాయా?**

**కృష్ణమూర్తి:** స్వేచ్ఛ లేనపుడు ప్రేమించగలమా? మనకు స్వేచ్ఛ లేకపోతే, ప్రేమించగలమా? మనలో అసూయ ప్రవర్తిల్లుతుంటే, ప్రేమ జనిస్తుందా! భీతిచెందిన మనం ప్రేమించగలమా? ఆఫీసులో ఆకాంక్షాపరత్వంతో, స్వంత ఆశయాలనే, ప్రత్యేకంగా కొనసాగించే మనం ఇంటికి వచ్చి, నేను నిన్ను ప్రేమిస్తున్నానని చెప్పినప్పటికే-అది ప్రేమ అవుతుందా? ఆఫీసులో కాఠిన్యంతో, కపటంతో వ్యవహరించిన మనిషి, ఇంటి వద్ద మాత్రం, విధేయతతో, ప్రేమతో ఉందామని ప్రయత్నించినా - అది సాధ్యమౌతుందా? ఒక చేతితో చంపడానికి సిద్ధపడినవారు,

మరొక చేతితో ప్రేమను వ్యక్తంచేయగలరా? ఆకాంక్షాపరుడైన వ్యక్తికి, పోటీ పడే వ్యక్తికి, ప్రేమ అంటే ఏమిటో తెలుస్తుందా? సమాజనీతిని, అందులో చెల్లిపోతున్న ఈ లక్షణాలను మనం అంగీకరించాము, కానీ, ఈ రకమైన సమాజనీతిని, పూర్తిగా, మన మొత్తం ఉనికితో తిరస్కరించినపుడే మనం నిజమైన నీతిమంతులం అవుతాము-కానీ, మనం ఆ పనిచేయము సామాజికంగా, నైతికంగా మనం మర్యాదస్థులం, అందువల్ల, మనకు ప్రేమ అంటే ఏమిటో తెలియదు ప్రేమ మృగ్యమైనపుడు సత్యమంటే ఏమిటో, దైవమంటే ఏమిటో, అలాంటిది ఒకటి ఉంటేను - లేకపోతేనూ - మనమెన్నటికీ దానిని కనుగొనలేము.

నిన్నటికి సంబంధించిన ప్రతి ఒక్కదానికీ, సుఖదాయకమైన మనో చిత్రాలన్నింటికీ శృంగారపరంగానీ, మరితరంగానీ, వాటికి మృతి చెందటమెలాగో తెలిసినపుడు మాత్రమే, మనం ప్రేమ అంటే ఏమిటో తెలుసుకోగలం అప్పుడే అక్కడ ప్రేమ ఆవిర్భవిస్తుంది. ఆ ప్రేమే గుణం, ఆ ప్రేమే నీతి - ఆ ప్రేమలో అన్ని నీతులూ కలిసివుంటాయి - అపుడు మాత్రమే ఆయదార్థం, ఆ కొలవనలవి కానిదేదో ప్రవేశిస్తుంది

**ప్రశ్న: సంక్షోభంలో ఉన్న వ్యక్తే, సమాజాన్నీ సృష్టించాడు. ఆ సమాజాన్ని మార్చేందుకు గాను, మీరు అతనిని, దానిపై ఆధారపడకుండా విడిపొమ్మని సలహాయిస్తున్నారా?**

**కృష్ణమూర్తి:** వ్యక్తే సమాజం కాదా? మీరు, నేను మన దురాశతో, ఆకాంక్షలతో, మన జాతీయతతో, పోటీ తత్వంతో, క్రౌర్యంతో, హింసతోనే కదా ఈ సమాజాన్ని సృష్టించాము మన మనసులో ఉన్నవి అవే కాబట్టి, బాహ్యంలో మనం చేసేవి అవే అవుతున్నాయి యుద్ధం జీవిత విధానంలో ఒక భాగమన్నట్లు భావించాము కనుకనే, వియత్నాంలో జరుగుతున్న యుద్ధానికి, మీరు - నేను, అందరం నిజంగా బాధ్యులం దీనినుంచి మనల్ని తెంచుకోమనా మీరు సూచిస్తున్నది! పైగా, మీ నుంచి మిమ్మల్ని ఎలా విడదీసుకుంటారు? ఈ మొత్తం గందరగోళంలో మీరూ ఒక భాగమే కనుక, ఈ వికృతాన్నుంచి, ఈ హింసాఘోరణి నుంచి, వాస్తవంగా కన్పిస్తున్న ప్రతి ఒక్క దాన్నుంచి విడివడటంకాదు, దానిని చూసి, నేర్చుకుంటూ, గమనిస్తూ, ఆ మొత్తం మీలో ఎలా ప్రకటితమౌతున్నదో చూసి అర్థం చేసుకోవడం ద్వారా, ఆ మొత్తం హింస నుంచి విముక్తి చెందగలరు మీ నుంచి మిమ్మల్ని వేరు చేసుకోజాలరు, 'ఎవరు', అలా విడదీసేది, అనే సమస్య, ఇందులో నుంచి ఉత్పన్నమౌతుంది. సమాజాన్నుంచి 'నన్ను' విడదీసేవారు 'ఎవరు? లేక నానుంచి నన్ను విడదీసేవారు 'ఎవరు'? ఏ వ్యక్తి అయితే తననుతాను విడదీసుకోవాలని కోరుతున్నారో, ఈ మొత్తం సర్కసులో అతడు కూడ ఒక భాగం కాదా? ఇదంతా అర్థం చేసుకొనుటకు - అనగా, పరిశీలించేవాడు, పరిశీలించబడేదానికి భిన్నం కాదని తెలుసుకోవడమే ధ్యానం, దీనికి, మనిషి తనలోకి తాను చొచ్చుకుంటూ పోవలసిన అవసరం ఎంతైనా ఉన్నది - విశ్లేషణ ద్వారా మాత్రం కాదు ప్రకృతితో, మనుష్యులతో, వస్తువులతో, ఆస్తి పాస్తులతో, అభిప్రాయాలతో తనకు గల సంబంధాన్ని పరిశీలించుకొనడం ద్వారా, అతని అంతరంగంలో సంపూర్ణమైన స్వేచ్ఛా భావం అలముకుంటుంది

*లండన్, మార్చి 20,1969*

# 3. ధ్యానం

## 'అన్వేషణ'కు గల అర్థం; అభ్యసించుటలో, అదుపులో పెట్టుటలో యిమిడి ఉన్న సమస్యలు; నిశ్శబ్ద గుణము.

అత్యంత ప్రధానమని నేను తలచే ఓ విషయం గురించి మాట్లాడుదామను కున్నాను, దీనిని గనుక అర్థం చేసుకుంటే, బహుశ మనం ఏ విధంగాను విచ్ఛిన్నంకాని జీవితాన్ని స్వయంగా సంపూర్ణంగా గ్రహించగలం, అపుడు మనం ఏపనినైనా పూర్తిగా, స్వేచ్ఛగా, సంతోషంగా చర్య చేయవచ్చు

మనం ఎపుడూ ఏదో నిగూఢంగా ఉన్నదాని కోసం వెతుకుతుంటాం; కారణమేమంటే, అర్థంలేని, లోతులేని వ్యాపకాలతో, మనం గడిపే ఈ జీవితంతో, మనం ఎంతో అసంతృప్తి చెందివున్నాము కనుక, దానికొకింత అర్థాన్ని, గుర్తింపుని యివ్వడానికి ప్రయత్నిస్తుంటాము; అయితే ఇది మేధాపరమైన చర్య, కనుక ఏదో పైపైన, ఏదో మాయగా జరిగి, పర్యవసానంలో అర్థరహితమే అవుతున్నది. ఇదంతా తెలిసినప్పటికీ – మన సౌఖ్యాలన్నీ అతిత్వరలోనే అంతమైపోతాయనీ మన దైనందిన వ్యాపకాలన్నీ యాంత్రికమేననీ, మన సమస్యల్లో అధిక భాగం బహుశ ఎప్పటికీ పరిష్కరించబడవనీ మనకు తెలుసు; ఎందులోను నమ్మకం లేక, సంప్రదాయపు విలువల్లోను, బోధకుల్లోను, గురువుల్లోను, చర్చి లేక సంఘం విధించిన ఆంక్షల్లోను విశ్వాసం లేదు – ఇదంతా తెలుసుకుని, మనలో చాలామంది నిజంగా ప్రయోజనకరమైనది, ఆలోచనతో స్పృశించబడనిది, నిజంగానే అసాధారణమైన అందంతో, పరమానందంతో ఉండేదేదైనా ఉన్నదా అని నిరంతరం శోధిస్తుంటాం, పరిశోధిస్తుంటాం, కనుగొనాలనే ప్రయత్నం చేస్తుంటాం మనలో చాలమంది, శాశ్వతమైన దానిని, అంత సులభంగా కలుషితం చేయలేని దానిని పట్టుకోవాలనే ప్రయత్నం చేస్తుంటామనుకుంటాను స్పష్టంగా ఉన్నదానిని పక్కన పెట్టి, ప్రగాఢేచ్ఛతో – భావోద్వేగ రహితంగా – లోతైన విచారణ చేస్తే, ఆలోచనతో కొలవజాలనిది, ఏ రకమైన నమ్మకాల – విశ్వాసాల క్రమంలో పెట్టలేనిది అయిన దాని ద్వారం తెరుచుకోవచ్చునేమోనని ఆశిస్తుంటాము ఈ శోధనకూ, ఈ అన్వేషణకూ ఏమైనా అర్థం ఉన్నదా?

మనం ధ్యానమనే ప్రశ్నను గురించి చర్చించబోతున్నాం, ఇది ఒకింత క్లిష్టమైన విషయం కనుక, అందులోకి చూచేముందే, ఈ అన్వేషణ, ఈ అనుభవాన్ని ఆపేక్షించుట గురించి, యదార్థ తత్వాన్ని కనుగొనేందుకు చేసే ఈ ప్రయత్నం గురించి, మనం స్పష్టం చేసుకోవాలి సత్యాన్ని శోధించటం, అన్వేషించి పట్టుకోవడమంటే ఏమిటో అర్థం చేసుకోక

తప్పదు కాలానికి చెందని దానిని, ఎవరు ఎంత గట్టిగా కోరినా, ఒత్తిడి చేసినా, నైరాశ్యం చెందినా తీసుకు రాజాలని ఆ నిత్యనూతనమైన దానికోసం, మేధాపరమైన ఈ వెతుకులాట ఏమిటో తెలుసుకోవాలి శోధించినందువల్ల సత్యం ఎప్పటికైనా కనుగొనబడగలదా? కనుగొన్నప్పుడైనా అది గుర్తించబడగలదా? గుర్తించిన వారైనా, 'ఇదే సత్యం', 'ఇదే నిజ'మని చెప్పగలరా? అసలు ఈ అన్వేషణకు ఏమైనా అర్థం ఉన్నదా? మతానుయాయులలో చాలామంది ఎపుడూ సత్యశోధనను గురించి మాట్లాడుతుంటారు, మేమడుగుతున్నదేమంటే, సత్యాన్ని ఎప్పటికైనా వెంటబడి వెతికే వీలుందా అని! సత్యాన్ని శోధించి, కనుగొనగలమనే భావనలో, గుర్తించగలమనే భావం కూడ ఉన్నట్లే కదా–నేను దేనినైనా కనుగొన్నట్లయితే, అన్నప్పుడు, అందులో నేను గుర్తించగలను అనే భావం ఉన్నట్లే గదా? గుర్తించటమంటే అది నాకప్పటికే తెలుసు, అనే అర్థం అందులో యిమిడి ఉన్నట్లే గదా? పూర్వానుభవం ఉన్న మనిషి, 'ఇదే అది' అని చెప్పగలిగినప్పటికీ, ఆ అర్థంలో – సత్యం గుర్తించబడగలదా? మరి సత్యశోధనకున్న విలువ ఏమిటి? లేక, దానికి ఏ విలువా లేదు అనుకుంటే, నిరంతర పరిశీలనలో, నిరంతర శ్రవణంలోనే ప్రయోజనం ఉన్నదేమో?–అది వెతుకులాట వంటిది కాదండీ నిరంతరం పరిశీలిస్తున్నపుడు, అక్కడ గతం యొక్క చలనమేదీ ఉండదు 'పరిశీలించుట' అంటే చాలా స్పష్టంగా చూడడం, అంత స్పష్టంగా చూడాలంటే, స్వేచ్ఛ ఉండాలి, స్పష్టమైన చూపులో జోక్యం చేసుకునే రోషం, వైరం, దురభిప్రాయం, గునుపుల నుంచే కాక, విజ్ఞాన రూపంలో నిల్వ చేసుకున్న అన్ని జ్ఞాపకాల నుంచి మనిషికి స్వేచ్ఛ ఉండాలి అటువంటి గుణము, నిరంతర పరిశీలనతో కూడిన ఆ రకమైన స్వేచ్ఛ ఉన్నపుడు – బాహ్యామందలి విషయాలనే కాక, అంతరంగంలో నిజంగా సాగుతున్నదేమిటో పరిశీలిస్తుంటే, ఇక శోధించవలసిన అవసరమేమిటి? – ఉన్నదంతా అక్కడనే ఉన్నది, ఆ వాస్తవం, ఆ 'ఉన్నస్థితి', అది చూడబడినట్లే అయితే, ఆ 'ఉన్నస్థితి'ని మరేదోగా మార్చాలనుకుంటే, తక్షణం, వక్రీకరణా ప్రక్రియ మొదలైనట్లే ఏ విధమైన వక్రీకరణగానీ, ఏ రకమైన అంచనాగానీ, సుఖం కోసం అపేక్షించడంగానీ లేకుండా, స్వేచ్ఛగా పరిశీలిస్తుంటే, అలా పరిశీలిస్తున్న సమయమందే, ఆ 'ఉన్నస్థితి' అపూర్వంగా మార్పు చెందుతుందనేది మనం గ్రహిస్తాము

మనలో చాలామంది, తమ జీవితాలను విజ్ఞానంతోనూ, వినోదాలతోనూ, ఆధ్యాత్మిక ఆశయాలు, విశ్వాసాలతోనూ నింపాలని ప్రయత్నిస్తుంటారు కానీ, మనం పరిశీలించి చూస్తే, వాటికుండే విలువ అత్యల్పమని తెలుస్తుంది, ఏదో భావాతీతమైనది, లౌకిక విషయాలనన్నిటినీ మించినదీ, బ్రహ్మాండమైనదీ, అవధులు లేనిది, కాలముతో నిమిత్తం లేనిదీ అయిన దానిని స్వానుభవంలోకి తెచ్చుకోవాలని కోరుతుంటాము ఆ కొలవనలవికానిదేదో 'అనుభవించాలనుకుంటే' అనుభవంలో యిమిడి ఉన్నవేమిటో అర్థం చేసుకోవలసి వున్నది మనం 'అనుభవాన్ని' అసలెందుకు కోరుతున్నాం?

దయచేసి, వక్త చెప్తున్న మాటల్ని అంగీకరించనూ వద్దు, తిరస్కరించనూ వద్దు, కేవలం పరీక్షించండి ఈ వక్తకి ఏ మాత్రం ప్రాధాన్యం లేదనే విషయం నిశ్చయంగా తెలుసుకోండి

వక్త ఒక టెలిఫోను వంటివాడు టెలిఫోనులో చెప్పే దానిని మీరు శిరసావహించనక్కర్లేదు దానికే అధికారమూ లేదు, కానీ మీరు దానిని వింటారు మీరు దానిని జాగ్రత్తగా విన్నట్లయితే, అందులో వుండేది, ఆపేక్ష, అంగీకార, అనంగీకారాలు కావు ఆలకించే గుణం ఉన్న మనసు, 'మీరు దేనిని గురించి మాట్లాడుతున్నారో విందాము, దానికేదైనా విలువవుంటే, అందులోని నిజానిజాలను చూద్దాము' అంటుంది అంగీకరించవద్దు, తిరస్కరించవద్దు కానీ వినండి, పరిశీలించండి చెప్పబడుతున్న మాటలనే, కాదు, 'వాటిని వింటున్న సమయంలో – మీ ప్రతిక్రియల్నీ, మీ వక్రీకరణల్నీ, మీ పూర్వాభిప్రాయాల్నీ, అభిప్రాయాల్నీ, మీ మనోచిత్రాల్నీ, మీ అనుభవాల్నీ గమనిస్తూ – అవన్నీ మిమ్మల్ని విననీయకుండా ఎలా ఆటంకపరుస్తున్నవో కూడ చూడండి

అనుభవానికి ఉన్న ప్రాధాన్యత ఏమిటీ అని మేమడుగుతున్నాం. ఏమైనా ప్రాధాన్యం ఉన్నదా? అప్పటికే కొన్ని తీర్మానాలను చేసుకుని, విశ్వాసాలకు కట్టుబడి, నిబద్ధీకరింపబడి, నిద్రాణమై ఉన్న మనసుని అనుభవం వచ్చి మేల్కొల్పగలదా? మేల్కొల్పినా, ఆ నిర్మాణాన్నంతా బద్దలు కొట్టగలదా? అసంఖ్యాకమైన సమస్యలతో, నైరాశ్యంతో, దుఃఖంతో అమితంగా బరువెక్కిపోయిన అలాంటి మనసు – ఎదురైన ఏ సవాలుకైనా స్పందించగలదా? – ఒకవేళ స్పందించినా, ఆ స్పందన, ఆ సవాలుకి తగినట్లుండకపోవడంతో, అది మరింత ఘర్షణకే దారితీయదా? విస్తృతమైన, లోతైన, భావాతీతానుభవం కోసం, మనసెప్పుడూ వెతుకుతూ వుండటమనేది, యదార్థ సత్యమైన 'ఉన్నస్థితి' అనగా మన నుంచి, నిబద్ధీకరించబడిన మన మనసుల నుంచి, తప్పించుకునే ఒక మార్గం, అసాధారణమైన మెలకువా, తెలివీ, స్వేచ్ఛా ఉన్న మనసుకి ఏ 'అనుభవమైనా' ఎందుకు కావాలి, దానికి ఆ అవసరం ఏమిటి? వెలుగు వెలుగే, అది మరింత వెలుగుని కోరదు మరిన్ని 'అనుభవాలు' కోరడమనేది, యదార్థమైన 'ఉన్నస్థితి' నుంచి తప్పించుకోవడమే

ఈ అంతులేని అన్వేషణ నుంచి, అసాధారణమైన అనుభవమేదో పొందాలనే తీవ్రమైన వాంఛ, అపేక్షల నుంచి మనం ధ్యానమంటే ఏమిటో కనుగొనడానికి ముందుకి సాగుదాం – 'ప్రేమ', 'మరణం', 'అందం', 'ఆనందం' వంటి పదాలలాగే 'ధ్యానం' అనే పదం కూడ విపరీతార్థాలను సంతరించుకున్నది ధ్యానం ఎలా చేయాలో నేర్పటానికి ఎన్నో బోధనా సంస్థలు వెలిశాయి కానీ, ధ్యానాన్ని అర్థం చేసుకొనటానికి, మనిషి ధార్మిక ప్రవర్తనను పునాది చేసుకోవాలి అలాంటి పునాది లేకుండా మొదలుపెట్టిన ధ్యానం, తనను తాను భ్రమింపచేసుకోవడమే అవుతుంది, ఆగ్రహం, అసూయ, ద్వేషం, దురాశ, సంగ్రహించుకునే తత్వం, ద్వేషం, పోటీపడటం, విజయకాంక్షలనేవన్నీ నీతిగానే, గౌరవనీయంగానే పరిగణింపబడే నేటి ధార్మికత నుంచి మనసు విముక్తి చెందకపోతేనూ,– సరైన పునాది వేసుకోకపోతేనూ, వ్యక్తిగతమైన భయం, ఆందోళన, దురాశ, మున్నగు వాటితో మనసుని వక్రీకరించుకొనని దైనందిన జీవితాన్ని నిజంగా గడపకపోతేనూ, ధ్యానానికి ఉండే అర్థం అత్యల్పం అలాంటి పునాది వేసుకోవడమే అత్యంత ప్రధానం ఇపుడు ప్రశ్న సద్గుణమంటే ఏమిటి? నీతి అంటే ఏమిటి? ఇదేదో మధ్యతరగతి పెద్ద మనుష్యులడిగే ప్రశ్న అనీ, దేనినైనా అనుమతించే నేటి సమాజంలో ఇలాంటి ప్రశ్న

అర్థరహితమైనదనీ అనవద్దు ఆ రకమైన సమాజంతో మనకు నిమిత్తం లేదు మన శ్రద్ధంతా, భయం నుంచి పూర్తిగా విముక్తి చెందిన జీవితం మీదనే, ఉన్నది, గాఢమైన, స్థిరమైన ప్రేమ కలిగిన జీవితం మీదనే, ఉన్నది అవి లేనపుడు ధ్యానం దారి మళ్ళినట్లే, మత్తుమందు సేవించినట్లే అవుతుంది అసాధారణానుభవం పొందాలని ఎందరో దానిని సేవించారు; కానీ తమ జీవితాలను మాత్రం, వారు చౌకబారుగానే గడుపుతుంటారు మారకద్రవ్యం సేవించినవారికి ఏవో కొన్ని విచిత్రానుభవాలు కలుగుతాయి, బహుశా వారికి ప్రతిదీ మరికాస్త రంగుతో కనిపించివుంటుంది వారిలో మరికొంచెం సున్నితత్వం పెరిగివుంటుంది ఆ సున్నిత స్పృహలో, ఆ రసాయనిక స్థితిలో 'పరిశీలకునికీ - పరిశీలించబడేదానికే మధ్య నుండేదంతా ఏకమైన స్థితిని దర్శించి ఉండవచ్చు, ఆ రసాయనిక ప్రభావం తగ్గిపోగానే, వారు తిరిగి, తమ వెనకటి స్థితికి వచ్చేస్తారు. వారూ, వారి పాత భయాలు, పాత విసుగులు - మళ్ళీ మాదకద్రవ్యం తీసుకోవలసి వస్తుంది.

ధార్మికత అనే పునాదిని వేసుకుంటే తప్ప, ధ్యానమనేది మనసుని అదుపులో నుంచడానికి, నెమ్మదింపచేయడానికీ, ఈ పద్ధతుల ప్రకారం మీరు చేస్తుంటే, మీకు గొప్ప ప్రతిఫలం దక్కుతుందని ఎవరో చెప్తే ఆ విధానాలననుసరించేటట్లు, మనసు పై ఒత్తిడి తేవడానికి, మనం వేసిన ఎత్తుగడలే. మీకు ప్రతిపాదించిన ఆ పద్ధతుల్నీ, ఆ మార్గాల్నీ, అన్నిటినీ చేసి చూసిన తర్వాత కూడ - మనసు సంకుచితంగానే, అల్పంగానే, నిబద్ధీకరింపబడే ఉంటుంది కాబట్టి ప్రయోజనం మాత్రం ఉండదు సద్గుణ మంటే ఏమిటో, ప్రవర్తన అంటే ఏమిటో విచారణ చేయవలసి వుంది. మనిషి ఏ సంఘంలో ఏ సంస్కృతిలో, ఏ పరిసరాల ప్రభావంతో పెంచబడ్డాడో - అదే అతని ప్రవర్తనకు కారణమైవుంటుందా? అలాగైతే, వాటి కనుగుణంగానే మీరు ప్రవర్తిస్తారు అది ధార్మికత అనిపించుకుంటుందా? లేక సమాజనీతిలో వర్తిల్లుతున్న దురాశ, ద్వేషం, మరితరమైన వాటి నుంచి విడివడటంలో ధార్మికత ఉన్నదా? ధార్మికతను కృషితో సాధించగలమా? - సాధించగలిగినదే అయితే, అది యాంత్రికమైపోదా?

ఆ కారణంచేత అది ధార్మికత కానేకాదేమో? ధార్మిక జీవన మెపుడూ జీవిస్తూ, ప్రవహిస్తూ, సతతం పునరుజ్జీవనం పొందుతూ వుంటుంది, కాలంలో దానిని యిమడ్చలేము అదెలా ఉందంటే వినయ గుణాన్ని మీరు కృషితో సాధించగలరని సూచించినట్లుగా వుంటుంది. మీ లోపల వినయాన్ని పెంచగలరా? గర్విష్ఠి అయినవాడే వినయాన్ని 'కృషి చేసి పెంచగలనంటాడు' అతడు దేనిని పెంచి పోషించినా, లోపల గర్వంతోనే వుంటాడు. అలా కాకుండా, గర్వాతిశయాల స్వరూపాన్ని విశదంగా చూసినట్లయితే, ఆ చూపులో నుంచే ఆ గర్వాతిశయాల నుంచి స్వేచ్ఛ లభిస్తుంది-స్వేచ్ఛ లభిస్తే ఇక అక్కడ ఉండేది, వినయమే. ఇది స్పష్టమైతే, ధ్యానమంటే ఏమిటో, కనుగొనడానికి ముందుకి సాగుదాం.దీనిలో లోతుల వరకు వెళ్ళి, నిజంగా గంభీరమైన మనసులతో చేయకపోతేనూ-ఏదో ఒకటి రెండు రోజులు చేసి, ఆపివేస్తేనూ - దయచేసి మీరిక ధ్యానం గురించి ప్రస్తావించవద్దు. ధ్యానమంటే, ఏమిటో, మీకు అర్థమైతే, అది ఒక అత్యంత అసాధారణమైన విషయమని గ్రహిస్తారు, మీరు సత్యమని అనుకునే దానికోసం వెతుకుతూ, దానికోసం చీకటిలో దేవులాడుతూ, ఆశతో, దురాశతో దానిని

పట్టుకుందామనే మీ ధోరణినంతా, అంతం చేస్తే తప్ప, మీరు ధ్యానాన్ని అర్థం చేసుకోజాలరు మీరు ఊహించే ఆ సత్యం మీ ఊహలలో నుంచి వచ్చిన - రూపమే 'అనుభవాన్ని' యిక నేమాత్రం వాంఛించకుండా, మనిషి తాను ఎంత గందరగోళంలో జీవిస్తున్నాడో, తన జీవితం ఎందుకింత క్రమరహితమైపోయిందో, అర్థం చేసుకుంటే తప్ప, మీరు ధ్యానం దరికి రాజాలదు క్రమరాహిత్యాన్ని పరిశీలిస్తున్నపుడే, క్రమం వచ్చేస్తుంది-అది ముందే సిద్ధంచేసుకున్న నిర్దిష్ట ప్రణాళిక వంటిది కాదు ఇలా మీరు చేసివుంటే - అదంతా ధ్యానమే. ఇక, ధ్యానమంటే ఏమిటి అనే కాకుండా ధ్యానం కానిదేమిటి అనికూడ మనం అడగాలి, కారణమేమంటే, ఏదైతే అసత్యమో, దానిని తిరస్కరిస్తే, అక్కడ సత్యం ఉన్నట్లే

ధ్యానం ఎలా చేయాలో నేర్పే పద్ధతి ఏమైనా, విధానం ఏదైనా అది అసత్యమే అవుతుంది ఒక పద్ధతికి అనుగుణంగా దేనినైనా అభ్యసించబూనుకుంటే - అది ఎంత ఉదాత్తమైనదైనా, ఎంత ప్రాచీనమైనదైనా, ఆధునికమైనా, జనసమ్మతిని పొందినదైనా - మిమ్మల్ని మీరు యాంత్రికం చేసుకుంటున్నారనేది, మేధాపరంగానూ, హేతుబద్ధంగానూ తెలుసుకోవచ్చు ఏదో సాధించుటకుగాను, మీరేదో ఒక ప్రక్రియను పదే పదే చేస్తుంటారన్న మాట ధ్యానానికి ధ్యేయం మార్గానికి భిన్నం కాదు. కానీ ఆ మార్గం మీకు ఏదో దక్కుతుందని వాగ్దానం చేస్తుంది మీ ధ్యేయాన్ని చేరుటకు ఇదే మార్గమంటుంది మార్గం యాంత్రికమైనదైతే, లభ్యమయేది కూడ యంత్రం ద్వారా తయారయినట్లే వుంటుంది, యాంత్రికమైన మనసు, 'నాకేదో లభిస్తుంది' అనుకుంటుంది అన్ని పద్ధతుల నుంచి, అన్ని మార్గాల నుంచి పూర్తిగా విడివడాలి; అప్పుడే ధ్యానం మొదలయినట్లు, పూర్తిగా అసత్యమైన దానిని, అర్థరహితమైన దానిని మీరప్పటికే త్రోసి పుచ్చారన్న మాట ఇక పోతే, 'ఎఱుక'ని అభ్యసించేవారున్నారు మీరు 'ఎఱుక'ని అభ్యసించగలరా? - మీరు 'ఎఱుక అనే ప్రక్రియ'ని అభ్యాసం చేయపూనుకుంటే అంతసేపు మీరు సావధానతలో లేనట్లే; మీలో - సావధానత లేదనే విషయాన్ని - చూస్తూ ఉండండి కానీ - 'సావధానతలో ఉండటమెలాగ' అనే దానిని సాధన చేసేందుకు ప్రయత్నం చేయకండి మీలో సావధానత లేదు అనే ఎఱుక మీలో కలగగానే, ఆ ఎఱుకలోనే సావధానత ఉంటుంది; మీరు దానిని అభ్యాసం చేయవల్సిన అవసరం లేదు దీనికోసం మీరు బర్మా, చైనా, ఇండియా వంటి స్థలాలకు పోనవసరం లేదు, అవన్నీ కట్టుకథలు, వాస్తవాలు కాదు ఇండియాలో, నేనొకసారి, కారులో కొంతమందితో కలిసి ప్రయాణించిన ఘట్టం గుర్తు కొస్తున్నది. ముందుసీటులో, డ్రైవరు పక్కన, నేను కూర్చొన్నాను వెనక సీటులో కూర్చొన్న ముగ్గురు మనుష్యులు, 'ఎఱుక'ని గురించి మాట్లాడుతూ, 'ఎఱుక' అంటే ఏమిటో నాతో చర్చించాలన్నారు. కారు చాలా వేగంగా పోతున్నది రోడ్డు మధ్యలో ఓ మేక ఉన్నది, డ్రైవరు సావధానతలో లేనందువల్ల కారును ఆ అమాయక ప్రాణిపై తోలేశాడు. 'ఎఱుక' అంటే ఏమిటో వెనుకనున్న పెద్ద మనుష్యులు యింకా చర్చిస్తూనే వున్నారు, జరిగిందేమిటో వారికి తెలియనేలేదు! మీకు నవ్వు వస్తున్నది కదూ, కానీ, మనమందరం చేస్తున్నది అదే మనకు 'ఎఱుక'ని గురించి మేధాపరమైన శ్రద్ధ మాత్రమే వుంచుకుంటూ,

వాదవివాదాలతో, అభిప్రాయాలతో సరిపెట్టుకుంటున్నాము కానీ, నిజంగా జరుగుతున్న దేమిటో తెలుసుకోవడంలేదు

కనుక, అభ్యాసమనేది లేదు, సజీవమైనది మాత్రమే ఉన్నది ఇపుడొక ప్రశ్న ఆలోచనని అదుపులో ఉంచడం ఎలా? ఆలోచన అన్ని దిశల్లోకీ వెళ్ళిపోతుంటుంది, మీరొక దానిని గురించి ఆలోచించాలనుకుంటే, అది మరొక వైపుకి వెళ్ళిపోతుంటుంది, వారేమో సాధన చెయ్యండి, అణచండి అంటారు ఒక చిత్రంపైనో, ఒక వాక్యంపైనో లేక మరి దేనిపైననో మనసుని లగ్నం చేసి, ఏకాగ్రతలో ఉంచమంటారు; కానీ ఆలోచన మరోవైపుకి దూసుకుపోతూ వుంటుంది, అపుడు మీరు దానిని వెనక్కి లాగవలసివస్తుంది, ముందుకీ, వెనక్కీ ఈ పోరిలా సాగిపోతూనే వుంటుంది ఇపుడు ప్రశ్న అసలు ఆలోచనను అదుపులో పెట్టవలసిన అవసరం ఏమిటి? అదుపుచేయబోతున్న వారు ఎవరై ఉంటారు? దీనిని సమీపంగా చూడండి

ఈ నిజమైన ప్రశ్నను, అర్థం చేసుకుంటే తప్ప, ధ్యానమంటే ఏమిటో తెలుసుకోజాలరు 'నేను ఆలోచనని అదుపులో ఉంచాలి' అని ఎవరైనా అంటే, అదుపుచేసే వారెవరు? ఆ దోష నిర్ణేత ఎవరు? ఏ విషయాన్నైతే అదుపులో ఉంచాలని, రూపుదిద్దాలని, మరోరకమైన గుణంగా మార్చాలని అనుకున్న ఆ వ్యక్తి, ఆ దోష నిర్ణేత, ఆ వస్తువుకి భిన్నమైనవాడా? – ఆ రెండూ ఒకటే గాదా!

ఆలోచించేవాడు తానే ఆలోచన అని చూసినపుడు – అది అతనే – అనుభవించేవాడే అనుభవము అని తెలుసుకున్నపుడు ఏమి సంభవిస్తుంది? ఎవరైనా ఏం చేయాల్సి వుంటుంది? మీకిది బోధపడుతున్నది గదా? ఆలోచించేవాడే ఆలోచన, ఆలోచనేమో అటూ ఇటూ విహరిస్తున్నది అపుడు ఆలోచించేవాడు తాను వేరుగా ఉన్నాననితలచి, 'నేను దానిని అదుపులో పెట్టాలి' అంటాడు ఆలోచించేవాడు ఆలోచన అనే విషయానికి భిన్నమా? ఆలోచనే లేకపోతే, అసలు ఆలోచించే వాడుంటాడా?

ఆలోచించేవాడు తానే ఆలోచన అని గ్రహించినపుడు ఏమౌతుంది? పరిశీలకుడే పరిశీలన అయినట్లుగా, ఆలోచించేవాడే ఆలోచన అయినప్పుడు ఏ జరిగింది? అందులో విడివడటం లేదు విభజన లేదు, అందువల్ల ఘర్షణా లేదు, అంచేత, ఆలోచన నిక అదుపుచేయటం కానీ, రూపుద్దిదటం కానీ ఉండనే వుండవు; అప్పుడేమౌతుంది? ఆలోచన అటూ, ఇటూ విహరించడమనే దుంటుందా? ఇంతకుముందు, ఆలోచనని అదుపులో పెట్టడం, ఆలోచనని ఏకాగ్రతలో ఉంచడం జరుగుతుండేవి అపుడు ఆలోచనని అదుపులో ఉంచాలి అనే ఆలోచించే వానికీ – అటు ఇటు పోయే ఆలోచనకీ మధ్య ఘర్షణ ఉండేది మనందరి విషయంలోనూ ఇదెప్పుడూ జరుగుతూనే వుంటుంది ఉన్నట్లుండి, 'ఆలోచించేవాడు' ఆలోచనే సుమా, అనే గ్రహింపు వస్తుంది – ఇది కేవలం మాటల్లో చెప్తున్నది కాదు సంభవిస్తున్నది అపుడేమౌతుంది? ఇక ఆలోచన నలుదిశలా వెళ్ళిపోవడమనే దుంటుందా? పరిశీలకుడు, తాను ఆలోచనకు భిన్నంగా ఉన్నాననుకున్నప్పుడే, దాని గుణదోషాలను విమర్శిస్తూ, 'ఇది మంచి ఆలోచన', ఇది 'చెడ్డ ఆలోచన' అని అనగలడు లేకపోతే, ఆలోచన అటూ, ఇటూ వెడుతున్నది, 'నేను దానిని అదుపులో పెట్టాలి' అంటాడు కానీ, తానే ఆలోచన అని గ్రహించిన తర్వాత, ఇక

ఆలోచన అటు, ఇటు తిరగడమనేదే ముంటుంది? విషయాన్ని తరచిచూడండి, సర్, నేను చెప్పానని అంగీకరించవద్దు, మీ కంటికి మీకే కనిపిస్తుంది ప్రతిఘటన ఉన్నచోటే, సంఘర్షణ బయల్దేరుతుంది. ఆలోచనా, నేను వేర్వేరు అని తలచే ఆలోచించేవాడే, ప్రతి ఘటనను సృష్టిస్తాడు కానీ, తానే ఆలోచన అని గ్రహించినపుడు, ఇక ప్రతిఘటన ఏముంటుంది – దీనర్థం, ఆలోచన ఎటుపడితే అటు వెడ్తుందని కానీ, ఏదిబడితే, అది చేస్తుందనిగానీ కాదు, పై పెచ్చు, తద్భిన్నంగా జరుగుతుంది

అదుపులో పెట్టటం, ఏకాగ్రతలో ఉంచటం, అనే మొత్తం సిద్ధాంతం బ్రహ్మాండంగా మారిపోతుంది, అది సావధానతగా పరిణమిస్తుంది పూర్తి విభిన్నతను సంతరించు కుంటుంది ఎవరైనా ఆ సావధానతా స్వరూపాన్ని అర్థం చేసుకుంటే, దానిని మొత్తం ఒక చోటికి చేర్చవచ్చుని, అది ఏకాగ్రతకు – అనగా లక్ష్యం తప్ప, మిగతా వాటిని నెట్టి వేసే దానికి పూర్తిగా భిన్నమని అర్థం చేసుకుంటారు. అయితే, మీరు, 'ఏకాగ్రత లేకుండా నేనేమైనా చేయగలనా' అనీ, నేనేది చేయదల్చుకున్నా ఏకాగ్రత ఉండాలి కదండీ' అంటారనుకోండి కానీ, సావధానులుగా వుంటూ మీరేమీ చేయలేమంటారా? – అది ఏకాగ్రత మాత్రం కాదు 'సావధానత' అంటే అక్కడ ఉండుట; అనగా, వినుట, శ్రవణం చేయుట, చూచుట – మీ కళ్ళతో, మీ చెవులతో, మీ మనసుతో, మీ హృదయంతో, మీ శరీరంతో, నరాలతో, మీ మొత్తం ఉనికితో సంపూర్తిగా సావధానతలో వినుట, – ఆ సంపూర్ణ సావధానతలో – విభజనే ఉండదు – అందువల్ల మీరేదైనా చేయగలరు; ఇలాంటి సావధానతలో ప్రతిఘటించేదేదీ వుండదు ఇక, తర్వాతి విషయమేమంటే, మనసు దానిలో కలిసిన మెదడు – ఆ మెదడు లక్షలాది సంవత్సరాల పరిణామ ఫలితంగా రూపొంది, అజ్ఞప్తినంతా తనలో నిక్షిప్తంచేసుకుని, నిబద్ధీకరింపబడింది కనుక – అది నిశ్చలంగా ఉండగలదా? కారణమేమంటే, మొత్తం మనసు నిశ్శబ్దంగా, నిశ్చలంగా, ఉన్నప్పుడు మాత్రమే, అక్కడ గ్రహించటమనేది సంభవిస్తుంది అయోమయంలేని మనసే, స్పష్టంగా చూడగల్గుతుంది మనసు, నెమ్మదిగా, చలనరహితంగా ఎలా ఉండగలదు ఒక చక్కని చెట్టునిగానీ, అద్భుతమైన కాంతిలో ఓ మేఘాన్ని కానీ, స్వయంగా, సంపూర్తిగా, నిశ్చలంగా మీరెప్పుడైనా చూశారో, లేదో నాకు తెలియదు, అలా చూడనట్లయితే, మీరు దానిని నేరుగా చూడలేదన్న మాట, దానిని గురించి సంతోషకరమైన మీ మనోచిత్రంతోనో, లేక, నిన్నచూసిన జ్ఞప్తితోనో చూశారు కనుక, మీరు దానిని నిజంగా చూడడంలేదు మీ మనసులో ఏర్పడిన మనోచిత్రాన్నే చూస్తున్నారుగానీ, వాస్తవమైన దాన్ని చూడటంలేదు

ఇపుడు ప్రశ్న ఏమిటంటే, మెదడులో కలిసిన మొత్తం మనసు పూర్తిగా నిశ్శబ్దంగా ఉండగలదా? ఎందరో ఇలా అడిగారు వారు నిజంగానే గంభీరమైన మనస్కులు – వారు దీనిని పరిష్కరించలేక పోయారు, రకరకాల ఉపాయాలు, యుక్తుల్ని వాడి చూశారు, కొన్ని పదాలను, పదే పదే ఉచ్చరించడం ద్వారా మనసుని నెమ్మదింపచేయవచ్చుని చెప్పారు మీరెపుడైనా ప్రయత్నించారా – 'ఆవేమేరియా' అని మననం చేయడం కొందరు, ఇండియాలో నేర్చుకొని వచ్చిన మంత్రాలను, కొన్ని సంస్కృత పదాలను – మనసుని నిశ్చలపరిచేందుకు జపించి చూశారు ఆ పదమేమిటి అనే దానికి ప్రాధాన్యం లేదు,

దానిని లయబద్ధం చేయడమే - కోకాకోలాగానీ, మరేదైనాగానీ, లయబద్ధంగా ఏ పదాన్నైనా మననం చేస్తూవుంటే, మనసు నెమ్మదిస్తుందని, మీరే గ్రహిస్తారు. కాని అది ఒక మందకొడి మనసు, సున్నితత్వం గల మనసు కాదు జాగరూకతతో, చురుకుగా, చైతన్యవంతంగా, గాఢాభినివేశంతో, తీక్ష్ణతతో ఉండే మనసు కాజాలదు ఆ మందకొడి మనసు, 'నాకు బ్రహ్మాండమైన భావాతీతానుభవం కలిగింది' అని చెప్పవచ్చుగాక, కానీ అది తనను తాను మోసం చేసుకుంటున్నది

కనుక, కొన్ని మాటలను మననం చేయడంలో కాదు, దానిని ఒత్తిడి చేసేందుకు, ప్రయత్నించడం కాదు మనసుని నిశ్శబ్దపరిచేందుకు దానిపై పలుయుక్తుల్ని ప్రయోగించడం జరిగింది, కానీ, అంతరాంతరాళాల్లో మనిషి గ్రహించినదేమంటే, మనసు కనుక, నిశ్చలమైతే మొత్తం విషయం పూర్తి అయినట్లేనని, ఇపుడు అక్కడ ఉండేది, నిజమైన గ్రహింపు

మెదడుతో సహా ఈ మనసు, సంపూర్ణంగా నెమ్మదించడం ఎలా? కొంతమంది, 'సరిగ్గా గాలిని పీల్చండి, గాలిని దీర్ఘంగా లోనికి తీసుకోండి', అన్నారు దానర్థం రక్తంలో ప్రాణవాయువు నధికం చేయడమన్నమాట' అల్పబుద్ధి గల మనసు, నిత్యం నియమబద్ధంగా దీర్ఘంగా శ్వాసిస్తూ మనసుని నిమ్మళింపచేసినా అది ఇంతకుముందు వలెనే అల్పంగానే వుంటుంది. ఇక యోగాభ్యాసం చేయడం? - ఇక్కడ కూడ ఎన్నో విషయాలు యిమిడి ఉన్నాయి యోగా అనగా ఆచరణలో నైపుణ్యం కలిగుండడం దేహాన్ని, ఆరోగ్యంగా, బలంగా, సున్నితంగా ఉంచుటకు అవసరమైన కొన్ని రకాల ఆసనాలను అభ్యాసం చేయడంకాదు- దానితోపాటు సరైన ఆహారం కూడ తీసుకోవాలి ఇంతంత మాంసంతో నింపడం కాదు; అలాంటివే మరికొన్ని మనం ఈ విషయంలోకి ఎక్కువగా పోనవసరంలేదు, మీలో మాంసాహారులు చాలామందే వుండివుంటారు ఆచరణలో నైపుణ్యం ఉండాలంటే, దేహంలో గొప్ప సున్నితత్వం ఉండాలి దేహం తేలికగా ఉండాలి, జిహ్వాకోరేవీ, లేక అలవాటుపడినవీ కాకుండా సరైన ఆహారం తీసుకుంటూ వుండాలి

మరిక మనిషేం చేయాలి? ప్రశ్నిస్తున్నదెవరు? బాహ్యంలోనూ, అంతర్గతంగానూ, మన జీవితాలు క్రమరహితంగా ఉన్నవనేది, ఎవరికైనా స్పష్టంగా తెలిసిన విషయం అయినప్పటికీ, క్రమత అవసరం. గణితశాస్త్రంలో ఎంత క్రమత ఉన్నదో, అంతటి క్రమం ఉండాలి క్రమరాహిత్యాన్ని పరిశీలించినపుడు మాత్రమే అది సిద్ధించగలదు, 'క్రమత అంటే ఇది' అని ఇతరులు నిర్ధారించిన నమూనా ననుసరించినందువల్లగానీ, మీకు మీరే నిర్ణయించుకున్నదాని ననుసరించినందువల్ల కానీ, క్రమత సిద్ధించదు క్రమత ఎక్కడ లోపించిందో, దానిని చూడటం ద్వారా, పరిశీలించడం ద్వారా మాత్రమే క్రమతను తీసుకురాగలం మనసు అత్యంత అసాధారణమైన నిశ్శబ్దాన్ని, సున్నితత్వాన్ని, జాగరూకతను కలిగివుంటూ, ఏ అలవాట్లలోను, అవి దేహసంబంధంగానీ, మానసిక సంబంధంగానీ-వాటిలో చిక్కుకొనకుండా ఉండాలని మీరే గ్రహించవచ్చు. అదెలా సంభవిస్తుంది? ఎవరు ఆ ప్రశ్నవేస్తున్నది? ఎంతో విజ్ఞానాన్ని తనలో నింపుకుని

వాచాలత్వంతో వదరే మనసా ప్రశ్నిస్తున్నది? అది ఒక్క కొత్త విషయమైనా నేర్చిందా? - పైగా, 'నేను నెమ్మదిగా ఉన్నపుడు మాత్రమే, నేను చాలా స్పష్టంగా చూడగలను, అందువల్ల నేను నెమ్మదిగా ఉండక తప్పదంటుంది ఆ తర్వాత, 'నేను నెమ్మదిగా ఉండటం ఎట్లా' అని ప్రశ్నిస్తుంది, అలాంటి ప్రశ్నే సరైనది కాదు అనేది నిశ్చయం, అది 'ఎలా' అని ప్రశ్నించిన ఆ క్షణంలోనే, అది పద్ధతి కోసం చూస్తున్నదన్నమాట, అందువల్ల, విచారణ చేయబోతున్న విషయాన్నే అది వినాశం చేస్తున్నది మనసు పూర్తిగా నిశ్చలంగా ఉండటం ఎలా? - యాంత్రికంగా కాదు, ఒత్తిడి చేసికాదు, నిశ్చలంగా ఉండమని బలవంతంపరిచీ కాదు మనసు గనుక, బలవంతం చేయకుండానే నిశ్చలమైతే, ఆ మనసు అత్యంత అసాధారణమైన చురుకుదనంతో, సున్నితత్వంతో, జాగరూకతతో ఉంటుంది కానీ, మీరు అదెలా సంభవిస్తుందని అడగడంతోటే, పరిశీలించేవానికీ - పరిశీలించబడే దానికీ మధ్య విభజన ఏర్పడినట్లే

పద్ధతి లేదు, మార్గం లేదు అనీ, ఏ మంత్రమూ, ఏ గురువూ, ఈ ప్రపంచంలో ఏదీ కూడా, మీరు ప్రశాంతమవడానికి సహాయం చేయలేదనే విషయం గ్రహించినపుడూ, ప్రశాంతమైన మనసు మాత్రమే చూడగలదనే సత్యాన్ని మీరు తెలుసుకున్నపుడూ - ఆ మనసు అపూర్వంగా నిశ్చలమైపోతుంది ఇదెలాంటిదంటే, ప్రమాదాన్ని శంకించిన తక్షణం, తప్పుకోవడం లాంటిది; అదే విధంగా, మనసు, తాను ప్రశాంతంగా ఉండవలసిన ఆవశ్యకతను గ్రహించగానే అది ప్రశాంతతలో ఉన్నట్లే.

ఇపుడు, నిశ్శబ్ద గుణమెలాంటిదో చూద్దాము సంకుచితమైన మనసు కూడ, తనకి ఉన్న కొద్దిపాటి పరిధిలో చాలా నెమ్మదిగా ఉండగలదు కానీ, ఆ కొద్ది పరిధి, ఆ కాస్త నెమ్మది పూర్తిగా నిర్జీవమైనది - దానర్థం మీకు తెలుసా? ఏ మనసుకైతే, అవధులులేని వైశాల్యం ఉన్నదో, దాని నిశ్శబ్దతలోను, నిశ్చలతలోను 'నేను' అనే కేంద్రం వుండదు, 'పరిశీలకుడు' అనే కేంద్రమూ ఉండదు అతడు పూర్తిగా విభిన్నంగా ఉంటాడు

అలాంటి నిశ్శబ్దంలో పరిశీలకుడే వుండడు, అటువంటి గుణం కలిగిన నిశ్శబ్దానికి ఉండే చోటు అపరిమితము, దానికి ఎల్లలే లేవు అమితమైన చురుకుదనంతో అలరారుతుంటుంది, అటువంటి నిశ్శబ్దంలో నుంచి జనించే చర్య ఏదైనా, స్వార్థపరత్వంతో చేసే చర్యకు పూర్తిగా భిన్నంగా వుంటుంది మనసు కనుక అంతదూరం వెళ్ళినట్లయితే (నిజానికి అది అంతదూరం కాదు, మీకు ఎలా చూడాలో కనుక తెలిస్తే అదెప్పుడూ అక్కడనే ఉంటుంది అప్పుడు బహుశా, శతాబ్దాల తరబడి మనిషి అన్వేషించిన, ఆ దైవం, ఆ సత్యం, ఆ కొలవజాలనిది, ఆ నామరహితమైనది ఆ కాలరహితమైనది, అక్కడే ఉన్నది - మీ ఆహ్వానంతో నిమిత్తం లేకుండానే, అది అక్కడ ఉంటుంది. అటువంటి మనిషే ధన్యుడు. అతనికే ఆ సత్యము, ఆ మహదానందము

దీనినే, మరికొంత తరచిచూద్దామా, మీరేమైనా ప్రశ్నల నడుగుతారా? బహుశా మీరు, 'మా నిత్యజీవితంలో దీనికున్న విలువ యేమిటి? మేము జీవించక తప్పదు, ఆఫీసుకి వెళ్ళాలి, సంసారాన్ని పోషించుకోవాలి, అక్కడ యజమాని వుంటాడు, పోటీలుంటాయి - దీనికీ దానికీ ఏమిటి సంబంధం' అని అనవచ్చు ఆ ప్రశ్నేనా

మీరడిగేది? మీరు ఆ విధంగా అడిగేటట్లయితే, ఈ ఉదయం చెప్పిన దానిని మీరు వినలేదనే అనుకోవాలి ధ్యానం దైనందిన జీవితానికి భిన్నమైనది కాదు మీరు ఏదో ఒక గదిలో ఓ మూలన కూర్చొని పదినిమిషాలపాటు ధ్యానంచేసి, ఇవతలకి వచ్చిన తర్వాత కసాయివానివలె ప్రవర్తిస్తారు దీనిని ఉపమానంగా చెప్పినా, నిజంగా చెప్పినా అత్యంత గంభీరమైన విషయాలలో ధ్యానం ఒకటి, దీనిని రోజంతాచేయండి ఆఫీసులో ఉన్నా సంసారంతో ఉన్నా, మీ దగ్గరి వారితో, 'నేను నిన్ను ప్రేమిస్తున్నాను' అని చెప్తున్నా, మీ పిల్లల్ని గురించి ఆలోచించే సందర్భంలోనైనా ధ్యానంలో ఉండవచ్చు మీరు వారిని చదివించేటపుడు కూడ, రేపు వారు సైనికులై చంపడానికా, జెండా నారాధించటానికా, జాతీయతా భావాన్ని ప్రోదిచేయడానికా, ఆధునిక ప్రపంచపు వలలో చిక్కుకుపోడానికా చదివిస్తున్నది అనే దానిని గమనించండి అందులో మీ పాత్ర ఎంత ఉన్నదో గ్రహించండి అదంతా ధ్యానంలో భాగమే ఆ విధంగా ధ్యానిస్తుంటే, అందులో మీకొక అద్భుత సౌందర్యం కనిపిస్తుంది, ప్రతినిమిషం మీరు ఏమిచేసినా సరిగ్గానే చేస్తారు, ఒక సమయంలో మీరు సరిగ్గా చేయకపోయినా ఫరవాలేదు, తిరిగి మీరు దానినందుకుంటారు – పశ్చాత్తాపాలతో సమయాన్ని వ్యర్థం చేసుకోరు ధ్యానం జీవితంలో భాగం, జీవితానికి భిన్నమైనది కాదు

**ప్రశ్న: సోమరితనం గురించి మీరేమంటారు?**

**కృష్ణమూర్తి:** సోమరితనం – ముందు అందులోని దోషమేమిటి? సోమరితనాన్ని విశ్రాంతి సమయంతో పోల్చుకుని అయోమయంలో పడవద్దు మనలో చాలామంది, దురదృష్టవత్తూ బద్ధకస్థులే, మనకి అలా ఉండడమే యిష్టం; చురుగ్గా ఉండడం కోసం దానినెప్పుడూ పురికొల్పు తుంటారు. దానితో మరికాస్త బద్ధకస్తులమౌతాం బద్ధకాన్ని ప్రతిఘటించిన కొద్దీ, నేను మరింత సోమరినౌతాను ఉదయం నిద్రలేచినపుడు, నాకు చాలా బద్ధకంగా ఉన్నదనీ, ఏమీ చేయాలని లేదనీ అనిపించింది, ఆ దేహం ఎందుకలా అయిందో చూడండి – అతిగా భుజించినందువల్లనా, అతిగా శృంగారంలో పాల్గొన్నందువల్లనా, క్రితం రోజు పగలూ – రాత్రి అనే తేడాలేకుండా పనులు చేసినందువల్ల అదలా బరువుగా, మందకొడిగా అయిందా? అందువల్ల పాపమా దేహం, కాసేపు నన్నొదిలిపెట్టండి అంటున్నదా! కానీ మనం మాత్రం దానిని చురుగ్గా చేయాలని ప్రయత్నిస్తూనే వుంటాం దానికోసం ఓ మాత్రనైనా వేసుకుంటాం కానీ, మన జీవిత విధానాన్ని మాత్రం మార్చుకోము అలా చేయకుండా, దానిని పరిశీలనగా చూస్తే దేహానికి, దాని తెలివి దానికి వున్నదని తెలుస్తుంది దేహానికి ఉన్న తెలివి పరిశీలించాలంటే, మనకెంతో తెలివి అవసరం మనుష్యులు, బలవంతంగా దానిని ముందుకు తోస్తుంటారు మాంసం తిని, మద్యం తాగి, పొగపీల్చి, మిగతావన్నీ మీకు తెల్సినవే గదా! తత్ఫలితంగా దేహం, సహజమైన, స్వతః సిద్ధమైన తన తెలివిని కోల్పోయింది దేహాన్ని తెలివిగా పనిచేయనివ్వాలంటే, ముందు మన మనసుకెంతో తెలివి ఉండాలి దేహంతో మనసుని జోక్యం చేసుకోనివ్వరాదు ప్రయత్నం చేసిచూడండి బద్ధక గుణంలో బ్రహ్మాండమైన మార్పు వచ్చిందని మీరే తెలుసుకుంటారు

ఇక, విశ్రాంతి వేళను గురించి మాట్లాడుదాం మనుష్యులకు రానురాను తీరిక సమయం ఎక్కువైపోయింది ముఖ్యంగా సంపన్న సమాజాలలో ఆ తీరిక వేళల్ని ఎలా గడపడం!-అదొక సమస్య అయిపోయింది మరింత వినోదం, మరిన్ని సినిమాలు, మరింత సేపు టెలివిజన్, మరిన్ని పుస్తకాలు, మరిన్ని మాటలు, మరింతసేపు బోటు షికారు, మరింత సేపు క్రికెట్టు ఆడటం. లేవడమే ఆలస్యం, బయటకుపోవడం తీరిక సమయాన్నిలా పలురకాల వ్యాపకాలతో నింపివేస్తున్నారు చర్చి ఏమంటున్నది, దైవంతో నింపండి, చర్చికి వెళ్ళండి, ప్రార్థనలు చేయండి వగైరాలు, ఆ రకమైన ప్రక్రియలన్నీ తామంతకుముందు చేసినవే, అవి కూడ మరో రూపంలో వినోదమే సుమండీ ఏదో ఒక విషయం తీసుకుని అనంతంగా మాట్లాడేవారు కొందరు మీకు తీరిక ఉందనుకోండి దానిని బయటే గడుపుతుంటారా లేక అంతరంగం వైపు మరలుస్తారా! జీవితమంటే, కేవలం అంతర్గత జీవితం ఒక్కటే కాదు, జీవితం ఒక చలనం, అది ఒక అలవలె బయటికి పోవడం, లోనకురావడం చేస్తుంటుంది మీ తీరికవేళని మీరెలాగడుపుతారు? గ్రంధాలను బాగా ఉదహరించేందుకు వీలుగా మరిన్ని గ్రంధాలను పరిస్తుంటారా? ప్రసంగాలను చేయటానికి బైటికి వెడుతుంటారా (దురదృష్టవశాత్తూ, నేను చేస్తున్నట్లుగా) లేక, అంతరంగంలో లోతుల వరకూ వెళ్తారా? అంతరంగపు లోలోతుల వరకూ వెళ్ళాలంటే, బాహ్యాన్ని కూడ అర్థం చేసుకుని తీరాలి - బాహ్యాన్ని ఎంత అర్థం చేసుకుంటే - కేవలం, ఇక్కడికీ - చంద్రమండలానికీ మధ్యనున్న దూరం, సాంకేతిక విజ్ఞానం మాత్రమే కాదు, సమాజం. జాతులు, యుద్ధాలు, అక్కడ రగిలే ద్వేషం - అలా ఆ సమాజంలోని కదలికలనన్నింటినీ ఎంత అర్థం చేసుకుంటే, అంతగా మీరు అంతరంగంలోకి చొచ్చుకుపోగలరు, ఆ అంతరంగపు లోతుకి అంతిమ సరిహద్దంటూలేదు మీరు, 'నేను ఆ చివరిదాకా వెళ్ళాను 'జ్ఞానోదయమంటే ఇదే' అని అనజాలరు జ్ఞానోదయమనేది మరొకరిచే యివ్వబడేది కాదు, జ్ఞానం ఉదయించడం, అయోమయాన్ని అర్థం చేసుకున్నప్పుడే జరుగుతుంది, అయోమయాన్ని అర్థం చేసుకోవాలంటే, దానిని చూసి తీరాలి

**ప్రశ్న: ఆలోచించేవాడు, ఆలోచన వేర్వేరు కావని మీరంటుండగా, మనిషి మాత్రం, ఆలోచించేవాడు విడిగా ఉన్నాడనుకుని, ఆలోచనని అదుపులో పెట్టటానికి ప్రయత్నిస్తుంటాడు. దానివల్ల ఘర్షణని తిరిగితేవడం, మనసు సంక్లిష్టమవడం, మనసు ప్రశాంతంగా ఉండకపోవడమనేవన్నీ సంభవిస్తాయి - ఆలోచనే, ఆలోచించేవాడైనపుడు - అసలీ వేర్పాటు భావమెపుడు ప్రారంభమైందో నాకు అర్థం కావడంలేదు. ఆలోచన తనపై తానెలా పోరుసల్పుతుంది?**

**కృష్ణమూర్తి:** ఆలోచించేవాడు - ఆలోచనలు నిజంగా ఒకటే అయినప్పుడు, ఆ రెంటి మధ్య ఈ వేర్పాటు భావం ఎలా పుట్టుకువచ్చింది? మీకు అలా అనిపిస్తున్నదా? ఆలోచించేవాడే ఆలోచన అనే వాస్తవాన్ని మీరు నిజంగా చూశారా - లేక అంతే అయివుంటుంది అని అనుకుంటున్నారా, అలాగయితే, అది మీకు యదార్థం కాదుగదా? దానిని గ్రహించటానికి మీకు గొప్పశక్తి వుండి తీరాలి, అదెలాగంటే, మీరొక చెట్టుని చూస్తున్నప్పుడు మీకు, చెట్టుకీ మధ్య విభజనే లేనంతగా చూడగల శక్తి

మీకు ఉండివుండాలి అది గ్రహించటానికి, మీకు బ్రహ్మాండమైన శక్తి అవసరం, అప్పుడిక విభజనలేదు, అందువల్ల రెంటిమధ్య ఘర్షణలేదు, అదుపుచేయడమూ లేదు కానీ, మనలో చాలామంది, ఆలోచించేవాడు, ఆలోచనకి భిన్నంగా ఉన్నాడనే భావంతోనే నిబద్ధీకరింపబడ్డాము – అపుడు, ఘర్షణ ఉత్పన్నమౌతుంది

**ప్రశ్న: మనల్ని మనం ఎందుకంత క్లిష్టం చేసుకున్నాము?**

**కృష్ణమూర్తి:** మన మనస్సులు అతిసంక్లిష్టమైనవి కనుక – అవునా? విషయాలను సరళంగా చూడగల సాదాసీదా మనుష్యులం కాదు మన మనసులలాగే – సమాజం కూడ పరిణామం చెందుతూ, రానురాను మరీ మరీ క్లిష్టమైపోయింది సంక్లిష్టమైన దానిని దేనినైనా అర్థం చేసుకొనుటకు, మనిషి చాలా సరళంగా వుండాలి క్లిష్టంగా ఉన్నదానిని, క్లిష్టతరమైన సమస్యను అర్థం చేసుకొనుటకు మొత్తం తీర్మానాలను, సమాధానాలను, ఊహలను, సిద్ధాంతాలను, వేటినీ విచారణ చేస్తున్న సమయంలో ప్రవేశపెట్టకుండా ఆ సమస్యవంక చూడాలి అలా సమస్యవంక చూస్తున్నపుడు – సమస్యలోనే సమాధానమున్నదని తెలుసుకుంటే – మీ మనసు సరళమైపోతుంది, సరళత్వం పరిశీలనలో ఉండాలికానీ సమస్యలో కాదు, సమస్య క్లిష్టంగా ఉండవచ్చుగాక

**ప్రశ్న: ఆ మొత్తాన్నీ, ప్రతి ఒక్కదానినీ, ఏకమొత్తంగానే నెలాచూడగలను?**

**కృష్ణమూర్తి:** మనిషి విషయాలను విడవిడిగా చూడటానికే అలవాటుపడ్డాడు, చెట్టు వేరు, భార్య వేరు, ఆఫీసు వేరు, అధికారి వేరు – ప్రతిదానినీ విడివిడి భాగాల్లోనే, ఈ ప్రపంచాన్ని – అందులో నేను ఒక భాగమైనపుడు – దానిని విభాగాలుగా కాకుండా, పూర్తిగా, సంపూర్తిగా నేనెలా చూడగలను? ఇక, వినండి, సర్, కేవలం వినండి

ఈ ప్రశ్నకు సమాధానం ఎవరు యివ్వబోతున్నారు ఎలా చూడాలో మీకు ఎవరు చెప్పబోతున్నారు – ఈ వక్తనా? మీరు ప్రశ్నించారు, సమాధానం కోసం ఎదురుచూస్తున్నారు – ఎవరి దగ్గర్నుంచి? ప్రశ్న కనుక నిజంగా గంభీరమైన దైనట్లయితే, – మీ ప్రశ్న సరైనది కాదు అని నేననడం లేదు – గంభీరమైన ప్రశ్న అయితే, ఇక సమస్య ఏముంది? ఇపుడుండే సమస్య ఏమంటే, "నేను విషయాలను విభజించిచూస్తున్నాను, మొత్తంగా చూడలేకుండా వున్నాను"! మనసు విషయాలను విభజించి చూడటం ఎప్పటినుంచి? ఎందుకు? భార్యను ప్రేమించడం, అధికారిని ద్వేషించడం – మీకర్థం అయిందా? నేను కనుక భార్యను ప్రేమిస్తే, ప్రతి వారినీ నేను ప్రేమించగలిగివుండాలి అవునా? అవుననకండి, ఎందుకంటే మీరు భార్యనీ, పిల్లల్నీ కూడ ప్రేమించడం లేదు దానిని గురించి మాట్లాడుతూ ఉండవచ్చు గాక! మీరే కనుక భార్యా పిల్లల్ని ప్రేమిస్తే మీరు వారిని మరో విధంగా విద్యావంతుల్ని చేస్తారు వారి ఎడల ఎంతో శ్రద్ధను కనుపరుస్తారు, ఆర్థికంగా కాదు, మరో రూపంలో, ప్రేమ ఉన్నప్పుడు మాత్రమే భేదం చేయడమనేది వుండదు సర్, అర్థమైందా? మీరు ద్వేషిస్తున్నపుడు విభజన ఉన్నట్లే అపుడు మీలో ఆదుర్దా, దురాశ, ఓర్వలేనితనం, క్రౌర్యం, హింసలు చోటుచేసుకుంటాయి, కానీ మీరు ప్రేమించినపుడు – ప్రేమ, మనసుతో కాదు, ప్రేమ ఒక పదం కాదు, ప్రేమ సుఖంకాదు– మీరు నిజంగా ప్రేమిస్తే, ఆ శృంగారంకానీ, సుఖంకానీ,

మరేవైనాకానీ పూర్తిగా విలక్షణంగా ఉంటాయి, అలాంటి ప్రేమలో విభజన ఉండదు భయం ఉన్నప్పుడే విభజన ఉద్భవిస్తుంది మీరు ప్రేమించినపుడు, 'నేను', 'మీరు', మనం', వారు', అనేవేవీ ప్రవర్తిల్లవు. ఇప్పుడు మీరు 'నేను ఎలా ప్రేమించాలి? ఆ పరిమళాన్ని నేనెలా పొందగలను?' అంటారు దాని కొక్కటే సమాధానం, మీ వంకచూచుకొనండి, మిమ్మల్ని పరిశీలించుకొనండి,

మిమ్మల్ని మీరు బాధించుకోవద్దుగానీ – పరిశీలించుకుంటూ వుండి పొండి ఆ పరిశీలనలో నుంచి, విషయాలనన్నిటినీ యధాతధంగా చూస్తున్నపుడు, మీలో ఆ ప్రేమ కలుగుతుంది. కానీ పరిశీలించే సమయంలో, ఎంతో శ్రమించాలి, సోమరితనం కానీ, అశ్రద్ధకానీ ఉండకూడదు

*లండన్, మార్చి 23,1969*

# 4. మనిషి మారగలడా?

## శక్తి; సంఘర్షణలో అది వృధాఅగుట

**కృష్ణమూర్తి:** ప్రపంచంలో నేడు నెలకొన్న పరిస్థితులేమిటో, అక్కడ జరుగుతున్నదేమిటో స్పష్టంగా చూస్తున్నాం - విద్యార్థుల తిరుగుబాట్లు, వర్గాల మధ్య అపోహలు, తెల్లవారిపై నల్లవారిపోరు, యుద్ధాలు, రాజకీయ గందరగోళం, జాతులు, మతాల కారణంగా ఏర్పడిన విభజనలు, స్పష్టంగా కనిపిస్తున్నాయి అవేకాక, ఘర్షణ, పెనగులాట, ఆందోళన, ఒంటరితనం, నైరాశ్యం, ప్రేమరాహిత్యం, భయం మొదలైనవి కూడా వున్నాయని గ్రహించాం దీనినంతా మనమెందుకు అంగీకరిస్తున్నట్లు? నేటి నైతిక, సామాజిక వ్యవస్థల్లో నీతి పూర్తిగా లోపించిందని తెలిసికూడ వాటిని ఎందుకు ఆమోదిస్తున్నాం? ఇది కేవలం భావోద్వేగంతో అనడంలేదు నిజంగానే, ప్రపంచాన్నీ, మనల్నీ చూసుకున్న తర్వాత - మనం ఈ విధంగా ఎందుకు జీవిస్తున్నట్లు? మన విద్యావిధానం నిజమైన మానవుల్ని తయారుచేయలేకపోవుటకు గల కారణం ఏమిటి? దానికి బదులుగా, ఏవో కొన్ని రకాల ఉద్యోగాలను మాత్రమే నిర్వహించి, తుదకు తనువులు చాలించే, యాంత్రిక జీవుల్ని తయారుచేస్తున్నామా? విద్యకానీ, శాస్త్రవిజ్ఞానంగానీ, మతంకానీ మన సమస్యలనే మాత్రం పరిష్కరించలేకపోయాయి

ఈ గందరగోళాన్నంతా చూసిన తర్వాత కూడ, మనలో దాన్నంతటినీ బ్రద్దలుకొట్టకుండా, మనలో ప్రతి ఒక్కరం దానినే అంగీకరించడం దేనికి? అనుసరించడం దేనికి? అయితే, మన మీ ప్రశ్నను మేధాపరంగా వేయడంలేదు, ఏదో దేవుడనే వాణ్ణి కనుగొనడానికో, మరేదో జ్ఞానం ఉదయించడానికో, మరింకేదో విచిత్రమైన ఆనందానుభూతిని పొందడానికో వేయడంలేదు అవన్నీ, తప్పనిసరిగా పలురకాల పలాయన మార్గాలకే దారితీస్తాయి కనుక, ఏ రకమైన తీర్పు-తీర్మానాలకు పూనుకోకుండా దానిపై నిశ్చలమగు కళ్ళతో, నిదానమైన దృష్టిని సారిస్తూ ప్రశ్నించాలి ప్రాజ్ఞులం కాబట్టి, మనం అడగదగిన ప్రశ్న మనమీ విధంగా ఎందుకు జీవించాలి - బ్రతకడం, పోరాడటం, మరణించడం, ఇంతేనా జీవితమంటే? ఇలాంటి ప్రశ్నను, మనం గంభీరమైన మనసుతో, అర్థం చేసుకోవాలన్న నిశ్చయంతో వేసుకున్నప్పుడు - ఇక వేదాంతాలకు, సిద్ధాంతాలకు, ఊహాజనిత భావాలకు తావులేదు ఏ గురువుని ఎన్నుకోవాలీ, ఏ మతాన్ననుసరించాలీ, ఏ రకమైన ఆదర్శాలు కలిగివుండాలీ, ఏఏ సూత్రాలకు కట్టుబడాలీ, ఏమైతే బాగుంటుందీ, ఏమికానున్నదీ అనేవేవీ ముఖ్యం కాదు ఇంత గందరగోళాన్నీ, ఇంత దుఃఖాన్ని, ఇన్ని సంఘర్షణలనూ నిరంతరం ఎదుర్కోవలసి వచ్చినపుడు, ఆ రకమైన ప్రతిస్పందనలన్నీ పూర్తిగా నిరర్థకం ప్రతికుటుంబం, ప్రతిజాతి

ఎదుటివారిని తమకు ప్రత్యర్థుల వలె ఎదుర్కొంటూ, జీవితాన్నే ఒక రణరంగంగా మార్చారు - ఇదంతా ఏదో ఒక భావంవలె అనుకోకుండా, సాక్షాత్తూ కళ్ళముందున్న దృశ్యంగానూ, ఎదుర్కొంటున్న పరిస్థితిగానూ గమనించినట్లయితే, ఇదంతా ఏమిటి అనే ప్రశ్న మీలో మీకే జనిస్తుంది బ్రతుకంటేనూ తెలియక, ప్రేమంటేనూ తెలియక, కేవలం భయాందోళనలతో నిండిన ఈ జీవితవిధానం, మరణించేవరకూ ఇలా సాగవలసిందేనా?

ఇలా ప్రశ్నించుకున్న తర్వాత, మీరేం చేస్తారు? ముందునుంచే అలవడిన ఆదర్శాలకు హాయిగా కట్టుబడినవారు, కొంత డబ్బూ, మంచి ఇల్లూ ఉండి, మర్యాదా మన్ననలతో, సంఘగౌరవాన్ని ఆశిస్తూ బ్రతికే 'పెద్దమనుష్యులు' ఇలాంటి ప్రశ్నను ఎలాగూ వేయలేరు ఒకవేళ వేసినా, వారు దానిని తమ వ్యక్తిగత వాంఛలను సంతృప్తిపరిచే విధంగా మల్చుకుంటారు కానీ ఇది ప్రతి ఒక్కరికీ సంబంధించిన సాధారణ మానవ సమస్య కనుక ఇది ప్రతి ఒక్కరి జీవితాన్నీ స్పృశిస్తుంది - దీనికి, ధనిక - నిర్ధన బేధంకానీ, యువతరం - వృద్ధతరమనే బేధంగానీ లేవు మనుష్యులు, సుమారు నలభై ఏళ్ళపాటు ఓ ఆఫీసుకో, లేక ఓ కర్మాగారానికో, ఓ ప్రయోగశాలకో విధి విధాయకంగా వెళ్ళి పనిచేస్తూ, విసుగు కలిగించే ఈ అర్థరహితమైన జీవితాన్ని ఎందుకు గడుపుతున్నట్లు - ఏదో పిల్లల్ని కనడం, ఏదో విధంగా వారిని చదివించడం, అటుపైన మరణించడం, ఇంతేనా? దీనిని కనుగొనటానికి మీ మొత్తం అస్తిత్వంతో ప్రశ్నించుకొనవలసివున్నది ఈ మనుష్యులు ఎప్పటికైనా సమూలంగా పరివర్తనం చెందగలరా అనేది తర్వాతి ప్రశ్న అలాంటి మార్పు సంభవించినపుడే, వారు ద్వేషాలతో, వైషమ్యాలతో, జాతుల మధ్య దురభిప్రాయాలతో, హృదయాలనిక ఏ మాత్రం నింపుకొనకుండా, భిన్న దృష్టితో, విభిన్న హృదయంతో, బ్రహ్మాండమైన శక్తిగల విస్పష్టమైన మనసుతో, ఇదే ప్రపంచాన్ని సరికొత్తగా అవలోకించగలరు

ఇదంతా చూసి - అనగా, ఈ మతాలు తెచ్చిపెట్టిన యుద్ధాలు, ఈ విచిత్రమైన తేడాలు, వ్యక్తికీ - సమష్టికీ మధ్య వేర్పాటు భావనలు, స్వంత కుటుంబం - మిగతా ప్రపంచానికి భిన్నమని తలచడం, ప్రతివ్యక్తీ ఓ వింత ఆదర్శానికి కట్టుబడిపోయి, తనను 'నేను' - 'మీరు' అనీ, 'మనము' - 'వారు' అనీ విభజించుకోవడం - దీనినంతా తటస్థంగానూ, మానసికంగానూ చూసినట్లయితే, మిగిలేది ఒకే ఒక ప్రశ్న, మౌలికమైన ప్రశ్న అమితంగా నిబద్ధీకరించబడిన ఈ మానవుని మనసు మారగలదా? ఎపుడో, భవిష్యత్తులో మరుజన్మలోకాదు, జీవితాంతంలోనూ కాదు, ఇప్పటికిప్పుడే మూలం నుంచే మార్పురావాలి అలా మారిన మనసు, సరికొత్తగా, తాజాగా, నిష్కపటంగా, భారరహితంగా ఉంటుంది అప్పుడే మనకు ప్రేమ అంటే ఏమిటో, ప్రశాంత జీవనమంటే ఏమిటో తెలిసివస్తుంది. ఇది ఒక్కటే మన సమస్య అనుకుంటాను. ఇది కనుక పరిష్కరిస్తే, యుద్ధానికి దారితీసే, ఆర్థిక సామాజిక సమస్యలతోపాటు, అన్నీ అంతమైపోతాయి అప్పుడే భిన్నసమాజ వ్యవస్థ అవతరిస్తుంది

కనుక, మన ప్రశ్న ఏమంటే, మన మనసు, మెదడు, హృదయాలు కాలుష్యమేలేని, కపటమేలేని, సరికొత్తదనంతో తమకు యిదే మొదటిసారి జీవితమన్నట్లుగా జీవించగలవా? గాఢమైనప్రేమతో, సంతోషంగా, ప్రశాంత జీవనమంటే ఏమిటో

తెలుసుకుంటూ జీవించగలవా? ప్రశ్నలోనే సమాధానమూ సూచితమయే ప్రశ్నను వినడంలో ఒక ప్రమాదం ఉన్నది

కానీ, ఇదలాటి ప్రశ్న కానేకాదు - ఇది మన జీవితమండీ! మనకు పదాలతో, భావాలతో నిమిత్తం లేదు పదమెన్నటికీ పదార్థం కాదనీ, వర్ణన ఎపుడూ వర్ణించిన దానితో సరిపోలదనీ, మనమెప్పటికీ లోతుగా గ్రహించనందువల్ల చాలామందిమి పదాలలో చిక్కుకుపోతుంటాము ఈ ప్రసంగాల సమయంలోనైనా, ఈ లోతైన సమస్యను అర్థం చేసుకునే ప్రయత్నం చేస్తేనూ, ఈ మానవుని మనసు - మెదడు, మనసు, హృదయాలతో కూడిన ఈ మొత్తం మనసు-శతాబ్దాల తరబడి జరిగిన ప్రచారం, భయము, తదితర ప్రభావాల ద్వారా ఎలా నిబద్ధీకరింపబడినదో అవగాహన చేసుకోగలిగితేనూ, అప్పుడు మనం, అలాంటి మనసు, సమూల పరివర్తనం చెందగలదా అని ప్రశ్నించుకోవచ్చు అదే గనుక సంభవిస్తే, మొత్తం ప్రపంచంలోని మానవాళి యావత్తూ, గొప్ప ప్రేమతో, గొప్ప ఆనందంతో, గొప్పశాంతితో, ఆ కొలవనలవి కాని దానిని దర్శిస్తూ జీవించగలరు

ఇదే మన సమస్య గత స్మృతులచే, సంప్రదాయంచే, అమితంగా భారమైపోయిన ఈ మనసు ప్రయత్నం లేకుండా, పెనగులాట లేక ఘర్షణల్లేకుండా, తనలోతానే మార్పు అనే జ్వాలను రగిలించుకుని, నిన్నా - మొన్నటి కల్మషాన్ని దగ్ధం చేయగలదా? గంభీర మనస్కులు, ఆలోచనాపరులైన వారుఎవరైనా యిలానే ప్రశ్నించుకుంటారనుకుంటాను ప్రశ్నించిన తర్వాత - మన మెక్కడి నుంచి ప్రారంభించేద్దాం? బాహ్యంలోనా, ప్రభుత్వ వ్యవస్థలోనా, సాంఘిక వ్యవస్థలోనా - ఈ మార్పు ఎక్కణ్ణించి తేవాలి? లేక, మానసికరంగంలో మొదలుపెడదామా? లేక, ఇందుకై, సాంకేతిక విజ్ఞానాన్నీ, శాస్త్రీయరంగంలో, మనిషి సాధించిన అద్భుతాలనూ పరిగణించి, ఈ విప్లవ సాధనను అక్కడ మొదలుపెడదామా? మనిషి ఆ ప్రయత్నం కూడా చేశాడు. చరిత్రగతిలో రక్తపాతంతో నిండిన విప్లవాలు జరిపినట్లుగా, బాహ్య ప్రపంచంలో సమూలమైన మార్పుని సాధిస్తే, అపుడు మనిషి కూడా మారతాడని, సంతోషంగా జీవిస్తాడని ఆశించాడు కమ్యూనిస్టులు, తదితర విప్లవకారులు, బాహ్య రంగంలో కనుక క్రమతను నెలకొల్పితే, అంతరంగంలో క్రమతను సాధించినట్లేనన్నారు వారింకా ఏమన్నారంటే, అంతరంగంలో క్రమత లేకపోతేనేమి, బాహ్యంలో ఉండటమే ముఖ్యమన్నారు ఊహా కల్పితమైన క్రమాన్ని, భూలోక స్వర్గాన్ని దేనినో ప్రతిపాదించి - ఆ పేరిట లక్షలాది మందిని సంహరించారు

కనుక, మొదటనే మనం, మన లోపలనే, మన మానసికరంగంలోనే దీనిని ప్రారంభించేద్దాం. దీనర్థం, గందరగోళంగా, అస్తవ్యస్తంగా ఉండే నేటి సాంఘిక వ్యవస్థను అట్లే వుంచాలని కాదు కానీ, లోపలా, వెలుపలా అనేవి విడివిడిగా ఉన్నాయా? లేక, లోపలా, వెలుపలా అనేవి రెండూ ఒకే కదలికలోవా? అవి రెండూ విడవిడి విషయాలు కాకుండా కేవలం కదలిక మాత్రమేనా? ఇరువురికీ అర్థమయే ఇంగ్లీషు భాషలో, ఇంగ్లీషు పదాలతో చేసే ఈ ప్రసంగంలో వాగ్రూపకమైన భావప్రసారమే కాక, తద్భిన్న రూపంలోనూ భావప్రసారం జరగడ మెంతో ముఖ్యమని నేను భావిస్తున్నాను అతిలోతైన, అత్యంత గంభీరమైన విషయాలలోకి మనం చొచ్చుకుపోవలసి వుంది కాబట్టి,

వాగ్రూపకంగా జరిగే భావప్రసారంతోపాటు, దానిని మించిన భావప్రసారం కూడ జరగాలి ఈ సమస్యను మనమిరువురమూ, అత్యంత శ్రద్ధాసక్తులతో, ఆపేక్షతో, అర్థం చేసుకోవాలన్న తపనతో విచారణ సల్పుతున్నపుడు, మన మధ్య అనుసంధానం అవసరం పదాల సాయంతో, పరస్పరం తెలియచేసుకొనటమే కాక, అంగీకార, అనంగీకార ప్రసక్తిలేని గాఢమైన సంధానం ఉండాలి మనం ఏవో భావాలు, అభిప్రాయాలు, సూత్రాలు, ఆదర్శాలను గురించి మాట్లాడుకోవడం లేదు కాబట్టి, ఇక్కడ అంగీకార, అనంగీకారాల ప్రసక్తి లేనేలేదు - మనిషిలో మార్పు నెలా తీసుకురావాలీ అనేదే మనముందున్న సమస్య కనుక ఇందులో మీ అభిప్రాయానికిగానీ, నా అభిప్రాయానికిగానీ విలువ ఏ మాత్రం లేదు గత వేలాది సంవత్సరాలుగా, ఇలాగే ఉండిపోయిన ఈ మానవులను మార్చడమసాధ్యమని మీరనేటట్లయితే, మిమ్మల్ని మీరు ముందే ఆటంకపర్చు కున్నారన్నమాట ఇక అడుగు ముందుకు వేయలేరు, విచారణకు పూనుకోరు. పరిశోధనను ప్రారంభించరు అలాకాక, 'అవును, ఇది సాధ్యమే' అని అన్నారనుకోండి. దానర్థం, మీరు సాధ్యాసాధ్యాల ప్రపంచంలో నివసిస్తున్నారుకానీ, వాస్తవాల ప్రపంచంలో కాదు

కనుక, మార్పు సాధ్యమని కానీ, సాధ్యం కాదనికానీ ముందరే అనుకోకుండా ప్రశ్న వంక చూడాలి దీనిని పరీక్షించి, పరిశోధించడానికి కావలసింది, యవ్వనోత్సాహంతోబాటు, కనుగొని తీరాలన్న ఆతురత కలిసిన కొంగ్రొత్తదనంతో కూడిన మనసుతో ఈ ప్రశ్నను సమీపించాలి విషయమేదైనా, అందరం, అత్యంత శ్రద్ధాసక్తులతో తరచి చూడదల్చుకున్నపుడు, ఈ వక్తకూ - మీకు మధ్య స్పష్టమైన పదాల ద్వారా, ఏర్పడే వాగ్రూపకమైన సంధానమేకాక, మైత్రీభావమూ, ఆపేక్షలతో కూడిన అనుసంధానం ఏర్పడాలి భార్యభర్తలు తమ బిడ్డల విషయం గురించి, తీవ్రంగా ఆలోచిస్తున్నప్పుడు, వారు తమ స్వంత యిష్టాయిష్టాలను, అభిప్రాయాలను, అన్నిటినీ పక్కన పెట్టేస్తారు, కారణం, వారి శ్రద్ధంతా, వారి పిల్లల మీదే ఆ శ్రద్ధలో గొప్ప వాత్సల్యముంటుంది. ఆ సమయంలో వారి చర్య అభిప్రాయాన్ని బట్టి వుండదు అదే విధంగా వక్తకూ - మీకూ మధ్య లోతైన అనుసంధానం ఉండాలి అపుడే యిరువురికీ, సంబంధించిన ఈ సమస్యను సరిసమానమైన తీక్షతతో, ఏకకాలంలో ఎదుర్కోగలం మనం మన మధ్య ఈ విధమైన అనుసంధానాన్ని ప్రతిష్ఠాపించుకున్నప్పుడు, అది మాత్రమే లోతైన అవగాహనను తీసుకువస్తుంది

ఇంత లోతుగా నిబద్ధీకరించబడిన, ఈ మనసు సమూలంగా ఎలా మారగలదనేదే ఇపుడు మన ప్రశ్న మీకు మీరే ఇలా ప్రశ్నించుకుంటున్నారని ఆశిస్తున్నాను ఎందుకంటే, సమాజనీతి వంటిది కాని నైతిక ప్రవర్తన, మత గురువులకుండే నిష్ఠలాంటిది కాని నైష్ఠికత, అంతరంగపు లోతుల్లో క్రమత - మనిషికి వుంటే తప్ప - సత్యమనండి, వాస్తవమనండి, దైవమనండి - ఏ పేరైనా పెట్టండి - వాటి కొరకు చేసే ఈ అన్వేషణకు అర్థంలేదు బహుశ ఇక్కడకు వచ్చిన వారు భగవంతునెలా సాక్షాత్కరింపచేసుకోవాలనో, లేక తాంత్రిక మాంత్రిక అనుభూతుల నెలా పొందాలనో వచ్చివుంటే మాత్రం వారు నిరాశ చెందగలరు. మీకు నవనవలాడే సరికొత్త మనసు, సత్యాన్ని దర్శించగల నేత్రాలు ఉంటే

తప్ప, ఆ కొలవనలవికానిదీ, ఆ నామరహితమైనదీ ఏదైతే ఉన్నదో, దానినర్ధం చేసుకొనజాలరు.

ఒక వంక, అస్తవ్యస్తమైన, అర్ధరహితమైన జీవితాలను గడుపుతూ, మరోవంక విశాలమైన, లోతైన అనుభవాలనాశిస్తే, మీకు ఏ విలువాలేని అనుభవాలే దక్కుతాయి ఈ విషయాన్ని మనమందరం కలిసి పరిశీలించాలి – ఇందులో అనేక విషయాలు యిమిడి ఉన్నాయి కాబట్టి ఇది జటిలమైన ప్రశ్నే ఇది అర్ధమవాలంటే, స్వేచ్ఛ కావాలి, శక్తి కావాలి – ఈ రెండూ మనందరికీ అవసరమే – గొప్పశక్తీ, పరిశీలించుటలో స్వేచ్ఛ మీరు ఏదో ఒక ప్రత్యేక విశ్వాసానికి కట్టుబడితేనూ, ఏదో ఒక భావనతో కల్పించుకున్న ఊహాలోకానికి, ముడివడి వుంటేనూ, మీరు స్వేచ్ఛగా చూడలేరనేది మాత్రం స్పష్టం

జటిలమైపోయిన ఈ మనసు, కాథలిక్, ప్రొటస్టెంట్‌లుగా విభజించబడి, సంప్రదాయాన్నంటిపెట్టుకుని, ఆకాంక్షాపరత్వంతో వ్యవహరిస్తూ భద్రతకోసం చూస్తుంటుంది ఒక్క సాంకేతిక రంగంలో తప్పితే, మిగతా ఏరంగాల్లోనూ లోతునెరుగని ఈ మనసుకు, చంద్రమండలానికి వెళ్లడం, ఒక అద్భుతాన్ని సాధించినట్లు అయితే, ఆ అంతరిక్ష నౌకను నిర్మించినవారు కూడ, తమ జీవితాలను అస్తవ్యస్తంగానే, చౌకబారుగానే గడుపుతుంటారు, వారి మనసులూ నిబద్ధింపబడి, అసూయ, ఆదుర్దా, ఆకాంక్షా పరత్వాలకు లోనయే వుంటాయి అటువంటి మనసులు, సమస్తమైన నిబద్ధత నుండి సంపూర్తిగా విడివడగలవా అని ప్రశ్నిస్తున్నాము అదే గనుక జరిగితే, వారు సంపూర్ణంగా విభిన్నమైన జీవితాలను గడపటం సాధ్యమౌతుంది. ఇది కనుగొనుటకు, క్రిస్టియన్‌లమనీ, హిందువులమనీ, డచ్చి లేక జర్మన్, రష్యన్లమనీ అనుకోకుండా గమనించగల స్వేచ్ఛ వారికి వుండాలి ఆ గమనికే క్రియ కనుక విశదంగా గమనించగలుగుటకు స్వేచ్ఛ అత్యవసరం. అలాంటి గమనికే, సమూల విప్లవం సంభవించేటట్లు చేయగలదు ఆ రకమైన గమనికకు మీకు గొప్ప శక్తి ఉండాలి.

ఇపుడు మనం మనుష్యులలో మార్పు కలుగుటకు కావలసిన శక్తీ, పూనిక, తీక్ష్ణతలు ఎందుకు లోపించినవో కనుగొనబోతున్నాం. పరస్పరం కలహించుకొనడానికీ, ఒకరినొకరు చంపుకోడానికీ, ప్రపంచాన్ని ముక్కలు చేయడానికీ, చంద్రమండలంలో అడుగిడడానికీ – వారికి శక్తి వున్నది – వీటికి మాత్రం ఎంతైనా శక్తి వున్నది కానీ, వారిని వారు సమూలంగా మార్చుకోడానికి మాత్రం తగిన శక్తి వున్నట్లు కనిపించడం లేదు మార్పుకి అవసరమైన ఈ శక్తి మనలో ఎందుకు లోపించింది అని అడుగుతున్నాము

మిమ్మల్ని ఇటువంటి ప్రశ్న అడిగినపుడు, మీ సమాధానం ఏమైవుంటుందా అని అనుకుంటున్నాను మేము అంటున్నదేమంటే, మనిషికి ద్వేషించటానికి చాలా శక్తి వున్నది, యుద్ధం వస్తే, పోరాడటానికీ, వాస్తవాన్నుంచి తప్పించుకుపోదామనుకుంటే, పోవడానికీ శక్తి వుంది ఏవేవో సిద్ధాంతాలతో వినోదాలతో, దేవుళ్ళు అనే పేరుతో, మద్యసేవనంతో, తప్పించుకుంటాడు సుఖాన్ని కోరినపుడు, అది శృంగార సౌఖ్యంకానీ, తదితర సౌఖ్యాలు కానీ – వాటిని శక్తివంతంగానే వెంబడిస్తాడు. వాతావరణ పరిస్థితుల్ని అధిగమించే తెలివి ఉన్నది. సముద్ర గర్భంలోనైనా, అంతరిక్షంలోనైనా నివసించగల శక్తీ,

సామర్థ్యాలున్నాయి, వీటన్నింటికీ అవసరమైన ముఖ్య ప్రాణశక్తి అతనిలో ఉన్నది కానీ తన కలవడిన ఓ చిన్ని అలవాటును కూడ మార్చుకునే శక్తి అతనిలో లేనట్లు కనిపిస్తుంది ఎందుకని? అంతఃస్సంఘర్షణలలో మనశక్తి చెల్లాచెదరైపోతున్నది మిమ్మల్ని ఏ విషయంలోనూ, ఏదో విధంగా ఒప్పించాలని ప్రయత్నించడంలేదు ప్రచారం చేయడంలేదు పాత భావాల స్థానే, కొత్త భావాలను ప్రవేశపెట్టడం లేదు మనం ఈ విషయాన్ని కనుగొనడానికి, అర్థం చేసుకొనడానికి ప్రయత్నిస్తున్నాము

మనం మారాలి, అని గ్రహించాం, ఉదాహరణకు, హింస - క్రౌర్యం - అవి వాస్తవాలు మనుష్యులు క్రూరులు, హింసాపరులు అన్ని మత వర్గాలవారు పొరుగువారిని ప్రేమించండి, దైవాన్ని ప్రేమించండని ఎంతగా ఘోషిస్తున్నప్పటికీ, వారు హింసా పూరిత సమాజాన్నే నిర్మించుకున్నారు వారికి దైవప్రేమ, మానవప్రేమ అనేవి భావమాత్రమే అయినందున, ఆ మాటలకు ఏ విలువా లేకుండాపోయింది, అంచేత, మనిషి క్రూరుడిగానే, హింసాపరుడిగానే వుండిపోయాడు స్వభావంలో హింస ఉండగా భావంలో మాత్రం తద్వ్యతిరేకమైన అహింసను సృష్టించాడు. మీరు కూడ నాతోపాటు ఈ విషయాన్ని పరిశీలించండి

అహింసాపరుణ్ణవాలని మనిషెప్పుడూ ప్రయత్నం చేస్తూనేవున్నాడు. కనుక, 'ఉన్నదాని'కీ అనగా హింసకీ, 'ఉండాలనుకున్నదాని'కీ అనగా అహింసకీ మధ్య ఘర్షణ రెంటి మధ్యా ఘర్షణ ఏర్పడింది శక్తి వృథా అగుటకు మూలకారణమదే ఉన్నదానికీ - ఉండాలనుకున్నదానికీ ద్వైదీభావం ఉన్నంతసేపూ - మనిషి మరోరకంగా అవాలనుకుని, దానిని సాధించుటకై ప్రయత్నం చేస్తున్నంతసేపూ ఘర్షణ తప్పదు ఆ ఘర్షణే శక్తి వృథా అవటం పరస్పర వ్యతిరేక పరిస్థితుల మధ్య ఘర్షణ ఉన్నంతవరకు, మనిషి మారుటకు కావలసినంత శక్తి అతనిలో వుండదు నాలో ఉన్న హింసకు, వ్యతిరేకమైన 'అహింస' అనే ఆదర్శాన్ని నేనెందుకు కలిగుండాలి? ఆదర్శం వాస్తవం కాదు, దానికే అర్థం లేదు అది పలురకాల కాపట్యానికి మాత్రమే దారితీస్తుంది. హింసతో ఉంటూ, హింసలేనట్లు నటించడం, మీరు కనుక, నేనొక ఆదర్శవాదిననీ, ఎప్పటికైనా శాంతిపరుణ్ణి అవుతాననీ చెప్పేటట్లయితే, అది కేవలం ఒక గొప్పనటన, ఒక సాకు మాత్రమే ఎందుకంటే, మీరు హింసను విడనాడేటప్పటికి, ఎన్నో సంవత్సరాలు పట్టవచ్చు - ఆ మాటకొస్తే అసలే జరక్కపోవచ్చు. ఈ మధ్యకాలంలో మీరు కపటిగానే వుండటం, మీలో హింస కొనసాగుతూనే వుండటం జరుగుతుంది అందువల్ల, మీరు ఊహల్లో కాకుండా నిజంగానే, ఆదర్శాలనన్నింటినీ, పక్కనపెట్టి, ఉన్న వాస్తవంతో, వ్యవహరించగలిగితే - అనగా హింసతో - ఇక శక్తి వృథా అవడమనేది జరగదు ఇది అర్థం చేసుకోవడం అత్యంత ప్రధానం ఇది ఈ వక్త ప్రతిపాదిస్తున్న ప్రత్యేక సిద్ధాంతం కాదు. పరస్పర వ్యతిరేకాల మధ్య, మనిషి జీవిస్తున్నంతకాలం, అతనిలో శక్తి వృథా అయిపోవడమూ, తథ్యం, తత్కారణంగా, అతను ఎప్పుడూ మారలేడనేదీ, తథ్యం

కనుక, ఒక్క చిటికలోనే, అన్ని సిద్ధాంతాలనూ, అన్ని వ్యతిరిక్తాలనూ తుడిచిపారేయవచ్చు విషయంలోకి వెళ్ళి, అర్థం చేసుకుంటే, అపుడు జరిగేది చాలా అద్భుతంగా ఉంటుంది ఆగ్రహంలో ఉన్న వ్యక్తి, ఆగ్రహించకుండా ఉండేందుకు,

ప్రయత్నించినా, ఆగ్రహంలేనట్లు నటించినా, అందులో ఘర్షణ ఉన్నట్లే అలాకాకుండా, 'ఆగ్రహమంటే ఏమిటో చూస్తాను, తప్పించుకోవాలని చూడను, తర్కించేసి సమర్థించుకోను' అంటే, అపుడు ఆగ్రహాన్ని అర్థం చేసుకోటానికీ, అంతం చేయటానికీ అవసరమైన శక్తి మీలో ఉంటంది మనసు నిబద్ధత నుండి విడివడాలనే భావం పెంపొందించుకుంటే చాలదు వాస్తవానికీ – 'ఉండాలనుకున్నదానికీ' మధ్య ద్వంద్వమలా సాగుతూనే వుంటుంది అందువల్ల శక్తి వృధా అయిపోతూనే వుంటుంది అలాకాక, మీరే 'మనసు, ఏ పద్ధతిలో నిబద్ధీకరింపబడిందో కనుగొనాలి ' అంటారనుకోండి, అప్పుడు ఆచర్య కాన్సర్ వ్యాధిగ్రస్థుడు, శస్త్రవైద్యుని వద్దకు వెళ్ళినట్లుంటుంది శస్త్రవైద్యుని బాధ్యత, ఆపరేషన్ చేసి, వ్యాధిని తొలగించడం వరకే కానీ, ఈ వ్యాధిగ్రస్థుడు అలా వైద్యుని వద్దకు వెళ్లకుండా ఆపరేషన్ తర్వాత, తానెంత ఆనందంగా ఉండగలనో అనే ఊహ చేస్తుంటేనూ, లేక అసలా ఆపరేషను గురించే భయపడుతుంటేనూ, అతనిలో శక్తి వృధా అయిపోతుంటుంది

ఇపుడు, మన మనసు నిబద్ధీకరింపబడింది అనే వాస్తవాన్నే, పట్టించుకోవలసి వున్నది అంతేగానీ 'మనసు స్వేచ్ఛగా ఉండాలి' అనే దానితో కాదు మనసు నిబద్ధత నుండి వైదొలగితే, అది స్వేచ్ఛలోనే వుంటుంది కనుక, ఈ మనసుని, ఇంత నిబద్ధతకు గురిచేసిన వేమైవుంటాయి, ఏఏ ప్రభావాలు ఈ పరిస్థితికి కారణం, దీనిని మనమెందుకు సమ్మతించాము, అనే విషయాల్ని, క్షుణ్ణంగా పరిశీలించి, కనుగొనబోతున్నాం. మొట్టమొదట, జీవితంలో సంప్రదాయానికి, చాలా ప్రముఖ పాత్ర ఉన్నది. ఈ మెదడు తన భౌతిక భద్రత కోసం, ఆ సంప్రదాయాన్నే, ఆశ్రయించి, అందులోనే అభివృద్ధి చెందింది భౌతిక భద్రత లేకుండా ఎవరూ మనజాలరు, జీవరాశికి అది మౌలిక ప్రాథమికావసరం కనుక భౌతిక భద్రత ఉండాలి ఉండటానికో యిల్లు, తినడానికింత తిండి, ధరించటానికో వస్త్రం ఉండకతప్పదు భౌతిక భద్రత యొక్క అవసరాన్ని మానసికానికి కూడ వర్తింపచేసినందువల్ల, అది లోనా, బయటా అల్లకల్లోలాన్ని సృష్టించింది ఆలోచనా నిర్మితమైన చిత్ (Psyche), దానికున్న అన్ని సంబంధాలలోనూ, అంతరంగంలోనూ భద్రతను కోరుతున్నది, అప్పుడే సమస్య మొదలవుతున్నది

భౌతిక భద్రత అనేది అందరికీ ఉండాలి ఏ కొద్దిమందికోకాదు, కానీ, జాతుల పేరిట, మతాలపేరిట, కుటుంబాల పేరిట మానసిక భద్రతను తీవ్రంగా వాంఛించడంతో, అందరికీ ఉండవల్సిన భౌతిక భద్రతను లేకుండా చేసినట్లయింది మీకిది అర్థమైందనీ, మనమధ్య ఏదో ఒకరకమైన భావప్రసారం జరిగిందనీ ఆశిస్తున్నాను

కనుక, భౌతిక భద్రతకవసరమైన నిబద్ధత మనలో ఉన్నది, కానీ దానితో పాటు మానసిక భద్రత కూడ కావాలని చేసే ఈ అన్వేషణ, ఈ బలీయమైన కోరిక కారణంగా ఆ నిబద్ధత మరింతశక్తిని పుంజుకున్నది అనగా మనకు, మన భావాలతో, మనుష్యులతో, వస్తువులతో ఉన్న సంబంధాలన్నింటిలో, మానసికంగా భద్రత కావాలంటాం, కానీ, ఏ సంబంధంలోనైనా, భద్రత అనేదసలుందా? లేదు, అనేది తెలుస్తూనే వున్నది మానసిక

భద్రతను కోరుతున్నామంటేనే, బాహ్యభద్రత లేకుండా చేసుకుంటున్నామన్న మాట ఒక హిందువుగా, నేను ఆ మతం కల్పిస్తున్న, అదినాకిస్తున్న శాంతి సౌఖ్యాలను, భద్రతను దృష్టిలో పెట్టుకుని, ఆ మొత్తం సంప్రదాయాన్ని, దానికి సంబంధించిన భావాలతో, మూఢ విశ్వాసాలతో సహా, ఆ విస్తృతరంగంతో నేను తాదాత్మ్యం చెందుతుంటాను కనుక, నేను ఆ జాతినే, ఆ జండానే, ఆదేశాన్నే ఆరాధిస్తూ, తతిమ్మా ప్రపంచాన్నుంచి నన్నువిడదీసుకుంటాను ఈ రకమైన విభజనే, భౌతిక అభద్రతను తీసుకువస్తున్నది అనే విషయం స్పష్టమే నేను ఒక జాతినీ, దాని ఆచారాలనూ, ఆ మత సిద్ధాంతాలనూ, తత్సంబంధమైన మూఢ విశ్వాసాలనూ, ఆరాధించినట్లయితే, ఈ వర్గీకరణలలో నన్ను నేను విడదీసుకోవడం, మిగతా అందరికీ భౌతిక భద్రతను లేకుండా చేయడమనేది స్పష్టమే మనసుకి భౌతిక భద్రత అవసరమే, కానీ అది మానసిక భద్రతను కోరినప్పుడు మాత్రం, దానికి భౌతిక భద్రత దెబ్బతింటుంది ఇది ఒక వాస్తవం, అభిప్రాయం కాదు– అదంతే నా సంసారం, నాభార్య, నాపిల్లలు, నాయిల్లు–వీటిలోనేను భద్రతని కోరుతున్నానంటే–ప్రపంచానికి నేను వ్యతిరేకినై ఉన్నట్లే, మిగిలిన కుటుంబాలనుంచి, నన్ను నేను వేరుచేసుకున్నట్లే, మిగతా మొత్తం ప్రపంచానికి నేను వ్యతిరేకినైనట్లే

అసలు ఈ నిబద్ధీకరణ ఎలా ప్రారంభమైన దనేది స్పష్టంగా చూడవచ్చు, రెండువేల ఏళ్ళుగా సాగిన ప్రచారం వల్ల క్రిస్టియన్ ప్రపంచంలో, ఆ సంస్కృతి ఎలా ఆరాధింపబడిందో, అదేవిధంగా తూర్పుదేశాల్లోనూ, అక్కడి సంస్కృతి ఆరాధింపబడు తున్నది ప్రచారం ద్వారా, సంప్రదాయం ద్వారా, భద్రంగా ఉండాలనే కోరిక ద్వారా మనసు తనను తాను నిబద్ధీకరించుకోవడం మొదలుపెడుతుంది కానీ, భావాలతో, మనుష్యులతో, వస్తుసముదాయంతో నెరపే సంబంధంలో మానసిక భద్రత అనేది ఉన్నదా?

ప్రత్యక్ష సామీప్యం కలిగి ఉండటమే సంబంధమనుకుంటే, అలాంటి సామీప్యత లేనపుడు మీకు సంబంధంఉండీ లేనట్లే నాభార్యను గురించి నాకొకభావమో, మనోచిత్రమో ఉన్నట్లయితే, నాకామెతో సంబంధం లేదనే అనుకోవాలి నేనామెతో కాపురం చేసినప్పటికీ, ఆమెను గురించి, నేనేర్పర్చుకున్న మనోచిత్రం, ఆమెకు నేను దగ్గర కాకుండా నిరోధిస్తుంది అందువల్ల, నాకామెతో సంబంధం లేనట్లే అదే మాదిరి, ఆమెకు, నాగురించి ఏర్పడిన మనోచిత్రం, ఆమెకు నాతో ప్రత్యక్షసంబంధం లేకుండా నిరోధిస్తున్నది మనసెప్పుడూ అపేక్షించే నిశ్చితమైన మానసిక స్థితిగానీ, భద్రతగానీ ఉన్నదా? ఏ సంబంధాన్నైనా మీరు నిశితంగా గమనించినట్లయితే, నిశ్చయస్థితి అంటూ ఏమీ లేదని స్పష్టంగా తెలుస్తుంది భార్యాభర్తలుగానీ, యువతీ యువకులు కానీ, తమ మధ్య ఓ దృఢమైన సంబంధం నెలకొనాలంటే, ఏం జరుగుతుంది? ఆభార్యకానీ, ఆ భర్తకానీ మరొకరి వంక చూసినదే తడవుగా మనసులో భయం, అసూయ, ఆందోళన, ఆగ్రహం, ద్వేషం మొదలౌతాయి. అందువల్ల, శాశ్వతమైన సంబంధమనేది ఉండదు. అయినప్పటికీ, ఆ మనసు ఎప్పుడూ, ఒకరి కొకరు చెందివుండాలనే కోరుతుంటుంది

కనుక, అదీ నిబద్ధీకరించే అంశం, ప్రచారం ద్వారా, పత్రికలు, మాగజైన్లద్వారా, మతప్రచారవేదికలనుంచి, ఇది తెలిసిన వారు బాహ్యప్రభావాలను ఏ మాత్రం నమ్మకుండా

ఉండటమెంత అవసరమో గ్రహించి మెలకువతో ఉంటారు అపుడు ఏ ప్రభావానికి లోనుగాకుండా ఉండటమంటే, ఏమిటో మీరు కనుక్కుంటారు జాగ్రత్తగా వినండి, మీరొక వార్తాపత్రికను చదువుతున్నపుడు, తెలిసో, తెలియకో ప్రభావితులౌతారు మీరొక నవలనో, ఓ పుస్తకాన్నో చదువుతుంటే, మీరు ప్రభావితం చేయబడతారు, అక్కడ ఒత్తిడి వుంటుంది, మిమ్మల్ని ఏదో ఒక వర్గంలోకి చేర్చేటట్లుచేస్తుంది ప్రచారం యొక్క పరమోద్దేశ్యమే అది ఇది, చిన్నతనంలో స్కూలులోనే ప్రారంభమౌతుంది, జీవితం పొడుగూతా సాగుతుంది ఇతరులు చెప్పినదానిని, చిలకపల్కుల వలె పలుకుతూ, రెండవతరగతి మనుష్యులౌతారు అలాంటివారు ఉపజ్ఞతో కూడిన దానిని ఎలాకనుగొంటారు? నిబద్ధత అంటే, ఏమిటో, లోతుగా చూచి, అర్థం చేసుకోవటం చాలా ముఖ్యం, దానివైపే మీరలా చూస్తుంటే, మనసుని అంటిపెట్టుకున్న ఆ నిబద్ధతలనన్నింటినీ, బ్రద్దలు కొట్టగల శక్తి మీలో ఉంటుంది

బహుశ మీకిపుడు ప్రశ్నించాలనీ, విషయం లోలోతులను తరచి చూడాలనీ అనిపిస్తుందవచ్చు ప్రశ్నలనడగటమనేది, చాలా సులభమనీ, సరైన ప్రశ్నను వేయడం చాలా కష్టమనీ గుర్తుంచుకోండి దీనర్థం ఈ వక్త మిమ్మల్ని ప్రశ్నించకుండా ఆటంక పరుస్తున్నాడనుకోవద్దు ఎవరు ఏమిచెప్పినా, అవి పుస్తకాలు కానీ, మతాలు కానీ, శాస్త్రప్రమాణాలు కానీ-ప్రతిదానినీ సందేహించాల్సిందే, ప్రశ్నించాలిసిందే! ప్రశ్నించాలి, సందేహించాలి, సంశయంతో ఉండాలి అయితే ఆ సంశయాలనన్నిటినీ ఎప్పుడు విసర్జించాలో కూడ తెలుసుకుని, సరైన ప్రశ్నను అడగాలి, అలాంటి ప్రశ్నలోనే సమాధానము ఉంటుంది కాబట్టి ఇపుడు మీరు అడగదల్చుకున్న ప్రశ్నను అడగండి

**ప్రశ్న: సర్, మీకేమైనా వెఱ్రిగానీ వున్నదా?**

**కృష్ణమూర్తి:** వక్తను, మీకేమైనా వెఱ్రి ఉన్నదా అని అడుతున్నారా? బాగా అడిగారు 'వెఱ్రి' అనే పదానికి మీరనుకునే అర్థ మేమిటో నాకు బోధపడటం లేదు చిత్ర విచిత్రమైన భావాలతో, నరాల బలహీనతతో, చపలత్వంతో, మతి స్థిమితం తప్పిందనా? 'వెఱ్రి' అనే పదంలో ఇవన్నీయిమిడి ఉన్నాయి తీర్పు చెప్పేదెవరు-మీరా,నేనా, మరొకరా? నిజంగానే అడుగుతున్నాను, ఎవరు తీర్పుచెప్పేది? ఒక వెఱ్రివాడు, ఎవరు వెఱ్రివారో, ఎవరు కాదో తీర్పుచెప్పగలడా? ఈ వక్తకు స్వస్థచిత్తం ఉన్నదో, లేదో మీరు తీర్మానిస్తే, అది ఈ ప్రపంచపు పిచ్చిలో భాగం కాదా? ఎవరి గురించైనా, తీర్పు చెప్పపూనుకున్నపుడు, అతని కీర్తి, అతని గురించి మీకేర్పడిన మనోచిత్రం మినహా, మరే విషయమూ తెలియకుండా తీర్పు చెప్పటంలోని సబబు ఏమిటి? అతనికి ఉన్నపేరునీ, అతణ్ణి గురించి చేసిన ప్రచారాన్నీ విని, దాని నాధారం చేసుకుని తీర్పుచెప్పగల సామర్థ్యం మీకున్నదా? తీర్పుచెప్పటంలో అతిశయం వుంటుంది, తీర్పుచెప్పేవాడి మనసు అస్వస్థంగా ఉన్నా, స్వస్థంగా ఉన్నా, అక్కడ ఉండేదెపుడూ అతిశయమే అతిశయం నిజాన్ని చూడగలదా?- చూచుటకు, అర్థం చేసుకొనుటకు, ప్రేమించుటకు మీకెంతో వినయం అవసరం కాదా? సర్, ఈ విపరీతోన్మాద ప్రపంచంలో స్వస్థచిత్తాన్ని కలిగుండటం చాలాకష్టమైన విషయం. స్వస్థచిత్తంలో భ్రమలు ఉండవు, తన గురించికానీ, ఇతరుల గురించికానీ మనోచిత్రాలే వుండవు

'నేను యిది', 'నేను అది', 'నేను అధికుణ్ణి', 'నేనల్పుణ్ణి', "నేను మంచివాడిని", "నేను ఉదారుణ్ణి" ఆ విశేషణాలన్నీ, తమపై తామేర్పర్చుకున్న మనోచిత్రాలు ఎవరైనా, తనను గురించి తానొక మనోచిత్రం ఏర్పర్చుకున్నాడంటే, అతను తప్పకుండా వెర్రివాడే, మిధ్యాలోకంలో బ్రతుకుతున్నవాడే, మనలో చాలామంది చేస్తున్నదదే మిమ్మల్ని దచ్చిజాతీయునిగా చెప్పుకుంటున్నారంటే-మీ మనసు సమస్థితిలో లేదు- ఇలా అంటున్నందుకు క్షమించండి మిమ్మల్ని మీరు వేరు చేసుకుంటున్నా రన్నమాట హిందువులమని చెప్పుకునే వారిలాగే, మీరూ విడిపోతున్నారు ఇక జాతిపరంగా, మతపరంగా ఏర్పడిన విభజనలు, ఎవరిసైన్యాలు వారివి! ఎవరి మతగురువులు వారికి! ఇదంతా మానసికోన్మాదాన్నే సూచిస్తుంది

**ప్రశ్న: హింసను తద్వ్యతిరేకభావం లేకుండా అర్థం చేసుకోగలమంటారా?**

**కృష్ణమూర్తి:** మనసు హింసతో ఉండాలనుకున్నప్పుడు, అది అహింస అనే ఆదర్శాన్ని ఆహ్వానిస్తుంటుంది చూడండి, ఇది చాలసులభం నాలో వుండేది దౌర్జన్యం, నేనా దౌర్జన్యంతోనే వుండదల్చుకున్నాను - మనుష్యులందరూ అంతే - క్రూరస్వభావులు. అయితే, నాలో పదివేలేండ్ల సంప్రదాయం కూడ ఉన్నది, అది 'అహింసను అలవరుచుకొమ్మని' చెప్తుంది ఇపుడు నేను హింసాపరుణ్ణి అనేది వాస్తవం, ఆలోచన, 'చూడు, నీవు అహింసాపరునిగా ఉండాలి' అంటుంది అదీ నా నిబద్ధత నేను నానిబద్ధతనుండి ఎలా విడివడాలి? అపుడే నేను చూడగలను కనుక నేను హింసతోనే వుండిపోయి, దానిని అర్థం చేసుకుంటాను, ఆ వ్యధనంతా అనుభవించి, దానినంతం చేయగలనా?-కేవలం, పైపైననే కాదు, అట్టడుగున, లోతులో, అవ్యక్తచేతన అనిపిలవబడే దానిలో కూడా అంతం చేయాలి మనసు ఆదర్శంలో చిక్కుకోకుండా ఉండటమెలా? అదేనా ప్రశ్న?

దయచేసి వినండి, మనం మార్టిన్ లూథర్ కింగ్‌ని గురించికానీ, గాంధీ మహాశయుణ్ణి గురించిగానీ, తదితరులగురించిగానీ, మాట్లాడటం లేదు-వారు, వారి ఆదర్శాలు, వారినిబద్ధతా, వారి రాజకీయ ఆశయాలు-వాటితో మనకు నిమిత్తం లేదు. మనమేమిటిగావున్నామో, మానవమాత్రులమైన మీరూ, నేనూ - మనల్ని గురించే మాట్లాడుకుంటున్నాం. మనుష్యులందరివలెనే మనం కూడ హింసాపరులం సంప్రదాయం ద్వారా, ప్రచారం, సంస్కృతుల చేత నిబద్ధింపబడ్డాము కనుకనే మనలో 'వున్న దానికి' వ్యతిరేక భావాన్ని సృష్టిస్తాం, మనకి అనుకూలమైనప్పుడు ఆవ్యతిరేక గుణాన్ని వాడుకుంటాం, అనుకూలం కానపుడు పక్కన పెట్టేస్తాం రాజకీయరంగంలోను, ఆధ్యాత్మిక రంగంలోను దానిని పలువిధాలుగా వినియోగిస్తాం కానీ, ఇపుడు మేము చెప్తున్నదేమిటంటే, మనసు హింసతో ఉండిపోదామనీ, పూర్తిగా దానినర్థం చేసుకుందామనీ అనుకున్నప్పటికీ, సంప్రదాయం, అలవాట్లు ప్రవేశించి జోక్యం చేసుకుంటాయి అవి, 'మీకు అహింస అనే ఆదర్శం ఉండాలి' అంటాయి. ఉన్నవాస్తవం ఒకటి, సంప్రదాయం మరొకటి- 'హింస' మీద తనయావత్తు శ్రద్ధనూ నిలుపుటకు గాను, మనసు సంప్రదాయం నుంచి వైదొలగడమెలాగ? అదీ ప్రశ్న మీకర్థమైది గదా? నేను హింసాపరుడిననే వాస్తవం ఒకటి కాగా, అలా ఉండరాదని చెప్పే సంప్రదాయం మరొకటి యిపుడు నేను హింసను

చూడను, సంప్రదాయాన్నే చూస్తాను హింసను శ్రద్ధగా చూద్దామని నేననుకున్నప్పుడు, సంప్రదాయం వచ్చి జోక్యం చేసుకుంటుంటే, అది ఎందుకు అడ్డం వస్తున్నది? అసలు అది ఎందుకు ప్రవేశించటం? ఇపుడు నాశ్రద్ధ, హింసను అర్థం చేసుకోవడం మీదలేదు, సంప్రదాయపు జోక్యం మీద పెట్టాను బోధపడిందా? నేను సంప్రదాయం వంక సావధానతతో చూడగానే, అది ఇక జోక్యం చేసుకోదు ఇపుడు నేను మనిషి జీవితంలో సంప్రదాయానికింత ప్రముఖ పాత్ర ఎందుకున్నదో కనుక్కోవాలి – సంప్రదాయమూ ఒక అలవాటే. పొగతాగడం, సురాపానం, శృంగారపరమైన అలవాటు, ఒకతీరుగా మాట్లాడే అలవాటు–మనం ఈ అలవాట్లలో ఎందుకు జీవిస్తున్నాం? వాటిని గురించి మనకు తెలుసునా? వాటిని గురించి మనకు పూర్తిగా తెలుసుకోకపోతేను, సంప్రదాయాన్ని అర్థం చేసుకోకపోతేను, ఆ అలవాటు, ఆ యాంత్రికత, మనం చూడదల్చుకున్న విషయంలో జోక్యం చేసుకోవడం, సంఘర్షించడం తప్పదు అలవాట్లలో జీవించడం చాలాసులభం, కానీ వాటిని ఛేదించుకుని జీవించడంలో అనేకం సంభవించవచ్చు – నా ఉద్యోగమే పోవచ్చు ఛేదించుకు జీవించాలని ప్రయత్నించినపుడే నాకు భయం కలుగుతుంది కారణమేమంటే, నాకు అలవాటైన జీవితం నాకు భద్రతనిస్తుంది, నిశ్చయస్థితిలో ఉంచుతుంది నాతోటి వారుకూడ అలాగే జీవిస్తున్నారు కదా! డచ్చివారి దేశంలో నిలబడి 'నేను డచ్చివాణ్ణికాదు', అనే కేకపెడితే, అది అందర్నీ దిగ్భ్రమకు గురిచేస్తుంది కనుక అందులో భయం ఉన్నది నిజానికి వ్యవస్థలో క్రమం లేనప్పటికీ, నేటి 'సుస్థాపిత వ్యవస్థలోని క్రమమంతటికీ' నేను వ్యతిరేకిని అన్నారనుకోండి, వారు మిమ్మల్ని వెలివేస్తారు; దానితో మీరు భయపడిపోయి, దానికి తల ఒగ్గుతారు జీవితంలో సంప్రదాయానికి అత్యంత ప్రధానపాత్ర ఉన్నది మీరెప్పుడైనా మీకు అలవాటులేని ఆహారం రుచి చూశారా, దానికి మీ జిహ్వకానీ, మీ ఉదరం కానీ ఎలా ఎదురుతిరుగుతాయో చూడండి మీకు కనుక పొగతాగే అలవాటు వుంటే, దానిని పీలుస్తూనే వుంటారు ఆ అలవాటు మానివేయాలంటే, ఎన్నో సంవత్సరాలు మీరు దానితో పోరాడవలసివస్తుంది

అందుచేత, మనసు అలవాట్లలో భద్రతను కనుగొని, 'నా సంసారం, నా పిల్లలు, నా ఇల్లు, నా సామాను' అంటుంది. 'నా వస్తు సామగ్రి' అని మీరన్నప్పుడు, మీరే ఆ వస్తు సామాగ్రి. మీకు నవ్వు రావచ్చు; కానీ మీరు ప్రేమించే ఒకానొక వస్తువును, మీ వద్దనుండి ఎవరైనా తీసుకువెడితే, మీకు కోపం వస్తుంది మీరే ఆ వస్తుసామాగ్రి, ఆ ఇల్లు, ఆ ధనం, ఆ జెండా అలా జీవించడం లోతులేని, మూర్ఖపు జీవితమేకాక, రోజూ చేసిందే చేస్తూ, విసుగులో జీవించడమౌతుంది, ఇలా విసుక్కుంటూ యాంత్రిక జీవితం గడుపుతుంటే మీలో హింస వుండి తీరుతుంది.

*ఏమ్స్టర్‌డామ్, మే 3,1969*

# 5. మనం శాంతియుతంగా ఎందుకు జీవించలేకపోతున్నాం?

## శాంతియుతంగా ఎందుకు జీవించలేము? భయము ఎలా జనిస్తున్నది? కాలము, ఆలోచన, సావధానత: 'మేల్కొని' ఉండుట

**కృష్ణమూర్తి:** ఘర్షణ కానీ, దురవస్థలు కానీ, గందరగోళం కానీ లేకుడా ప్రేమాదరాలే మెండుగా నిండివుండే ఒక జీవితవిధానాన్ని మనం కనుగొనలేకపోవటం, ఎంతో విచిత్రంగా ఉన్నది సమాజంలో ఆర్థిక, నైతిక, సామాజిక రంగాలను ఎలాతీర్చిదిద్దాలో వివరిస్తూ రాసిన మేధావులగ్రంధాలను అధ్యయనం చేశాం అటుపైన, మతానుయాయులు, వేదాంతులు తమ తమ ఊహాపోహలతో రచించిన గ్రంధాలవైపు దృష్టిని మరల్చాం వారందరి భావాలపై ఆధారపడకుండా మనంతటమనమే, శాంతీ, శక్తీ, సుస్పష్టతలతో, చైతన్యవంతంగా ఉండే జీవితవిధానాన్ని కనుగొనటం మనలో చాలామందికి కష్టమైనట్లు తోస్తుంది మనం, ఎంతో ప్రాజ్ఞులంగాను, నాగరీకులంగాను భావించబడుతుంటాం మనలో కొందరు పెద్దతరం వారు రెండు భయంకర యుద్ధాలను, విప్లవాలను, పెనుమార్పులను, అన్నిరకాల దుఃఖాలను చవిచూశారు ఇదంతా చూసిన తర్వాత కూడ, ఇక్కడ, ఈ సుందర సుప్రభాత వేళలో ఈ విషయాలనన్నిటినీ ముచ్చటించుకుంటూ, ఇకముందు మనం ఏంచేయాలీ, ఆచరణ యోగ్యమైన జీవిత విధానం ఏమిటి అనేవిషయాలు, మరెవరైనా చెప్తే విందామని ఎదురుచూస్తున్నట్లున్నది. నిత్యజీవిత క్రమాన్ని మించినదీ, ఉన్నతమైనదీ, సుందరతరమైనదీ అయిన దానికి ఎవరైనా మార్గం చూపితే వారిని అనుసరించాలనుకుంటున్నాం

అసలు మనం – ఇతరుల మాటలనెందుకు వినాలి?–బహుశా మీకు కూడ ఇలాగే అనిపిస్తుండవచ్చు మన మనో–హృదయాలలో వక్రీకరణ ఏమాత్రం లేకుండా, స్వయంగా స్పష్టతను ఎందుకు నెలకొల్పుకోలేకుండా ఉన్నాం? ఇన్ని గ్రంధాల బరువుని మనం మోయవలసిన అవసరం ఏమిటి? గొప్పతన్మయత్వంతో, నిండుగా, నిశ్చలంగా, నిజమైన శాంతితో జీవించలేమో? ఈ పరిస్థితులు నాకు నిజంగానే విడ్డూరంగా ఉన్నాయి, కానీ ఉన్నది అది ఏ రకమైన ప్రయత్నం కానీ, ఏ పోరాటంకానీ లేకుండా జీవితాన్ని గడపలేమా, అని మిమ్మల్ని మీరు ఎపుడైనా ప్రశ్నించుకున్నారా? ఎపుడూ దీనిని

మార్చాలనో, దానిలో పరివర్తనం తేవాలనో, దీనినణచాలనో, దానిని అంగీకరించాలనో అని ఏవో కొన్ని సూత్రాలనూ, అభిప్రాయాలనూ మనసునందుంచుకుని, వాటిని అనుకరించటమో, అనుసరించటమో - ఈ విధంగా మన ప్రయత్నాలు అనంతంగా సాగిపోతుంటాయి

ఘర్షణలు లేకుండా జీవించడం సాధ్యమేనా అని మనల్ని మనం ఎప్పుడైనా ప్రశ్నించుకున్నామా?-మేధాపరమైన జీవితంలోని ఒంటరితనం కాదు, రాగభావోద్వేగాలతో గడిపే సుతిమెత్తని జీవితంలోనూ కాదు - అసలు ఎప్పుడూ, దేనికీ, ఏ ప్రయత్నం లేకుండా జీవించడం సాధ్యమేనా? ఎందుకంటే, ప్రయత్నమనేది, ఎంత సంతోషకరమైనదైనా (లేక అసంతోషాన్ని కలిగించేదైనా), తృప్తికరమైనదైనా లేక లాభకరమైనదైనా, మనసుని వక్రీకరిస్తుంది, అపమార్గం పట్టిస్తుంది అది సాఫీగా సాగిపోకుండా యంత్రం వలె ఎపుడూ గరగరా తిరుగుతూ అతిత్వరగా అరిగిపోతుంది ఇపుడు ప్రశ్న - అడగదగిన ప్రశ్నే - ఘర్షణా రహిత జీవనం సాధ్యమేనా? దానర్థం, సోమరిగా, ఒంటరిగా, నిర్లక్ష్యవైఖరితో, సున్నితత్వాన్ని కోల్పోయి బద్ధకస్థునివలె ఉండాలని కాదు సుమా! మన మొత్తం జీవితం, పుట్టిననాటినుంచీ చనిపోయేవరకూ అంతులేని పెనుగులాట, ఏదో ఒకదానికి సర్దుకుపోడానికో, మార్పుచెందడానికో, మరోవిధంగా రూపొందడానికో ప్రయత్నిస్తుంటాం ఈ పెనుగులాట, ఈ ఘర్షణ మనల్ని అయోమయంలో పడేసి, మనసుని మొద్దుబారేటట్లు, హృదయం సున్నితత్వాన్ని కోల్పోయేటట్లు చేస్తాయి

ఘర్షణా రహిత జీవితమనేది ఒక ఊహామాత్రమేననీ, నిరాశాజనకమనీ, శక్తికి మించినదనీ - అనుకోకుండా ఘర్షణలు లేని జీవితం కనుగొనడం సాధ్యమా? పైపైన, ఉపరితలంలోనే కాక, అంతరంగంలో, అట్టడుగున, అవ్యక్తచేతన అని పిలువ బడుతున్నదానిలోకూడ, ఘర్షణల్లేని జీవితాన్ని కనుగొనగలమా? ఈ ఉదయం మనం ఈ ప్రశ్నను తరచి చూద్దాం.

మొదటిసంగతి, ఘర్షణలనేవి-అవి ప్రీతికరమైనవైనా, కాకపోయినా-వాటిని మనం ఎందుకు సృష్టిస్తున్నాం? వాటిని అంతం చేసేవీలుందా? అలా వాటిని అంతం చేసేసి, పూర్తిగా విభిన్నమైన జీవితం, అనగా, గొప్పశక్తీ, సుస్పష్టతా, మేధాపరమైన సమర్థతా, హేతుబద్ధతా కలిగి ఉంటూ కూడ, నిజమైన ప్రేమ పొంగిపొరలే హృదయంతో జీవించలేమా? ఈ విషయాన్ని కనుగొనటానికి, మన మనో-హృదయాలను రెంటినీ దానిపై పూర్తిగా లగ్నంచేసి, కనుగొనవలసివున్నది

మనలోని వైరుధ్యమే సమాజంలోనూ ప్రకటితమౌతూ, నేను-నేను కానిది అంటూ వ్యవహరిస్తుండటమే ఘర్షణలకు కారణమనే విషయం స్పష్టంగానే తెలుస్తున్నది అనగా 'నేను'లో ఉన్నవి, దాని ఆకాంక్షలూ, తీవ్రవాంఛలూ, బలీయంగా ముందుకి తోసే కోర్కెలు, సుఖాసక్తి, ఆదుర్దా, ద్వేషం, పోటీతత్వం, భయాలు మున్నగునవి 'నేను కానిది' ఆ మరొకటి అంతేకాక, 'నేను' అనేదానిలో పరస్పరవిరుద్ధమైన కోర్కెలూ, వాంఛలూ, ఆరాటాలతోపాటు-ఘర్షణల్లేని జీవితం గడపాలనే భావం కూడ మనలో ఉంటుంది ఈ ఒత్తిడిని గనుక గమనించినట్లయితే ఇలా పరస్పరం విరోధించే వాంఛలూ, వ్యతిరేకించే

విశ్వాసాలు, అభిప్రాయాలు, లక్ష్యసాధనకై చేసే యత్నాలు అన్నింటినీ మనలోనే మనం చూచే వీలున్నది

ఈ ద్వైదీభావమే - ఇలా పరస్పరం వ్యతిరేకించే కోర్కెలు, వాటితోపాటు వచ్చే భయాలు, వైరుధ్యాలు అనేవే సంఘర్షణలను తీసుకువస్తాయి మనల్ని మనం గమనించుకుంటే ఇదంతా స్పష్టంగా కనిపిస్తుంది నిత్య జీవితంలోనే కాక-మతపరజీవితమని పేరు పెట్టుకున్నదానిలో కూడ ఇదే పద్ధతి-స్వర్గనరకాల మధ్య, మంచీ-చెడులమధ్య, ఉదాత్త-అనుదాత్తాల మధ్య, ప్రేమ - ద్వేషాలమధ్య పునరావృత మౌతుంటుంది సర్, దయచేసి ఈ మాటలను మాత్రమే వినవద్దు మిమ్మల్ని మీరు ఏ విశ్లేషణాలేకుండా ఈ వక్తను ఓ అద్దం వలె వినియోగించుకుని, మిమ్మల్ని మీరు యధాతథంగా చూసుకొనండి, ఆ అద్దంలో మిమ్మల్ని చూసుకుంటూవుంటే, మీ మనసు, మీ హృదయం ఎలా పనిచేస్తున్నవో మీకు తెలిసి వస్తుంది తనలోన కానీ, బాహ్యంలోనకానీ ఏవిధమైన విభజన, వేర్పాటుభావన, లేక వైరుధ్యం ఉంటే హింస-అహింసల మధ్య ఘర్షణను తప్పక తీసుకువస్తుందని చూడగలరు ఈ పరిస్థితులనన్నిటినీ, యధాతథంగా చూచి, గ్రహించి నిత్యజీవితంలోనూ, చేతన యొక్క ఉపరితలంలోనేకాక, మన ఉనికికే మూలమైన 'సత్తా' దగ్గర్నుంచే ఆ పరిస్థితులనంతం చేయడం సాధ్యమా? అదే గనుక, సాధ్యమైతే ఇక వైరుధ్యం ఉండదు, పరస్పరం వ్యతిరేకించే బలీయమైన వాంఛలు, కోర్కెలు వుండవు, ద్వంద్వ పూరితమై, తునాతునకలయే మనసులో ఏ కార్యకలాపమూ ఉండదు అయితే, ఇది ఎలా జరగాలి? నేను-నేను కానిదిల మధ్య వంతెన నిర్మిస్తారు - నేనులో అనగా, మనలో ప్రవర్తిల్లే ఆకాంక్షలూ, తీవ్రవాంఛలూ, వైరుధ్యాలు, అదీ ఉన్నస్థితి 'నేను కానిది' అనగా ఒక ఆదర్శం, ఓ సూత్రం, ఓ సిద్ధాంతం ఉన్నదానికీ - ఉండాలనుకున్నదానికీ మధ్య ఓ వంతెన నిర్మించాలని మనమెప్పుడూ ప్రయత్నిస్తుంటాం అందులోనే వైరుధ్యం, ఘర్షణ ఉన్నాయి, అందువల్లనే మనశక్తులన్నీ వృధా అయిపోతున్నవి మనస్సు తనను తానిలా విభజించుకొనకుండా, తాను, 'ఉన్నస్థితి'తోనే పూర్తిగా ఉండిపోగలదా? 'ఉన్నదానిని' అర్థం చేసుకోవడంలో ఇక ఘర్షణ ఏముంటుంది?

ఈ ప్రశ్ననే, మరో కోణం నుంచి పరిశీలిద్దాము, దీనికీ, స్వేచ్ఛకీ-భయానికీ మధ్యనుండే సంబంధాన్ని పరిశీలిద్దాము, మనలో చాలామంది స్వేచ్ఛనే కోర్తాము, మన కాలాన్నంతా స్వార్థ పూరితమైన కార్యాలలోనే వెచ్చిస్తూ, స్వంతజీవితంలోని సాఫల్యాలనూ, వైఫల్యాలనూ గురించే తలపోస్తూవుండి కూడ, మనం స్వేచ్ఛ కావాలీ అంటాం రాజకీయరంగంలో స్వేచ్ఛ, నియంతృత్వ ప్రభుత్వాలలో తప్ప, కొంతవరకు ఇతరచోట్ల సులభంగానే లభిస్తుంది కానీ మనం మత ప్రచారంనుంచి కూడ స్వేచ్ఛ కావాలంటాం మతమనేది-అది ప్రాచీనం కానీ, ఆధునికంకానీ, ఏ మతం వర్ధిల్లినా అది ప్రచారకుల పూనికే అందువల్ల అది మతమే కాదు మనిషి ఎంతగంభీరమనస్కుడైతే, అంతగా ఈ మొత్తం జీవిత వ్యవహారం పట్ల శ్రద్ధ వహిస్తాడు దేనినీ అంగీకరించకుండా విశ్వసించకుండా వుండే నిమిత్తం మరెంతో స్వేచ్ఛకావాలంటాడు అంతగా ప్రశ్నిస్తూనే వుండాలంటాడు శాశ్వతమైనదీ, కాలరహితమైనదీ అయిన ఆ యదార్థతత్వం ఉన్నదా,

లేదా అని కనుగొనటానికై మనిషి స్వేచ్ఛకావాలని కోరుకుంటాడు ప్రతిబాంధవ్యం నుంచీ కూడ స్వేచ్ఛ ఉండాలన్న ఈ విపరీతమైన కోరిక మనిషికి వుంటున్నది అయితే, ఆ రకమైన స్వేచ్ఛ సాధారణంగా తనను తాను వేరుచేసుకొనే ప్రక్రియ అవుతుంది కనుక, అది నిజమైన స్వేచ్ఛ కాదు స్వేచ్ఛను ఇంతగా వాంఛిస్తున్నామంటే, అందులో భయం ఉన్నదన్న మాటే కారణం, స్వేచ్ఛలో అభద్రత అనేది సంపూర్ణంగా ఖచ్చితంగా యిమిడి ఉండచ్చు పూర్తి అభద్రతలో ఉండటం మనిషికి భీతి కొల్పుతుంది అభద్రత అనేది మహా ప్రమాదకరమనిపిస్తుంది - ప్రతి పసిబిడ్డ తన సంబంధాలలో భద్రతను తీవ్రంగా కోరుతుంది కానీ మనం పెరిగి పెద్దవుతున్నకొద్దీ మనకి ఉన్న అన్ని సంబంధాలలోనూ, ఖచ్చితమైన భద్రత, నిశ్చయత్వం ఉండాలని కోరుతూనే వుంటాం-వస్తువులతో, మనుష్యులతో, భావాలతో, భద్రతకై మనం పడే ఆరాటమే మనలో భయాన్ని పెంచుతున్నది, ఆ భయమే మనల్ని, మనం మమకారం పెంచుకున్నవాటిపై మరింతగా ఆధారపడేటట్లు చేస్తున్నది ఇందులోనుంచే స్వేచ్ఛ-భయాలను గురించిన ప్రశ్న ఉదయిస్తున్నది, ఈ భయంనుంచి మనం విముక్తినొందడం సాధ్యమేనా? భౌతికంగానే కాక, మానసికంగానూ, మనసు ఉపరితలంలోనేకాక, మనసులోతుల్లో, చీకటి మూలల్లో మున్నెన్నడూ ప్రవేశించనలవి కాని రహస్యస్థలాల్లో కూడ భయాన్నంతం చేయడం సాధ్యమేనా? మనసు తనలో భయం యిక నేమాత్రం మిగలకుండా పూర్తిగా విముక్తిచెందగలదా? ఈ భయమే ప్రేమను హరించి వేస్తున్నది-ఇది సిద్ధాంతమేమీ కాదు- ఈ భయమే మన సంబంధాలన్నింటిలో కలిగే ఆదుర్దాలకు, అనుబంధాలకు, స్వాధీనంలోవుంచు కోవాలనే కోరికకు, పెత్తనం చలాయించాలనే తత్వానికీ, అసూయకీ- కారణమౌతున్నది హింస ప్రవర్తిల్లడానికీ ఈ భయమే కారణం అత్యధిక జనాభాతో క్రిక్కిరిసివుండే పట్టణాలలో అభద్రతా, అనిశ్చయత్వం, భయాలు అధికంగా ఉంటున్నవనీ, హింస ప్రబలటానికి కొంతవరకు ఇవే కారణమనీ తెలుసుకోవచ్చు ఈ భయం నుంచి మనం స్వేచ్ఛ నొందగలమా? అపుడు, మీరీ హాలునుంచి బైటికి వెళ్ళేసరికే, మిమల్నిక భయపు చీకటినీడలు ఏమాత్రం వెంటాడవు

భయాన్ని అర్థం చేసుకొనటానికి, మనం భౌతికపరమైన భయాలనే కాక, విస్తారంగా వ్యాప్తిచెంది అల్లుకుపోయిన మానసిక భయాలను కూడ పరీక్షించాలి బహుశా మనం ఇపుడు ఈ ప్రశ్నను పరిశీలించవచ్చు· మనకు భయం ఎలాకలుగుతున్నది? ఆ భయాన్ని అలాగే సజీవంగా ఏది నిలుపుతున్నది? ఏది కొనసాగిస్తున్నది? దాన్ని అంతం చేయడం సాధ్యమేనా? భౌతిక పరమైన భయాలను సులభంగానే అర్థం చేసుకోవచ్చు భౌతిక దేహానికి ప్రమాద మాసన్నమైనపుడు తక్షణం స్పందిస్తాం, ఆ స్పందన శతాబ్దాలతరబడి నిబద్ధీకరింపబడిన మనసు నుండి వచ్చే స్పందన అదే కనుక, మనల్నాదుకొనక పోతే భౌతికదేహం రక్షింపబడదు, ప్రాణి కోటి యావత్తూ అంతమయ్యేది భౌతికంగా మనిషి జీవించాలి. వేలాది సంవత్సరాల సంప్రదాయం, 'జాగ్రత్తసుమా' అని హెచ్చరిస్తున్నది ప్రమాదం పొంచి ఉన్నది, జాగ్రత్తగా ఉండి, చెయ్యవలసింది తక్షణం చెయ్యమని జ్ఞప్తి చెప్తున్నది ప్రమాదం విషయంలో జరిగే భౌతిక ప్రతిచర్య భయం అనిపించుకుంటుందా?

దయచేసి దీనిని జాగ్రత్తగా వినండి మనం తరచి చూసి, విచారణ చేయబోతున్న అంశమెంతో సరళమే అయినప్పటికీ, క్లిష్టమైనది కూడ మీరు సావధానతలో వుండి వింటే తప్ప దానిని అర్థం చేసుకోలేరు ప్రమాదం విషయంలో దేహంలో తక్షణచర్యకు పురికొల్పే యింద్రియస్పందన భయం అవుతుందా అని అడుగుతున్నాం లేక అది తెలివి అయినందువల్ల భయం కానేకాదేమో? ఈ తెలివి సంప్రదాయం, స్మృతులు పెంచి పోషించిన విషయమా? అదే అయితే, మానసికరంగంలో అనేక విషయాల్ని గురించి మనిషి విపరీతంగా భయపడినపుడు, వాటన్నిటినీ పూర్తిగా పరిష్కరించదేమి? ప్రమాదం రాబోతున్నదని గ్రహించగానే, ఏ తెలివైతే మనల్ని భౌతికంగా రక్షించిందో, అదే తెలివి మానసిక భయాల విషయంలో ప్రవర్తిల్లదేమి? భౌతికానికి సంబంధించిన ఈ తెలివి, మనిషి మానసిక స్వభావానికి కూడ వర్తిస్తుందా? అనగా, మనందరికీ తెలిసిన భయాలు ఎన్నో–మరణభయం, చీకటి భయం, భార్యగానీ, లేక భర్తగానీ ఏమంటారో, ఏమి చేస్తారో ననే భయం, పొరుగువారు కానీ, పై అధికారికానీ ఏమనుకుంటారోనని భయం–ఇలానానారకాల భయాలు, ఈ భయాల సంపుటిలోకి మనం వెళ్ళడం లేదు ఏ ఒక్క ప్రత్యేకభయం గురించీ కాదు, అసలు భయం గురించే మనం శ్రద్ధతో విచారణ చేస్తున్నాం భయం కలిగినపుడు, మనం దానిని గమనించినదే తడవుగా, దాన్నుంచి తప్పించుకొనడానికై ఒక కదలిక ప్రారంభమౌతుంది, దానిని అణచాలనో, దాన్నుంచి పారిపోవాలనే, మతపరమైన సంబరాలతో సహా, పలురకాల వినోదాలలో మునిగి పోవాలనో ప్రయత్నాలు చేస్తుంటాం, లేదా ధైర్యాన్ని కూడగట్టుకుని, అనగా భయాన్ని ప్రతిఘటించడం మొదలుపెడతాం, తప్పించుకున్నా, వినోదాల వెంటవెళ్ళిపోయినా, ధైర్యం పూనినా – అన్నీ వాస్తవమైన భయాన్ని ప్రతిఘటించటానికి రకరకాల మార్గాలు భయం ఎంత ఎక్కువైతే, దాన్ని ప్రతిఘటించడం కూడ అంత ఎక్కువగానూ వుంటుంది అందువల్ల, నరాల దుర్బలతను సూచించేచేష్టలు మొదలవుతాయి ఉన్నది, 'భయం' మనస్సు – లేక – నేను, 'భయం ఉండకూడదంటుంది', దానితో ద్వైధీ భావం మొదలు భయానికి భిన్నమైన 'నేను', భయాన్నుంచి తప్పించుకుంటుంది, ప్రతిఘటిస్తుంది, శక్తిని పెంచుకుంటుంది, సిద్ధాంతీకరిస్తుంది లేక విశ్లేషకునివద్దకు వెడుతుంది, ఇక 'నేను కానిది ఒకటివుంది'' ఆ 'నేను కానిది' భయం, ఆ భయం నుంచి విడిగా ఉన్నది 'నేను'. ఇప్పుడు భయానికీ–భయాన్ని అతిక్రమించాలనుకున్న 'నేను' కీ తక్షణం సంఘర్షణ మొదలైంది గమనించేవాడు ఉన్నాడు – గమనించబడేది ఉన్నది గమనించబడేది భయము, గమనించే వాడినైన 'నేను' ఆభయాన్ని వదిలించుకోవాలనుకుంటాడు దీనితో ఓ ప్రతికూలత, వైరుధ్యం, వేర్పాటు భావనలు ఏర్పడి భయానికీ–భయం నుంచి వైదొలగాలనుకున్న 'నేను'కీ మధ్య ఘర్షణ ప్రారంభమౌతుంది మనం పరస్పరం అర్థం చేసుకుంటున్నామా?

ఈ సమస్యలో యిమిడి ఉన్నది ఏమంటే 'నేను కానిదై'న భయానికీ, భయానికి భిన్నమనుకునే 'నేను' కీ మధ్య ఘర్షణ తాను భయానికి వేరుగా, ఉన్నాననుకుని, భయాన్ని ప్రతిఘటించాలనీ, దానిని అధిగమించాలనీ, తప్పించుకోవాలనీ, దానిని

అణిచిపెట్టాలనీ లేక అదిమి పెట్టాలనీ ప్రయత్నిస్తూ వుంటుంది ఈ విభజనే తప్పనిసరిగా ఘర్షణను తీసుకువస్తుంది ఇదెలాంటిదంటే, రెండు సర్వస్వతంత్ర రాజ్యాలకు చెందిన రెండు జాతుల మధ్య, వారి వారి సేనానుల మధ్య, వారి నావికాదళాలమధ్య జరిగే పోరాటం లాంటిది

ఇక, ఉన్నదేమంటే, గమనించేవాడు-గమనించబడుతున్న వస్తువు,-గమనించేవాడు, 'నేను ఈ భయంకరమైన దానిని వదిలించుకోవాలంటాడు దాన్ని అంతం చేయాలనుకుంటాడు ఈ గమనించే వాడెపుడూ ఘర్షణలోనే వుంటూ, పోరాడుతూనే వుంటాడు. ఇదేపద్ధతి మనకి అలవాటైపోయింది. ఇదే మన సంప్రదాయం, మన నిబద్ధత ఏ రకమైన అలవాటునైనా ఛేదించుకుని బయటపడట మనేది మనకు చాలాకష్టమైపోయింది ఎందుకంటే, మనకి అలవాట్లలోనే జీవించడం యిష్టం-పొగతాగడం, మద్యం సేవించడం లేక కామ పరమైన మానసికపరమైన అలవాట్లు జాతుల్లోనైనా, సర్వస్వతంత్ర ప్రభుత్వాల్లోనైనా ఇంతే 'మాదేశం-మీదేశం', 'మాదైవం-మీదైవం', 'మా విశ్వాసం - మీ విశ్వాసం' అంటూ వుంటారు పోరాటాలు సాగించడం మన సంప్రదాయమైపోయింది, భయాన్ని ప్రతిఘటిస్తూ, తద్వారా ఘర్షణలను పెంచుతూ ఆభయానికి మరింత జీవం పోస్తుంటాం.

మీకిది బోధపడినట్లయితే, మనం తర్వాతి అడుగువేయచ్చు అదేమంటే, గమనించేవాడికీ - గమనించబడేదానికీ ఈ సందర్భంలో నిజంగా భేదం ఉన్నదా? గమనించేవాడు, గమనిస్తున్నదానికి, అనగా, భయానికి తాను భిన్నమని అనుకుంటాడు అతనికీ-అతను చూచే వస్తువుకీ ఏమైనా తేడా ఉన్నదా, లేక ఆరెండూ ఒకటేనా? అవి రెండూ ఒకటేనన్నవనేది, స్పష్టమే గమనించేవాడే-గమనించబడేది సంపూర్ణంగా నూతన మైనదేదో ఆవిర్భవించినపుడు గమనించేవాడు వుండనే వుండడు కానీ, గమనించేవాడు తనలో కలిగిన ప్రతిక్రియాభావాన్ని తానింతకు మునుపే, ఎరిగిన భయంగా గుర్తించినందువల్ల, రెంటిమధ్య ఈ విభజన ఏర్పడింది మీరీవిషయంలో లోతులకు వెళ్తున్నకొద్దీ - మీరావిధంగా చేస్తున్నారనే అనుకుంటాను - గమనించేవాడు, గమనించబడేదీ సారంలో ఒక్కటే నన్నవిషయాన్ని మీరే(గ్రహిస్తారు ఆ రెండూ ఒకటే అయినపుడు, 'నేను' - నేనుకానిద'నే వైరుధ్యాన్ని మీలో పూర్తిగా తొలగిస్తారు, దానితోపాటే ప్రయత్నం చేయడమనే ప్రక్రియను కూడ మీలో పూర్తిగా తుడిచి పెట్టేస్తారు దీనర్థం, మీరు భయాన్ని ఆమోదించారనీ కాదు లేక దానితో తాదాత్మ్యం చెందారనీ కాదు.

అక్కడ గమనించబడుతున్నభయం ఉన్నది - ఆభయంలో భాగమైన గమనించేవాడున్నాడు ఇప్పుడు ఏం చేయాలి? (వక్త శ్రమిస్తున్నంతగా మీరు కూడ శ్రమిస్తున్నారా? ఈ పదాలను మాత్రమే వింటున్నట్లయితే ఈ భయ్యమనే అంశాన్ని మీరు పూర్తిగా పరిష్కరించజాలరనిపిస్తుంది) ఉన్నది భయమే-భయాన్ని గమనిస్తున్న గమనించేవాడు ఉండడు ఎందుకంటే, గమనిస్తున్నవాడు భయమే కాబట్టి ఇక్కడ అనేక విషయాలు సంభవిస్తున్నాయి మొదటిది, భయమంటే ఏమిటి? అది ఎలా జనిస్తున్నది? ఈ భయానికి గల కారణమేమిటని కానీ, ఆ భయంతో పాటు కలిగే దురవస్థలు,

అసహ్యాలు, అవి మనిషి జీవితాన్నెలా అంధకారబంధురం చేస్తున్నవని కానీ ప్రస్తావించడం లేదు కానీ, మేమడుగుతున్నదేమంటే - భయమంటే ఏమిటి, అదెలా జనిస్తున్నదీ అని భయానికి గల అంతులేని కారణాలను గురించి విశ్లేషణను కొనసాగిస్తూనేవుండాలా? ఎందుకంటే, విశ్లేషించపూనుకున్నపుడు, ఆ విశ్లేషకుడు అన్ని పూర్వాభిప్రాయాలనుండి, అన్ని రకాల నిబద్ధతలనుండి సంపూర్తిగా విముక్తి చెందివుండాలి, అతను జాగ్రత్తగా పరికించవలసి వున్నది, పరిశీలించవలసివున్నది లేని పక్షంలో అతని తీర్పులో ఏరకమైన వక్రీకరణ ఉన్నా, అతను విశ్లేషిస్తున్న కొద్దీ ఆ వక్రీకరణ కూడ పెరిగిపోతుంటుంది

కనుక, భయాన్ని అంతమొందించుటకు, విశ్లేషించడం అనేది భయాన్ని అంతం చేసినట్లుకాదు ఇక్కడ ఉన్నవారిలో, కొందరు విశ్లేషకులు ఉండివుండవచ్చు. భయానికి గల కారణం కనిపెట్టి, కనిపెట్టినదానిపై చర్య తీసుకోవడంలో కారణం ఫలితమౌతున్నది, ఫలితం కారణమౌతున్నది ఆ ఫలితాన్ని తీసుకుని, దాని వెనుక గల కారణాన్ని కనిపెట్టడం కోసం చర్యతీసుకుని, ఆ కారణాన్ని కనిపెట్టి, ఆకారణాని కనుగుణంగా చర్యతీసుకోవడమే తర్వాతిదశ ఇలాకారణం, ఫలితం గొలుసుకట్టువలె అంతులేకుండా సాగిపోతుంటాయి భయానికి గల కారణాన్ని అర్థం చేసుకోవడమో, భయాన్ని విశ్లేషించడమో చేయకుండా పక్కకు పెట్టేస్తే, మనమిక చేయగలిగినదేమిటి?

చూడండీ, ఇది వినోదం కాదు, కానీ దీనినంతా కనుగొనడంలోనూ, అర్థం చేసుకొనడంలోనూ ఎంతోసరదావుంది సంతోషం ఉంది కనుక, భయమెలా కలుగుతున్నది? కాలము, ఆలోచనలే భయాన్ని కలిగిస్తున్నవి-కాలమంటే, నిన్న, ఇవాళ, రేపు, రేపు ఏదో జరుగుతుందనే భయం ఉన్నది-ఉద్యోగం ఊడిపోతుందేమో, మరణ మాసన్నమైనదేమో, నాభార్యగానీ, భర్తగానీ వదిలివెళ్ళిపోతారేమో, ఏనాడో నేననుభవించిన వ్యాధి, ఆ బాధ తిరిగి రానున్నవేమో, ఇక్కడే కాలం ప్రవేశిస్తున్నది-నన్నుగురించి రేపు నాపొరుగువారు ఏమనబోతారో అనే దానిలో కాలం ఉన్నది, అనేక సంవత్సరాలక్రితం నేనేదో చేసి, దానిని దాచేసిన నిజం బయట పడుతుందేమోననే భయం, దానిలో కాలం ఉన్నది నా మనసులోతుల్లో రహస్యంగా దాచుకున్న కోర్కెలు తీరవేమోనని భయపడుతున్నాను కనుక 'భయం'లో కాలం ఉన్నది జీవితాంతంలో సంభవించబోయే మరణం, అవతలి మలుపులో కాచుకుని ఉన్నదేమోనని భయపడుతుంటే, ఆ భయంలోనూ కాలం ఉన్నది కనుక కాలంలో భయమూ, ఆలోచనా రెండూ వుంటాయి; ఆలోచనే లేకపోతే, కాలమూ ఉండదు నిన్న సంభవించిన దాన్నిగురించి తలపోస్తున్నా, రేపు మళ్ళీ అది జరుగవచ్చునేమోనని భయపడుతున్నా - ఆ తలపులే కాలాన్నీ, భయాన్నీ సృష్టిస్తున్నాయి

దీనిని మీరు జాగ్రత్తగా గమనించండి మీరేదానిని చూడండి. - దేనీనీ అంగీకరించవద్దు, తిరస్కరించవద్దు, కానీ వినండి కేవలం పదాలను మాత్రమే కాకుండా, ఇందులోని నిజమేమిటో మీకు మీరే కనుగొనండి, అంగీకరించినా, అంగీకరించకపోయినా ముందుకు సాగిపోండి సత్యాన్ని కనుగొనటానికి, మీలో కనుగొనితీరాలన్న గాఢాసక్తి, గాడాభినివేశాలతో పాటు గొప్ప శక్తీ వుండాలి అప్పుడు మీరు ఆలోచనే భయాన్ని పెంచుతున్నదని తెలుసుకుంటారు, గతాన్ని గురించీ, భవిష్యత్తుని

గురించీ ఆలోచిస్తుంటే–ఆ భవిష్యత్తు మరునిమిషానిదవ్వచ్చు, మర్నాటిదవ్వచ్చు, లేక పది సంవత్సరాల తర్వాతిదవ్వచ్చు – దానిని గురించి ఆలోచిస్తుంటే, అదే ఒక సంఘటనగా రూపొందుతున్నది నిన్నటిరోజున నాకు సంతసాన్నిచ్చిన ఓ ఘట్టాన్ని గురించి ఆలోచిస్తుంటే–అదే ఆ సంతోషాన్ని యినుమడింపచేస్తుంది, కొనసాగింపచేస్తుంది, ఆ సంతోషం శృంగారపరంకానీ, ఇంద్రియపరంగానీ, మేధాపరంగానీ, మానసిక పరంకానీ– వాటిని గురించి ఆలోచించినా, అందరిలాగే ఆయామనోచిత్రాలను నిర్మించుకున్నా, గతంలోని ఆ సంఘటనను ఆలోచనతో పొడిగిస్తూవుండటమూ, ఆ సుఖాన్ని మరింతగా పెంచుకోవటమూ జరుగుతుంది

ఆలోచన సుఖాన్ని పెంచినట్లే, భయాన్నీ పెంచుతుంది, అవి రెండూకాలానికి చెందినవే. సుఖమూ–బాధా అనే రెండు ముఖాలున్న ఈనాణాన్ని ఆలోచన సృష్టిస్తుంటుంది – అదే భయం ఇపుడు మనం చెయ్యవలసిందిఏమిటి? మనకీ ఆలోచన అత్యంత ప్రధానమైనందువల్ల మనం దానిని ఆరాధిస్తున్నాము అది ఎంత జిత్తులతో కూడివుంటే, అంతగొప్ప ఆలోచన అనుకుంటాం వ్యాపార ప్రపంచంలో, మత ప్రపంచంలో లేక సాంసారిక ప్రపంచంలో మేధావంతుడు ఈ ఆలోచనను ఉపయోగిస్తాడు, ఆలోచన అనే ఈ నాణాన్ని పదాలమాలలో అతిగా వాడుతుంటాడు మాటలలో మేటి అయిన ఈ ఆలోచనాపరులను, ఈ మేధావంతులను మనం ఎంతగౌరవిస్తాం? భయానికీ, సుఖమని పిలువబడేదానికీ ఆలోచనే కారణం.

మనకి సుఖం ఉండకూడదని మేము అనడం లేదు. పరమయోగులం కాదు కాబట్టి, మనం ఆ సుఖాన్ని అర్థం చేసుకొనడానికి ప్రయత్నిస్తున్నాం, ఈ మొత్తం క్రియాకలాపాన్ని అర్థం చేసుకుంటే, భయం అంతమౌతుంది. అపుడు సుఖమనేది పూర్తిగా భిన్నంగా ఉంటుందనేది మీరేగ్రహిస్తారు. వ్యవధిగనుక ఉంటే, ఈ విషయాన్ని మరింతలోతుల్లో తరచిచూద్దాం. ఈ వేదనకంతా ఆలోచనేకారణం, ఒకవైపు వేదన, మరొకవైపు సుఖం, అది అలాకొనసాగాలనుకోవడం; ఎడతెగని సుఖాభిలాష, ఆ సుఖాన్ని వెంబడిస్తూ వుండటం – సుఖమనేది, మతపరమైనదైనా, ఇతరేతరమైనదైనా, సుఖాపేక్షే అవుతుంది ఇపుడిక ఆలోచన ఏంచేయాలి? అది అంతం కాగలదా? ఇది సరైన ప్రశ్నేనా? దాన్ని అంతం ఎవరు చేయాలి? – ఆలోచన కానటువంటి ఈ 'నేనా'? కానీ 'నేను' ఆలోచనా ఫలితమే, మళ్ళీ మనం ఆ పాతసమస్య దగ్గిరకే వస్తున్నాం; 'నేను'– 'నేనుకానిది' అనగా గమనిస్తున్న వ్యక్తి, 'నేను గనక ఆలోచనని అంతం చేయగలిగినట్లయితే, నేను 'మరో విధంగా జీవించేవాణ్ణి' అంటాడు. కానీ అక్కడ ఉన్నది ఆలోచనే' ఆలోచనను అంతం చేయాలనుకున్న గమనిస్తున్నవాడు కాదు. ఆ గమనిస్తున్నవాడు ఆలోచనలోనుంచి పుట్టుకువచ్చినవాడే అసలీ ఆలోచన ఎక్కడినుంచి పుట్టుకువచ్చింది? జ్ఞప్తికీ, విజ్ఞానానికీ, అనుభవాలకీ కూడలి అయిన మెదడునుంచి వచ్చే స్పందనే ఆలోచన అనేది సులభంగానే గ్రహించవచ్చు ఏ విషయంగురించి దానిని అడిగినా సరే ప్రతిక్రియ ద్వారా స్పందిస్తుంది అనగా అదే జ్ఞప్తి, గుర్తింపు, లక్షలాది సంవత్సరాల పరిణామమూ, నిబద్ధతల ఫలితమే మెదడు – ఆలోచన ఎపుడూ పాతదే, దానికెపుడూ స్వేచ్ఛలేదు, సమస్తమైన నిబద్ధతనుండి వచ్చే స్పందనే ఆలోచన

మరిపుడు ఏంచేయాలి? ఆలోచనే భయాన్ని సృష్టించింది కాబట్టి, ఆభయాన్ని తాను ఏమీ చేయజాలనని గ్రహించినపుడు నిశ్శబ్దం అలముకుంటుంది, ఇక భయాన్ని సృష్టించేచలనాలన్నీ పూర్తిగా తిరస్కరించబడతాయి అందువల్ల, ఆ మనసు–మెదడుతో సహా, 'నేను'–'నేను కానిది'ల మధ్య పోరునీ, అలవాట్లు, వైరుధ్యాలు– మొత్తాన్నీ గమనిస్తుంది గమనిస్తున్నవాడే, గమనించబడేదన్న విషయాన్ని ఆ మనసు గ్రహిస్తుంది భయాన్ని కేవలం విశ్లేషించి ఊరుకున్నందువల్ల అది అంతమవదు, అది అట్లాగే ఉండి పోతుందని చూసినపుడు, మనసుకి విశ్లేషణ మార్గం కాదని తెలిసివస్తుంది.

ఇపుడు ఇట్లా అడుగుదాం, భయానికి మూలమేమిటి? అదెలా పుట్టుకువస్తున్నది? అది కాలము – ఆలోచనల నుంచే బయటికి వస్తున్నదని చెప్పాం జ్ఞప్తి నుండి వచ్చే స్పందనే ఆలోచన కాబట్టి ఆ ఆలోచనే భయాన్ని సృష్టిస్తున్నది. ఆలోచనను కేవలం అణిచి పెట్టినందువల్ల, అదిమిపెట్టినందువల్ల, దానిరూపుమార్చినందువల్ల, మనిషి తనను తాను మభ్యపెట్టుకునేందుకై పలు జిత్తులను ప్రయోగించినందువల్ల, అది అంతం కాజాలదు ఈ మొత్తం వ్యవహారసరళినంతా, ఎంపిక లేకుండా, తటస్థంగా, తనలోనే తాను చూచుకుని గ్రహించినపుడు, ఆలోచన తనకుతానే, 'ఇక ఏరకమైన అదుపూ, అణిచివేతా లేకుండా సద్దుమణిగివుంటాను', 'నిశ్చలంగా వుండిపోతాను' అంటుంది.

అపుడు ఆలోచన అంతం అవుతుంది, దానర్థం దుఃఖం అంతమైంది, తనను తాను అర్థం చేసుకోవడం–తనను తాను తెలుసుకోవడం. తనను తాను తెలుసుకొనకపోతే, దుః ఖమూ, భయమూ అంతం కావడమనే ప్రసక్తిలేదు భయవిముక్తమైన మనసు మాత్రమే యదార్థతత్వాన్ని ముఖాముఖి దర్శించగలదు

ఇక, ఇప్పుడు మీరేమైనా ప్రశ్నలను అడగాలని అనుకుంటూ ఉండవచ్చు. మీరు ప్రశ్నించవలసిందే, – ఇలా ప్రశ్నిస్తూ, ఇక్కడ ఎవరికి వారు తమ మనసులలో ఉన్నదానిని బహిర్గతం చేయడమేకాక, మీరు గదిలో ఒంటరిగా ఉన్నప్పుడూ, తోటలో తిరుగాడుతున్నప్పుడూ, బస్సులో నిశ్శబ్దంగా కూర్చున్నప్పుడూ, వాహ్యాళికి వెళ్ళినపుడూ కూడ, దేనినైనా కనుగొనే నిమిత్తం మిమ్మల్ని మీరు ప్రశ్నించుకుంటూ ఉండవలసిందే కానీ సరైన ప్రశ్నను వేసుకోవాలి, ప్రశ్న సరైనదైనపుడే సరైన సమాధానం కూడ వస్తుంది

**ప్రశ్న: మనిషి, తననూ, తన బాధలనీ, తన దుఃఖాన్నీ ప్రశ్నించకుండా, అంగీకరించడమేనా సవ్యమైనది?**

**కృష్ణమూర్తి:** మనిషి తనస్థితికి తానెలా సమ్మతించి ఊరుకుంటాడు? మీలోని వికృతాన్ని, క్రౌర్యాన్ని, హింసనీ, నటననీ, కాపట్యాన్ని కొనసాగిస్తూ ఎలా ఉండిపోగలరు? మీ మాటలకు అదా అర్థం, మీకు మారాలని లేదా?–మనం ఆ మొత్తాన్నీ మార్చనక్కర్లేదా? నేడు సుస్థాపితమై ఉన్న సమాజవ్యవస్థలో ఉన్న నీతి, నీతి కాదని తెలిసి కూడ మనం దాని నెలా సమ్మతిస్తాము? నిరంతరం మార్పుచెందుతూ సాగిపోయే చలనం కాదా జీవితం? మనిషి కనుక నిజంగా జీవిస్తున్నట్లయితే, ఇంక దేనికీ అంగీకరించడమనే ప్రశ్నేలేదు. ఉన్నది జీవితమే అప్పుడు జీవనగమనంతోపాటే, మనం జీవిస్తుంటాము. జీవనగమనం మననుంచి మార్పుని కోరుతుంది. మానసిక విప్లవాన్ని కోరుతుంది. ఉత్పరివర్తన సంభవించాలంటుంది

**ప్రశ్న: నాకు అర్థం కావడం లేదండీ!**

**కృష్ణమూర్తి:** దానికి నేను చింతిస్తున్నాను మీరు 'అంగీకారం' అనే పదాన్ని వాడారు కదా, ఇంగ్లీషుభాషలో మామూలుగా దానికి ఉండే, అర్థం విషయాలను యథాతథంగా అంగీకరిస్తూవుండడం ఇప్పుడు 'డచ్చి' భాషలో వాడి చూడండి

**ప్రశ్న: జరుగుతున్న వాటిని, జరగనివ్వడమేనంటారు.**

**కృష్ణమూర్తి:** నేను నాకు సంభవిస్తున్న ప్రతిదానికీ తల ఒగ్గి ఉండిపోతానా, ఉదాహరణకి, నాభార్యనన్ను వదిలి పెట్టిపోయిందనుకోండి, నాడబ్బుని పోగొట్టుకున్నా, నా ఉద్యోగం ఊడిపోయినా, నేను నిరసించబడినా, అవమానించబడినా, వాటినన్నిటినీ అంగీకరించి, చలించకుండా ఉండిపోగలనా? యుద్ధానికి నాసమ్మతిని తెలుపుతానా? వాస్తవంలో ఏవేవైతే సంభవిస్తున్నవో-వాటిపై సిద్ధాంతీకరణ చేయకుండా, మారుమాట్లాడకుండా, వాటినన్నిటినీ స్వీకరించాల్నంటే ఈ 'నేను' నుంచి, ఈ 'నా' అన్నదాన్నుంచి విముక్తి చెందివుండాలి ఈ ఉదయం మనం మాట్లాడుతున్నదదే 'నేను'-'మీరు'-'మనము'-'వారు' అనేభావాలు మనసులోనుంచిపూర్తిగా తొలగిపోయి, శూన్యం సంభవించాలి అపుడే మీరు అనుక్షణం పెనుగులాడకుండా, ఘర్షించకుండా జీవించగలరు అదే నిజమైన ధ్యానం నిజమైన క్రియ అవుతాయి. ఇంక ఘర్షణ ఉండదు, క్రౌర్యం ఉండదు హింస ఉండదు

**ప్రశ్న: మనం ఆలోచించక తప్పదు కదండీ! అది అనివార్యం.**

**కృష్ణమూర్తి:** అవునండీ, నాకర్థమైంది మనం ఆలోచించనే కూడదని మీరు సూచిస్తున్నారా? ఉద్యోగనిర్వహణకు ఆలోచించాలి, ఇంటికి వెళ్ళాలంటే ఆలోచించవలసిందే, పదాలతో జరిగే ఈ సంభాషణ కూడ ఆలోచనా ఫలితమే కనుక జీవితంలో ఆలోచనకి ఉన్న స్థానమేమిటి? మీరు ఏ పనిచేస్తున్నా, ఆలోచన ప్రవర్తిల్లుతుండవలసిందే దీనిని తిన్నగా అర్థం చేసుకొనండి కంప్యూటరు పనిచేస్తున్నమాదిరిగా-అంత సమర్థవంతంగా కాకపోయినా-ఏ సాంకేతికపరమైన వృత్తిని నిర్వహిస్తున్నా ఆలోచన అవసరం స్పష్టంగా ఆలోచించగలుగుటకు ఆలోచన అవసరం, అయితే అది తటస్థంగానూ, భావోద్వేగరహితంగానూ, అభిప్రాయ-దురభిప్రాయాలు లేకుండానూ ఉండాలి. ఏపనినైనా స్పష్టంగా చేయాలన్నా, సమర్థవంతంగా చేయాలన్నా ఆలోచన కావాలి కానీ ఆలోచన భయాన్ని పెంచుతుందనీ, ఆ భయం మనం సమర్థవంతంగా ఏపనినైనా చేయటంలో ఆటంకం కలిగిస్తుందనీ మనకు బాగాతెలుసు. ఆలోచన అవసరమైనపుడు ఏపనినైనా భయరహితంగా చేయడం, ఆలోచన అవసరంలేనపుడు ప్రశాంతంగా ఉండగలగటమనేది మనకు సాధ్యమా? ఇది మీకు అర్థం అయినదా?

భయము, సుఖము, ఆలోచన, ప్రశాంతచిత్తం - వీటితోకూడిన ఈ మొత్తం క్రియాకలాపాన్నీ అర్థంచేసుకోగల మనసు, హృదయం మనకు ఉన్నాయా? అవసరం ఏర్పడినపుడు ఆలోచనా పూర్వకంగా పనిచేయుట, ఆలోచన అవసరం లేనిసమయంలో అసలు ఆలోచనను ఉపయోగించకుండా ఉండుట చేయగలమా? ఇది నిజానికి చాలా సరళమైన విషయం, అవునా? మనసుమేల్కొని ఉన్నపుడు, అవసరమైనపుడు

ఆలోచించడమూ, ఆచరించడమూ, ఆక్రియను యాంత్రికంగానూ, నిద్రావస్థలోకి జారకుండానూ, సంపూర్ణ సావధానచిత్తంతో, మెలకువతోనూ ఆలోచించటం, ఆచరించడమనేది మనసుకి సాధ్యమేనా?

కనుక, ఆలోచించవలసిన అవసరం ఉన్నదా, లేదా అనికాదు ప్రశ్న, మెలకువతో వుండటమెలాగ అనేదే మన ప్రశ్న మనసుమెలకువ యందుండాల్నంటే, ఆలోచన, భయం, ప్రేమ,ద్వేషం, ఒంటరితనం మొదలైనవాటిని లోతుగా అర్ధం చేసుకుని వుండాలి తానెలా ఉన్నాడో అలాఉంటూకూడ, వీటన్నింటినీ పూర్తిగా అర్ధం చేసుకుంటూవుండాలి మనసులో ఏమాత్రం వక్రీకరణలేకుండా, పూర్తిమెలకువతో ఉన్నప్పుడు మాత్రమే, దాన్నర్ధం చేసుకునే వీలున్నది

**ప్రశ్న: ప్రమాదమెదురైనపుడు, అనుభవాలనుంచే ప్రతిక్రియ సలుపుతుంటామని, మీరంటున్నారా?**

**కృష్ణమూర్తి:** మీరలాచేయడం లేదంటారా? ప్రమాదకరమైన జంతువుని మీరు తారసిల్లినపుడు, మీ జ్ఞాపకాల, అనుభవాల ఆధారంతో లోనుంచి వస్తుండే ప్రతిక్రియతో మీరు చర్యతీసుకొనడం లేదా?-అది మీ వ్యక్తిగతానుభవం కాకపోవచ్చు, జాతివారసత్వం 'మిమ్మల్ని జాగ్రత్తసుమా' అని హెచ్చరిస్తుండవచ్చు

**ప్రశ్న: అదే నామనసులో ఉన్నది.**

**కృష్ణమూర్తి:** కానీ, మనం జాత్యహంకారం, యుద్ధం, వేర్వేరు ప్రభుత్వాలు, వారి సర్వాధికారాలు, వారిసైన్యాలు-వీటన్నింటివల్ల సంభవిస్తున్న ప్రమాదాన్ని చూచినపుడు, అదే విధమైన సామర్ధ్యంతో మనం చర్యకు పూనుకోవడంలేదు, ఎందుకని? నిజానికివే మహాప్రమాదకరమైనవి, వీటికి మనమెందుకు ప్రతిస్పందించడం లేదు? 'దీనినంతా మార్చేద్దామని మనమెందుకు అనడం లేదు' దీనర్ధం, మిమ్మల్ని మీరు మార్చుకుంటారు - ఎందుకంటే, మీరంటే మీకు తెలుసుకాబట్టి మీరేజాతికీ, ఏజెండాకీ, ఏదేశానికీ, ఏమతానికీ చెందమనుకుంటే, మీరు స్వేచ్ఛాజీవులవుతారు కానీ మనమలా చేయడం లేదు భౌతికపరమైన ప్రమాదాలకు ప్రతిస్పందిస్తాం కానీ, మరింత వినాశకరమైన మానసికరంగపు ప్రమాదాలకు సరిగా స్పందించడంలేదు లోకంలోని పరిస్థితుల్ని ఉన్నవి ఉన్నట్లుగా అంగీకరించటమైనా చేస్తాం, లేక వాటికి ఎదురుతిరిగి, ఆదర్శయుతమైన ఊహాలోకాన్ని ప్రతిపాదిస్తాం, మళ్ళీ పరిస్థితి మొదటికేవస్తుంది బాహ్యంలో జరిగే ప్రమాదాలను చూచినట్లే, అంతరంగంలో కలిగే ప్రమాదాలను చూడాలి. అవిరెండూ ఒకటే, అనగా మెలకువతో ఉండటం-దానర్ధం, తెలివితో, సున్నితస్పృహతో ఉండటం

*ఏమ్‌స్టర్‌డామ్, మే10, 1969*

# 6. జీవితం యొక్క పరిపూర్ణత్వం

## ఉద్దేశ్యరహితమైన గాఢాభినివేశాన్ని అర్ధం చేసుకొనుట.

**కృష్ణమూర్తి:** ప్రపంచమంతటా మనుష్యుల్లో గాఢాభినివేశం ఎందుకులోపించిందో అర్ధం కావటం లేదు వారు అధికారం, పదవులు, మతపరమైన, శృంగారపరమైన పలురకాల వినోదాల వెంబడే పోతుంటారు, కామసంబంధమైన వ్యామోహాలలో వారికి ఆసక్తి ఎక్కువ బహుకొద్ది మంది మాత్రమే, విచ్ఛిన్నం చేయబడిన వ్యాపకాలలో తమశక్తినంతా ధారపోయకుండా, జీవితమనే సమస్త క్రియాకలాపాన్ని అర్ధం చేసుకొనుటకుగాను, ఈ గాఢాభినివేశాన్ని కలిగుంటున్నారు, అదే వారిని దానికి అంకితమయేటట్లు చేస్తున్నది బ్యాంకుమేనేజరుకి, తన బ్యాంకింగ్ వ్యవహారాల్లోనే బ్రహ్మాండమైన ఆసక్తి వుంటుంది, కళాకారుడైనా, శాస్త్రజ్ఞుడైనా తమతమ ప్రత్యేక అభిరుచులకే అంకితమైపోతారు కానీ, జీవితం యొక్క సంపూర్ణత్వాన్ని అర్ధం చేసుకొనుటకుగాను, స్థిరమైన, తీవ్రమైన గాఢాభినివేశాన్ని కలిగుండడం మాత్రం వారికెంతో కష్టమైన విషయంలాగా కనిపిస్తుంది జీవించుట, ప్రేమించుట, మరణించుట వీటిని పూర్తిగా అర్ధంచేసుకోడంలో ఏమేమి ఇమిడి ఉన్నవో తరచి చూడాలంటే, మేధాపరమైన సమర్ధత, తీవ్ర భావనలేకాక వీటిని మించినగొప్ప శక్తివుండాలి, దానిని గాఢాభినివేశం మాత్రమే యివ్వగలదు మనముందు ఉన్న ఈసమస్య, బ్రహ్మాండమైనది, సంక్లిష్టమైనది, సూక్ష్మమైనది, చాలలోతైనది కనుక, మనం దీనిపై పూర్తిసావధానతతో ఉండాలి–అదే గాఢాభిని వేశమంటే–మన ప్రస్తుత జీవితవిధానానికి, పూర్తిగా భిన్నంగా ఉండే జీవిత విధానమేదైనా వుంటే, దానిని మనంతట మనమే చూసి, కనుగొనాలంటే మనకీ గాఢాభినివేశం తప్పకుండా వుండాలి దీనిని అర్ధం చేసుకొనుటకు, మనమెన్నో విషయాలను, తరచి చూడవలసివున్నది, మొత్తం చేతనా ప్రక్రియని–మనిషి మనసుకి ఉపరితలంలో ఉన్నదానిని, లోలోపలిపొరల్లో ఉన్నదానిని రెంటినీ పరీక్షిస్తూ విచారణ చేయాలి అలాగే, క్రమత యొక్క స్వరూపాన్ని బాహ్యంలో, సమాజంలోనే కాక మనలోని క్రమతను కూడ చూడాలి

జీవితం అంటే అర్ధమేమిటో కనుక్కోవాలి, కేవలం దానికి మేధాపరమైన ఓ గుర్తింపు నివ్వడమేకాక, జీవించుటకు గల అర్ధమేమిటి అనేదికూడ చూడాలి అలాగే 'ప్రేమ' అంటే ఏమిటో, మరణించుట అంటే ఏమిటో తరచి చూడవలసి వున్నది ఇదంతా వ్యక్తచేతనలోను మనిషి మనసులోతుల్లోనూ, అజ్ఞాతకోణాల్లోనూ పరీక్షించవలసి వున్నది క్రమత అంటే ఏమిటి, జీవించుటకు గల నిజమైన అర్ధమేమిటి అని, ప్రశ్నించుకోవాలి,

సంపూర్ణమైన, ప్రేమ, కరుణ, మమత, మార్దవాలతో నిండిన జీవితాన్ని మనిషి జీవించగలడా అని ప్రశ్నించుకోవాలి మరణమనే పేరుతో పిలువబడుతున్న, ఆ అత్యంత అసాధారణమైన విషయాన్ని కూడ తనంతటతానే కనుక్కోవాలి కానీ, నిత్యం ఆఫీసుకి వెళ్ళడం, ఆగ్రహించడం, ద్వేషించడం ధిక్కరించడం, శత్రుత్వం-వీటినే మనం దైనందిన జీవితంగా భావిస్తాం, పైగా, ఇదొక గొప్ప సకారాత్మక జీవితంగా పరిగణిస్తాం

సకారాత్మక మని పరిగణించేదానిని మనం తిరస్కరిస్తే, అది నిజమైన సకారాత్మక మౌతుంది అవతలి జీవితం ఎలా వుంటుందో తెలియక ముందే, ప్రస్తుతజీవిత విధానాన్నీ-అందులోని వికారాన్నీ, ఒంటరితనం, భయం, క్రౌర్యం, హింసలనీ-తిరస్కరించడమే, శ్రేష్ఠమైన సకారాత్మకచర్య మనం పరస్పరం అర్థంచేసుకుంటున్నామా? సంప్రదాయబద్ధమైన నీతిని కాదనడమే అత్యున్నతమైన నీతితో జీవిస్తున్నట్లనేది మీకు తెలుసా? కారణమేమంటే, సంఘనీతిగా మనం భావిస్తున్నది, మర్యాదస్థుల వలె బ్రతుకుతున్న వారి నీతి, అది పూర్తిగా నీతిబాహ్యమైనది, పోటీ - స్పర్ధలతో, ఈర్ష్య,దురాశలతో, స్వవిషయం తప్ప మరేదీ పట్టించుకోక పోవటం - మనం ప్రదర్శిస్తుండే ఈ లక్షణాలన్నీ మీకు తెలిసినవేకదా! వీటినే మనం సమాజనీతి అంటున్నాం, మతవాదులు మరోరకమైన నీతిని గురించి ప్రస్తావిస్తుంటారు, కానీ, వారి జీవితం, వారి మొత్తం దృక్పథం, అధికార వ్యత్యాసాలతో కూడిన ఆ మతవ్యవస్థ, ఆవిశ్వాసాలు, అనైతికమైనవి దానిని నిరాకరించడం ప్రతిక్రియగా కాదు ప్రతిక్రియ అనేది మనిషిలో ప్రతిఘటించాలనే వ్యతిరేకభావం వల్ల విభేదించే మరో రూపం మీరు దానిని అర్థంచేసుకున్న కారణంగా, తిరస్కరించినపుడు అక్కడ అత్యుత్తమరూపంలో నీతి నెలకొంటుంది

అదే విధంగా, సంఘనీతిని నిరాకరించటానికి, మన ప్రస్తుతజీవిత విధానాన్ని నిరాకరించటానికి-అల్పమైన మనజీవితాలు, లోతులేని ఆలోచనలు, కూడబెట్టుకున్న వాటితో మనం పడే సంతృప్తి, ఈరకపు బ్రతుకుని-తిరస్కరించడం ఓ ప్రతిక్రియ ద్వారా కాకుండా, ఈ జీవిత విధానంలోని తెలివి తక్కువనీ, విధ్వంసకర ధోరణినీ చూచి-ఆమొత్తాన్ని తిరస్కరించడమే జీవించడమంటే, అసత్యాన్ని అసత్యంగా చూడడం-ఇలాంటి చూపే నిజమైనది

ఇక, ప్రేమ అంటే ఏమిటి? ప్రేమ సుఖమా? ప్రేమ కోరికా? ప్రేమ అనుబంధమా? ఆధారపడటమా, మీరు ఎవరినైతే ప్రేమిస్తున్నారో, వారిని స్వంతం చేసుకోవడమా? 'ఇది నాది, నీది కాదు, నా ఆస్తి, లైంగిక పరమైన నా హక్కు, అని ప్రేమ అంటుందా, అందులో అసూయ, ఆగ్రహం, హింసలు యిమిడి ఉన్నవని సూచించడమా? అంతేకాకుండా, మత పరమైన నిబద్ధీకరణలో భాగంగా ప్రేమను, పవిత్ర ప్రేమఅనీ, అపవిత్ర ప్రేమ అనీ విభజిస్తారు, అదంతా ప్రేమ అవుతుందా? ప్రేమిస్తున్నట్లయితే మీరు ఆకాంక్షాపరత్వంతో ఉండగలరా? మీరు మీ భర్తను ప్రేమించగలరా, ఆకాంక్షలతో నిండిన మనసుతో, అతడు మిమ్మల్ని ప్రేమిస్తున్నానని చెప్పగలడా? ఎప్పుడూ పోటీ పడుతూ, సదా విజయాలనే కాంక్షించే వారిలో 'ప్రేమ' ఉండగలదా?

ఆ మొత్తాన్ని తిరస్కరించడం, కేవలం మేధాపరంగా, వాగ్రూపకంగా కాకుండా, మీసత్తాలో నుంచే తొలగిస్తేను, ఇక ఎప్పటికీ, ఈర్ష్య, అసూయ, పోటీతత్వం, ఆకాంక్షల్ని దరిచేరనివ్వకుండా తిరస్కరిస్తేను – అలా ఆమొత్తాన్ని తిరస్కరించినపుడు – నిశ్చయంగా అది ప్రేమ అవుతుంది ఈ రెండు రకాల వ్యవహారం ఏనాటికీ కలవదు అసూయాపరుడైన పురుషునికిగానీ, అధికారం చెలాయించాలనుకున్న స్త్రీకిగానీ, ప్రేమ అంటే ఏమిటో తెలియదు – వారు దానిని గురించి మాట్లాడవచ్చు, కలిసి కాపురం చేసి వుండవచ్చు, ఒకరినొకరు స్వంతం చేసుకోవచ్చు, సౌఖ్యంకోసం, భద్రతకోసం, ఒంటరితనమనే భయంలేకుండా ఉండటం కోసం పరస్పరం ఆధారపడుతుండవచ్చు,. కానీ అది ప్రేమకాదు అనేది నిశ్చయం మేము, మా పిల్లల్ని ప్రేమిస్తున్నామని చెప్పేవారు, ఆ మాటని మనః స్ఫూర్తిగా అంటున్నట్లయితే, యుద్ధమనేది ఉంటుందా? జాతుల మధ్య విభజనలు వుంటాయా – విడిపోవటాలుంటాయా? మనం 'ప్రేమ' అని దేనిని పరిగణిస్తున్నామో, అది ఒక చిత్రహింస, నైరాశ్యం, అపరాధభావం ఈ 'ప్రేమ'ను సాధారణంగా శృంగార సౌఖ్యమని తలుస్తారు మేము ఏదో కఠోరనైతికవాదాన్ని కానీ, నైతిక ఛాందసాన్నిగానీ సమర్థిస్తూ మాట్లాడడంలేదు, మనిషికి సుఖముండరాదని అనడంలేదు.

మీరు ఒక మేఘాన్నిగానీ, ఆ నీలి ఆకాశాన్నికానీ, ఓ సుందర వదనాన్ని కానీ చూసినపుడు ఆనందం కలుగుతుంది. మీరో పుష్పాన్ని చూసినపుడు, దాని అందం దానికి వుంటుంది అంతే, – అందాన్ని మేము తిరస్కరించడంలేదు ఆలోచన ద్వారా కలిగే సుఖం అందం కాదు, కానీ, అందం సుఖమనిపించేటట్లు చేస్తున్నది ఈ ఆలోచనే

అదే విధంగా, మనం ప్రేమించినపుడు, అందులో శృంగారం కలిస్తే, దానిని సుఖం అంటుంది ఆలోచన, కలిగిన ఆ సుఖానుభూతిని మనోచిత్రంగా రూపొందించి, రేపు అది పునరావృతమవాలని ఆశిస్తుంటుంది ఆ చర్య పునరావృతమవడంలో సుఖం ఉండవచ్చు కానీ, అందులో సౌందర్యం ఉండదు సౌందర్యంలో కానీ, మృదుత్వంలో కానీ, ప్రేమకిగల సంపూర్ణార్థంలో కానీ శృంగారాన్ని మినహాయించడం లేదు కానీ, యిపుడు దేనినైనా అనుమతించే నేటి ప్రపంచం, ఉన్నట్లుండి, శృంగారక్రియను క్రొత్తగా కనిపెట్టినట్లు కనిపిస్తుంది, దానితో, అది అత్యంత ప్రాధాన్యతను సంతరించుకుంది బహుశ, మనిషికి ఇపుడు అదొకటే పలాయన మార్గమైనట్లున్నది, అందులోనే స్వేచ్ఛ లభిస్తున్నట్లున్నది

మిగతా న్ని చోట్ల, ఒత్తిళ్ళకు, వేధింపులకు గురైనందువల్ల, మేధాపరంగా, భావపరంగా హింసించబడి, వైఫల్యాలు చెంది బానిసవలె అయిపోయిన మనిషికి, ఈ శృంగారానుభూతిలో మాత్రమే స్వేచ్ఛ లభిస్తూవుండి వుండవచ్చు ఆ స్వేచ్ఛలో అతనికి ఓ ప్రత్యేకానుభూతి లభించి, అదే అనుభూతిని మరల మరల కోరుతుంటాడు దీనినంతా గమనించినపుడు ఇక ప్రేమకు స్థానం ఎక్కడ? ప్రేమతో నిండిన మనసు, హృదయం కలవారే, జీవితం యొక్క పరిపూర్ణత్వాన్ని వీక్షించగలరు అటువంటి మనిషి ఏమిచేసినా, అది నీతివంతము, హితకరము, అతడేది చేసినా అది సుందరమే

మన జీవితం ఇంత గందరగోళంగా, క్రమరహితంగా ఉన్నదని తెలిసినపుడు – ఈ మొత్తంలోకి క్రమత ఎక్కడి నుంచి రావాలి? మనందరికీ క్రమత కావాలి, ఇంట్లో ఎక్కడి వస్తువులక్కడ సర్దిపెట్టినట్లే – ఇంట్లోనే కాక, బాహ్యంలో, సమాజంలో తీవ్రమైన సాంఘిక అన్యాయాలు జరుగుతున్న చోట్ల కూడ క్రమత ఉండాలంటాము మనసులో కూడ క్రమం ఉండాలంటాము – గణితశాస్త్రంలోని క్రమం, ఎంత ఖచ్చితంగా ఉంటుందో, అంతక్రమం కావాలంటాం క్రమబద్ధంగా ఉన్నదని మనం పరిగణించే ఒక విధానాన్ని అనుసరించి ఈ క్రమతను తీసుకురాగలమా? అలాంటపుడు ఆ నమూనాని, ఈ వాస్తవంతో పోల్చవలసి వస్తుంది, అపుడు ఘర్షణ అనివార్యం ఈ సంఘర్షణే క్రమరాహిత్యం కాదా? – అందువల్ల అది ధర్మం, కానేకాదు. మనసు కనుక గుణవంతము, శీలవంతము, నీతివంతముగా అవడానికి ప్రయాసపడవలసి వస్తే, అది ఘర్షిస్తున్నదన్న మాట ఆ ఘర్షణలోనే క్రమం తప్పిపోయింది క్రమత యొక్క సారాంశమే ధర్మం – ఆధునిక ప్రపంచంలో ఆ పదం వాడటం ఎవరికీ అంత యిష్టం ఉండకపోవచ్చు ఆలోచనల్లో వైరుధ్యం ఉన్నపుడు, ధర్మాన్ని నెలకొల్పలేము, జాగృతమైన తెలివితో, మిమ్మల్ని మీరు అర్థం చేసుకుంటూ క్రమరాహిత్యాన్ని విమర్శనాత్మకంగా చూసినపుడే ధర్మం ప్రవేశిస్తుంది. అపుడే అత్యున్నత రూపంలోని సంపూర్ణమైన క్రమం అక్కడ వుంటుంది అదే ధర్మం, ప్రేమ ఉన్నపుడే అది నెలకొంటుంది

ఇక, మరణించుట అనే అంశం ఉంది, దేనినైతే మనం జాగ్రత్తగా దూరంగా, సుదూరంగా నెట్టేస్తుంటామో, అదెలాగూ భవిష్యత్తులో సంభవించనున్నది – ఆ భవిష్యత్తు ఏభై సంవత్సరాల తర్వాతనైనా సంభవం కావచ్చు రేపైనా జరగవచ్చు అంతంకావడమంటే మనకు భయం, భౌతికంగా అంతమవడం, మనం కష్టపడి, స్వంతం చేసుకుని, అనుభవించిన వస్తువుల నుంచి దూరంకావడం – భార్య, భర్త, ఇల్లు, ఇంటిలోని వస్తువులు, చిన్నితోట, పుస్తకాలు, రాసిన కవిత్వం, రాయాలనుకున్నది – ఆ మొత్తాన్ని వదిలిపెట్టి పోడానికి మనకి భయం. కారణమేమంటే, మనమే ఆ వస్తువులం, మనదైన ఆ వర్ణచిత్రం మనమే, మనకే ఆ వయొలిన్ వాయించగల సామర్థ్యమే వుంటే, మనమే ఆ ఫిడేలు మనంతట మనమే ఆ వస్తువులతో తాదాత్మ్యం చెందాము కనుక – అదంతా మనమే, మరేమీ కాదు మీరెపుడైనా ఆ విధంగా ఆలోచించి చూశారా? మీరే ఆ యిల్లు – ఆ తలుపులతో, ఆ పడకగదితో, సంవత్సరాలతరబడి జాగ్రత్తగా పాలీషుచేసి పెట్టుకున్న ఆ వస్తువులు, ఆ సామాను – అవన్నీ మీరే ఆ మొత్తం తొలిగిస్తే, మీలో మిగిలేది ఏమీ లేదు.

దానికే మీరు భయపడుతున్నది – ఏమీ లేకుండా ఉండటం. సుమారు నలభై ఏళ్ళపాటు ఆఫీసులో పనిచేసి, కాలం వెళ్ళబుచ్చిన తర్వాత, ఆ పనులు మానివేయడం, ఏ గుండెజబ్బో వచ్చి మరణించడం – ఇదంతా విచిత్రంగా లేదూ? మీరే ఆ ఆఫీసు, ఆ ఫైళ్ళు, మీరే ఆ మేనేజరు, మీరే ఆ గుమాస్తా, మీ హోదా ఏదైతే నేమీ, అదే మీరు, మీరేమీ కాదు. దైవం గురించి, మంచితనం గురించి, సత్యం గురించి, సమాజం ఎలా ఉండాలి అనే దాని గురించి, మీకెన్నో అభిప్రాయాలు ఉండవచ్చు – అంతే అందులో దుఃఖం ఉన్నది, అదే 'మీరు' అని మీ అంతట మీరే గ్రహించటం గొప్ప దుఃఖం, ఆ విషయాన్ని

గ్రహించకుండా ఉండటమన్నది - అంతకుమించిన దుఃఖం దానిని చూసి, దాని అర్థమేమిటో కనుగొనుటే, మరణించుట

మరణం అనివార్యం. జీవరాశి యావత్తూ అంతంకాక తప్పదు కానీ, మనకు గతాన్ని వదిలిపెట్టాలంటేనే భయం మనమే గతం, మనమే కాలం, దుఃఖం, నైరాశ్యం, అపుడపుడు గోచరించిన సౌందర్యం, వికసించిన మంచితనం లేక హృదిలోన మృదుభావనలు మెదిలినా, అవి స్థిరంగా నిలవకపోవడం మరణాన్ని చూసి భయపడిన మనం, 'నేను మళ్ళీ జన్మిస్తానా' అని అడుగుతుంటాం? - దానర్థం, ఈ ఘర్షణ, ఈ దుఃఖం, ఈ వస్తువులనిలా స్వంతం చేసుకోవటం, కూడబెట్టుకున్న ఈ అనుభవాలు - వీటన్నిటితో ఈ పోరాటాన్నిలా కొనసాగించటమన్న మాట ప్రాగ్దేశాలన్నీ పునర్జన్మని విశ్వసిస్తాయి ఇపుడు మీరు ఏ స్థితిలో ఉన్నారో, అదే విధంగా జన్మించాలనుకుంటారు, కానీ, ఈ అవస్థ, ఈ గందరగోళం, ఈ అపక్రమం అంతామీరే, పునర్జన్మ అంటే, మనం - మరోసారి జన్మనెత్తుతామన్న మాట, అందువల్ల, ఇప్పుడు ఈనాడు, మీరేం చేస్తున్నారనేది, ఎంతో ముఖ్యం, కానీ పై సారి జన్మించినపుడు - మరోజన్మ అనేది ఉంటేనూ - అపుడు మీరేం చేయబోతున్నారన్నది ముఖ్యం కాదు మీకు మరో జన్మ ఉండేటట్లయితే, ఈనాడు మీరెలా జీవిస్తున్నారనేదే ప్రధానం కారణమేమంటే, సౌందర్యానికిగానీ, దుఃఖానికిగానీ విత్తనాలు నాటేది ఈ రోజే కానీ, పునర్జన్మలో తీవ్రవిశ్వాసం ఉన్నవాళ్ళకి ఎలా ప్రవర్తించాలో వారికి తెలియడంలేదు, ఈనాటి ప్రవర్తనను గురించిన శ్రద్ధ వారికి వుంటే, రేపటిని గురించిన చింత వారికి ఉండనక్కరలేదు, దానికి కారణం, ఈనాటి సావధానతలోనే మంచితనం ఉన్నది

మరణించడం జీవితంలో భాగమే మరణించకుండా మీరు జీవించజాలరు, ప్రేమ కాని ప్రతిఒక్కదాని ఎడల మరణించాలి, మీ వాంఛలకు ప్రతిరూప చిత్రణలైన ఆదర్శాలన్నింటికి మరణించాలి; గతానికి మరణించాలి అనుభవానికి మరణించాలి అపుడే ప్రేమ అంటే ఏమిటో, జీవించడమంటే ఏమిటో మీకు తెలుస్తుంద కనుక, జీవించడం, ప్రేమించడం, మరణించడం - అన్నీ ఒకటే, ఇపుడే పూర్తిగా, సంపూర్తిగా జీవించడంలోనే అది కలిసి ఉంటుంది అపుడే బాధనీ, దుఃఖాన్నీ తోటే తీసుకువచ్చే వైరుధ్యం లేని చర్య జరుగుతుంది అపుడే, జీవించటు, ప్రేమించుట, మరణించుట అనే ఏకైక ప్రక్రియలోనుంచి, చర్య జరుగుతుంది. ఆ చర్యే క్రమత - మనిషి కనుక ఆ విధంగా జీవిస్తే - జీవించాలి - ఎపుడో కొన్ని క్షణాలలో కాదు, ప్రతిరోజు, ప్రతి నిమిషం - అపుడే మనకు సామాజికమైన క్రమత లభిస్తుంది, అపుడే మనిషి తనలో ఐక్యతను సాధిస్తాడు, ప్రభుత్వాలను కంప్యూటర్లే నడిపిస్తాయి స్వీయ ఆకాంక్షలను తీర్చుకునేందుకుగానీ, తమ నిబద్ధీకరణతోగానీ, పరిపాలించే రాజకీయవాదులు పరిపాలించరు అపుడు జీవించడమంటే, ప్రేమించడము, మరణించడమున్నూ

**ప్రశ్న: ఎవరైనా ఇప్పటికిప్పుడు స్వేచ్ఛనొంది, ఘర్షణా రహిత జీవితం గడపగలరా? లేక దానికి కొంతకాలం పడుతుందా?**

**కృష్ణమూర్తి:** గతమనేది లేకుండా, మనిషి యిప్పటికిప్పుడు జీవించగలడా? లేక ఆ 'గతాన్ని' వదిలిపెట్టటానికి కాలం అవసరమా? గతాన్ని వదిలించుకోటానికి సమయం

అవసరమైన పక్షంలో మనిషి యిప్పటికిప్పుడు జీవించటానికి అది ఆటంకమవుతున్నదా? అదీ ప్రశ్న గతమనేదొక చీకటి గుహవంటిది, మీ వద్ద సారా వున్నట్లయితే – దానిని నిల్వ చేసుకునే ఒక భూగృహం లాంటిది ఇలాంటి గతం నుండి విడివడటానికి మీకు కాలం కావాలా? – దేనికైనా కొంతకాలం పడుతుందని అనుకోవటమే మనకలవాటు – కాలవ్యవధి ఉండాలనుకున్నప్పుడు అందులో ఏమేమి యిమిడి ఉన్నవి? నాతో నేనిలా చెప్పుకుంటున్నాను 'మనిషిలో సద్గుణం ఉండాలి గుణవంతుణ్ణవడానికి నేను ప్రతిరోజూ సాధనచేయాలి అలా ఎన్నో రోజులు సాధనచేస్తూ, నేను నాలో శీలగుణాన్ని పెంపొందించుకొవలసి వున్నది,' అలానే నాలోని ద్వేషం, హింసలను కూడ క్రమక్రమంగా, మెల్లెమెల్లగా పోగొట్టుకోవాలి, ఈ విధంగా ఆలోచించడానికే మనమలవాటు పడ్డాము అదే మన నిబద్ధత ఇపుడు మనల్ని మనమిలా ప్రశ్నించుకుంటున్నాం. 'మొత్తం గతాన్ని, ఇదే విధంగా కాలక్రమేణా తోసివేయడం సాధ్యమేనా? – అనగా కాలం అవసరమని మన భావన దానర్థం, నేను హింసాపరుణ్ణై వుండి, 'నేనీ హింసను క్రమక్రమంగా వదులుకుంటానండీ, అని చెప్తుంటాను. 'కాలక్రమేణా', 'అడుగు మీద అడుగు వేసుకుంటూ' అని అనడంలో అర్థమేమిటి? ఈ మధ్యకాలంలో నేను నా హింసాధోరణిని ప్రదర్శిస్తూనే వుంటానన్న మాట ఇలా కాలక్రమంలో 'హింస'ను వర్జిస్తాను అని అనడం, ఓ విధమైన కాపట్యం. నేను హింసాపరుణ్ణే అవుతే, నాలోని హింసను క్రమక్రమంగా వదిలిపెట్టటమనేది సాధ్యం కాదు అనేది తేటతెల్లం, దానిని యిప్పటికిప్పుడే అంతంచేయాలి మానసిక సంబంధమైన విషయాలను తక్షణం అంతంచేయగలనా? నా గతాన్ని నేను క్రమక్రమంగా అంతమొందిస్తానని నేను భావించినట్లయితే, అది సాధ్యం కాదు, కానీ, ఇపుడు నాకెదురుగా వున్న వాస్తవాన్ని, ఉన్నది ఉన్నట్లుగా, ఏ విధమైన వక్రీకరణలేకుండా చూడడమనేదే ప్రధానం నా మనసు ఈర్ష్యాసూయలతో నిండివున్నట్లయితే, ఆ మొత్తాన్నీ, పాక్షిక దృష్టితో కాకుండా, సంపూర్ణ దృష్టితో గమనించాలి నేను నాలోని అసూయను చూస్తాను, – నేనెందుకిలా అసూయపడుతున్నాను? అని నేనెవరిమీదైతే ఆధారపడుతున్నానో, వారు నన్నొదిలి వెళ్ళిపోయారు కాబట్టి, నేను ఒంటరినైపోయాను, నాలో శూన్యం నెలకొన్నది, ఏకాకినై పోయినందువల్ల నాలో భయం కలిగి మీమీద ఆధారపడుతున్నాను మీరు, మీ ధ్యాస మరోవైపుకి మళ్ళిస్తే, నాలో కోపం, అసూయ జనిస్తాయి. అసలు వాస్తవమేమిటంటే 'నేను ఒంటరిని' నాకు తోడుకావాలి, నాకు వంటచేసి పెట్టటానికే కాక, నాకు సౌఖ్యాన్నీ, శృంగార సంతృప్తినీ, మరితరమైన వెన్నో, యివ్వగలవారెవరో ఒకరు నాకు తోడుగా వుండాలి. దేనికంటే మౌలికంగా నేను ఒంటరిని అందువల్లనే నాకా అసూయ, నేనీ ఒంటరితనాన్ని ఈ క్షణానికీ క్షణం అర్థం చేసుకోగలనా? దానినుంచి పారిపోకుండా – దానివంక చూడగలిగివుంటేనూ, మేల్కొన్న తెలివితో కూడిన విమర్శనాత్మక దృష్టితో గమనించగలిగి వుంటేనూ – మరేదో కారణం చెప్పి సమర్థించుకోకుండానూ, ఆ శూన్యాన్ని ఏదో విధంగా నింపాలని ప్రయత్నించకుండానూ, కొత్త తోడుకోసం వెతక్కుండానూ – ఆ ఒంటరితనం వైపే

తిన్నగా గమనించడం మొదలుపెడితే, అపుడు ఆ ఒంటరితనాన్ని నేనర్థం చేసుకోగలను దీనినిలా చూడటానికి స్వేచ్ఛ ఉండాలి నాకు ఆ విధంగా చూడగల స్వేచ్ఛ లభించినప్పుడే నేను ఆ అసూయనుంచి విముక్తి చెందగలను కనుక అసూయను చూసి, దానిని సంపూర్ణంగా గమనించి, తద్వారా దాన్నుండి విడివడటములో కాలప్రసక్తిలేదు సంపూర్ణ సావధానతతో, సవిమర్శనాత్మకమైన ఎఱుకతో, ఎంపికలేని గమనికతో, విషయాలనన్నిటినీ అవి జనిస్తున్న క్షణంలోనే చూడగలగటం అత్యంత ప్రధానం అప్పుడే అసూయ అంటూ పిలువబడే దాని నుండి స్వేచ్ఛ లభిస్తుంది - ఎప్పుడో భవిష్యత్తులో కాదు, ఇప్పటికిప్పుడే, ఈ క్షణమందే

హింస విషయంలోనూ ఇదే వర్తిస్తుంది, ఆగ్రహమైనా, మరే యితర అలవాటైనా - అది ధూమపానం కానీ, మద్యపానం కానీ, శృంగారానికి సంబంధించిన అలవాటులైనా, వాటన్నిటినీ అత్యంత శ్రద్ధ వహించి, సావధానంగా, సంపూర్ణంగా మన మదితో, హృదితో అందులో ఉన్న ఆ మొత్తాన్ని గమనిస్తేనూ, మెలకువ గల్గిన ఎఱుకతో గ్రహిస్తేనూ, అపుడు, అక్కడ లభించేది స్వేచ్ఛ. ఒకసారి ఈ ఎఱుక ప్రవర్తిల్లడం ప్రారంభమైతే, లోనుంచి ఏది ఉత్పన్నమౌతున్నా - అది కోపంకానీ, అసూయకానీ, హింసకానీ, క్రౌర్యంకానీ, ద్వంద్వార్థాలతో కూడినదేదైనా కానీ వైరంకానీ-అన్నీ తక్షణం సంపూర్ణంగా చూడబడుతాయి, గమనించబడుతాయి అందులో స్వేచ్ఛ ఉన్నది, అంతకు ముందక్కడ ఉన్నది ఏదైనా, అది అంతమౌతుంది - కనుక, గతాన్ని కాలగతిలో తుడిచివేయడం అనేది కుదరని పని స్వేచ్ఛ లభించడానికి కాలం మార్గం కాదు కాలక్రమేణా జరుగుతుందనే భావం ఓ విధమైన అలసత్యాన్ని సూచిస్తుంది గతమనేది తలపై కెత్తడంతోటే దానినక్కడికక్కడే సమసిపోయేట్లు చేయలేకపోవటం చేతకానితనమనిపించుకుంటుంది గతమనేది పైకి లేస్తున్నపుడే ఆశ్చర్యం కొలిపే సామర్థ్యంతో దానిని స్పష్టంగా గమనించగలిగినప్పుడు, మీ మనసునీ, హృదయాన్నీ దానికంకితం చేసినప్పుడు ఆ గతం అంతమౌతుంది కనుక, కాలము, ఆలోచన అనేవి గతాన్నంతం చేయవు, కాలము, ఆలోచన అనేవి గతమేనని గుర్తుంచుకోండి

**ప్రశ్న: ఆలోచన అనేది మనసు యొక్క చలనమంటారా? చలనరహితమైన మనసు ప్రవర్తిల్లడమే ఎఱుక అవుతుందా?**

**కృష్ణమూర్తి:** మనం మొన్న చెప్పుకున్నట్లుగా, స్మృతుల నుండి వచ్చే స్పందనే ఆలోచన, జ్ఞప్తి, కంప్యూటరు లాంటిది దానిలోకి మీరనేక రకాల సమాచారాన్ని పంపి నిక్షిప్తం చేస్తున్నారు మీరేదైనా సమాచారమడిగినప్పుడు అది తనలో నిక్షిప్తమై ఉన్నదాని నుండి ప్రత్యుత్తరం ఇస్తుంది ఇదే విధంగా ఈ మనసు, ఈ మెదడులలో మొత్తం గతం అనగా జ్ఞప్తి నిలువచేయబడింది సవాలు నెదుర్కొన్నప్పుడు, తన పూర్వజ్ఞానమూ, పూర్వానుభావమూ, స్వంత నిబద్ధీకరణల కనుగుణంగా అది ఆలోచన రూపంలో స్పందిస్తుంటుంది కనుక, ఆలోచన ఒక గమనం, లేక మనసు, మెదడులలోని కదలికల్లో ఒక భాగం ఎఱుక అనేది నిశ్చలమైన మనసు అయుంటుందా అని ప్రశ్నిస్తున్నారు మీరు ఓ చెట్టునికానీ, మీ భార్యనుకానీ, మీ పొరుగువారినికానీ, రాజకీయవాదినికానీ, మతగురువునికానీ, ఓ సుందరవదనాన్నికానీ

చలనరహితమైన మనసుతో పరిశీలించగలిగివున్నారా? మీ భార్యను గురించీ, భర్తను గురించీ పొరుగింటి వారిని గురించీ మీకేర్పడిన మనోచిత్రాలు - అవన్నీ పరిశీలనలో జోక్యం చేసుకుంటాయి అవునా? కనుక, ఏ రకమైన మనోచిత్రమైనా, సూక్ష్మంగానైనా, స్పష్టంగానైనా, జోక్యం చేసుకున్నదీ అంటే, అది పరిశీలించినట్లుకాదు అక్కడ నిజమైన, సంపూర్ణమైన ఎఱుక ఉండజాలదు - అది పాక్షికమైన ఎఱుక మాత్రమే సుస్పష్టమైన చూపు సిద్ధించవలెనంటే, పరిశీలకుడికీ - పరిశీలించబడేదానికీ మధ్య ఏ మనోచిత్రమూ అడ్డురాకూడదు. ఓ చెట్టుని చూసినపుడు మనసులో వృక్షశాస్త్ర పరిభాషకు చెందిన విజ్ఞానం లేకుండానూ, ఆ చెట్టు ద్వారా కలిగే సుఖమూ, దానిపై గల కోరికల గురించిన జ్ఞానంలేకుండానూ మీరు చూడగలరా? పరిశీలకుడు - పరిశీలించబడే వస్తువుకీ మధ్య ఎడం అదృశ్యమైపోయేంత సంపూర్ణమైన దృష్టితో వీక్షించగలరా? దానర్థం, మీరు చెట్టు అయిపోతారని కాదు సుమండీ! మీ మధ్యనున్న దూరం అదృశ్యమైనపుడు, ఇక పరిశీలించేవాడుండడు, పరిశీలించబడే వస్తువు మాత్రమే మిగులుతుంది అలాంటి పరిశీలనలో దర్శించడం జరుగుతుంది అసాధారణమైన ప్రాణశక్తితో, ఆ రంగూ, రూపులతో, ఆ ఆకు, ఆ కాండం యొక్క అందచందాలతో విలసిల్లే ఆ చెట్టు మాత్రమే కనిపిస్తుంది పరిశీలించేవాడు అయిన 'నేను' కేంద్రంలో లేకపోయిన తర్వాత, మీరు దేనినైతే పరిశీలిస్తున్నారో, దానితో అతిసన్నిహితమైపోతారు

ఆలోచనాగతి అనేది ఒకటి ఉన్నది, అది మెదడు, మనసులలో భాగం సవాలు ఎదురైన సమయంలో ఆలోచనే సమాధానం యివ్వవలసి వున్నది కానీ, నూతనమైన దానిని, మున్నెన్నడూ చూడబడనటువంటి దానిని, చూచి, కనుగొనవలసి వచ్చినపుడు, చలనరహితమైన, తీక్ష్ణమైన సావధానత ఉండాలి ఇదేదో నిగూఢమైనదీ, (Occult) లేక దురవగాహ్యామైనదీ, అనుకోవద్దు, అదంతా అవివేకం, రెండు ఆలోచనల మధ్య మీరు గమనిస్తూ ఉన్నట్లయితే అది సంభవిస్తూనే వుంటుంది

'జెట్ విమానాన్ని' కదల్చటం మనిషెలా కనిపెట్టాడో మీకు తెలుసా? ఎట్లా జరిగింది? 'కంబశ్చన్ ఇంజన్ని' గురించి తెలుసుకోవలసిందంతా తెలుసుకున్న తర్వాత వేరొక విధానం కోసం వెతకనారంభించాడు దేనినైనా కొత్తగా చూడదల్చుకుంటే, మీరు నిశ్శబ్దంగా ఉండితీరాలి 'కంబశ్చన్ యింజన్', గురించిన విజ్ఞానం మీ మనసులో మెదలుతుంటే, మీరింతకు ముందు నేర్చినదే కనిపిస్తుంది. పూర్వం నేర్చుకున్నదంతా మనసులో, కదలిక లేకుండా, నిశ్శబ్దంగా వుండిపోయినపుడే - మీరు నూతనమైన విషయాన్ని కనుగొనగలరు ఇదే మాదిరిగా, మీ భార్యను, మీ భర్తను కానీ, ఆ చెట్టును, ఆ పొరుగువారిని, క్రమత లోపించిన ఆ మొత్తం సాంఘిక వ్యవస్థను కానీ నిశ్శబ్దంతో, ఓ నూతన విధానంలో చూడడం కనుగొనాలి, దానిని బట్టే నూతన జీవిత విధానాన్ని, తదనుగుణమైన చర్యను కనుగొనడం జరుగుతుంది

**ప్రశ్న: సిద్ధాంతాలుగానీ, ఆదర్శాలుగానీ లేకుండా జీవించగల బలం మాకెలా లభిస్తుంది?**

**కృష్ణమూర్తి:** అవన్నీ కలిగుండి కూడ, జీవించే శక్తి మీకెలా లభ్యమైంది? ఆ సూత్రాలు, ఆ ఆదర్శాలు, ఆ సిద్ధాంతాలు వున్నప్పటికీ జీవించగల అసాధారణమైన శక్తి మీకెలా

లభించింది? మీరు సూత్రబద్ధంగా జీవిస్తున్నారు – అయినా మీకాశక్తి ఎలావచ్చింది? ఈ శక్తే ఘర్షణల్లో వృధా అయిపోతున్నది ఆదర్శం అల్లంత దూరంలో ఉండగా, మీరిక్కడ ఉంటున్నారు

ఆ ఆదర్శాని కనుగుణంగా జీవించడానికి యత్నిస్తున్నారు ఆ కారణం చేతనే విభజన, ఘర్షణ సంభవించటం జరుగుతున్నది – అదే శక్తి వృధా అవటమన్న మాట శక్తి వృధా అవుతున్నదని చూసినప్పుడు, సతతమూ ఘర్షణలను రేకెత్తిస్తున్న ఈ ఆదర్శాలు, సూత్రాలు, సిద్ధాంతాలు కలిగివుండటంలోని అసంబద్ధతను చూచినపుడు – అవి లేకుండా జీవించగల శక్తి మీకు ఉంటుంది ఇక ఘర్షణల వల్ల శక్తి నష్టమైపోవడం వుండదు కాబట్టి, మీకు పుష్కలంగా శక్తి లభిస్తుంది మనం నిబద్ధీకరించబడి వున్నాము కాబట్టి, ఆ విధంగా జీవించడానికి మనకు భయం మిగతా అందరిలాగే, మనం కూడ సూత్రాలు, ఆదర్శాలతో కూడిన ఈ చట్రాన్ని సమ్మతించాము మనం వాటితోనే జీవిస్తాము ఘర్షణను జీవిత విధానంలో భాగంగా అంగీకరించాము కానీ ఇదంతా – వాగ్రూపకంగానూ, సిద్ధాంతపరంగానూ, మేధాపరంగానూ కాకుండా – మన మొత్తం ఉనికితో ఈ విధమైన జీవిత విధానంలోని అసంబద్ధతను చూచి గ్రహిస్తే, ఇక ఘర్షణ అనేది ఏ రూపంలోనూ వుండదు, ఘర్షణ లేదు బట్టి మనలో శక్తి పుష్కలంగా వుంటుంది అప్పుడిక వాస్తవం తప్ప మరేదీ ఉండదు మీరు అత్యాశాపరులనేదే వాస్తవం, మీలో 'అత్యాశ ఉండకూడదు' అనే ఆదర్శం వాస్తవంకాదు – అది శక్తిని వృధాపర్చుకోవడమే – కానీ మీలోని అత్యాశ, స్వంతం చేసుకోవాలనే తత్వం, ఆధిపత్యం వహించాలనే కాంక్ష – ఇదంతా వాస్తవం ఉన్నది వాస్తవ మొక్కటే, ఆ వాస్తవం పై మీ మొత్తం శ్రద్ధనంతా నిలిపినప్పుడు దానిని చెదరగొట్టగల శక్తి మీకు కలుగుతుంది, అందువల్ల మీరిక ఏ ఆదర్శంతోను, ఏ సిద్ధాంతంతోను, ఏ నమ్మకంతోను నిమిత్తం లేకుండా స్వేచ్ఛగా జీవించగలరు అదే మొత్తం గతానికీ మరణించడం, అదే ప్రేమించడము

*ఏమ్‌స్టర్‌డామ్, మే 11, 1969*

# 7. భయము

## ప్రతిఘటన; శక్తి - సావధానత

మనలో చాలా మందిమి అలవాట్లలో చిక్కుకుపోయాము - అవి దైహిక సంబంధం అవ్వచ్చు, మానసిక సంబంధమూ కావచ్చు కొందరికి వాటిని గురించిన స్పృహ ఉంటున్నది కానీ, తదితరుల కసలు తెలియడమే లేదు. గమనించిన వారైనా తమకు అలవడిన ఆ అలవాటునలా నెలల తరబడి, సంవత్సరాల తరబడి కొనసాగించకుండా తక్షణం మానివేయగలిగివున్నారా? ఫలానా అలవాటు తమకు ఉన్నదనే విషయం గ్రహించగానే, ఏ విధమైన ప్రతిఘటనా లేకుండా ఉన్నపళంగా దానికి స్వస్తి చెప్పటం సాధ్యమేనా? - ధూమపానంకానీ, తలనొక రకంగా ఎగరవేయడంకానీ, అలవాటుగా మారిన మందహాసంగానీ, ఇలాంటి చిత్ర విచిత్రమైన అలవాట్లలో ఏ ఒక్కదానినైనా అప్పటికప్పుడు అంతంచేయగలమా? నిలకడలేని మనసు, విషయంలో విశేషమేమీ లేకపోయినా, ఆ విషయాన్ని గురించి అనంతంగా మాట్లాడుతున్నానని, తాను గ్రహించినదే తడవుగా - దానిని ప్రతిఘటించకుండా, అదిమిపెట్టకుండా, అప్రయత్నంగా ఆ అలవాటుని సులభంగా అంతం చేయగలదా? ఇందులో చాలా విషయాలు యిమిడి ఉన్నాయి మొదటిది ఏ విషయం మీదనైనా పోరుసల్పితే - అది ఒక ప్రత్యేకమైన అలవాటుమీదనైనా సరే, అది ఆ అలవాటు పైన జరిగే ప్రతిఘటనగా రూపొందుతుందని అర్థం చేసుకోవాలి ప్రతిఘటన అనేది ఏ రూపంలో ఉన్నా, అది ఘర్షణను పెంచేస్తుందని తెలుసుకోవాలి ఎవరైనా ఏ అలవాటునైనా ప్రతిఘటించినా, అణిచిపెట్టే ప్రయత్నం చేసినా, దానిపై పోరుసల్పినా ఏ శక్తి అయితే ఆ అలవాటుని అర్థంచేసుకొనటానికి అవసరమో, అది ఈ పోరులోను, అణిచివేతలోనూ వ్యర్థమైపోతున్నది ఇందులో యిమిడి ఉన్న రెండవ అంశం, తమకు అలవడిన ఆ ప్రత్యేకమైన అలవాటు నెమ్మదిగానే సమసిపోవాలనీ, మెల్ల మెల్లగానే దానిని అణిచిపెడుతూ వదిలించుకోవాలనీ, దానికై కొంత సమయం అవసరమనే అభిప్రాయం అందిరిలోనూ అంతటాకనిపిస్తుంది

ఏ అలవాటునుంచైనా బయటపడాలంటే, దానిని ప్రతిఘటించడమో, లేక తద్వ్యతిరేకమైన అలవాటుని పెంపొందించుకొనటమో చేయక తప్పదనే అభిప్రాయం మనకి ఒకవంక ఉండగా, మరొక వంక కాలంగడిచే కొద్దీ క్రమేపీ మనం దాని నుండి బయటపడగలమనే అభిప్రాయమూ ఉన్నది కానీ దీనిని నిజంగా పరీక్షించి చూచినట్లయితే, ప్రతిఘటన అనేది ఏ రూపంలో ఉన్నా అది మరిన్ని ఘర్షణలకే దారితీస్తుందనీ, అలాగే కాలం విషయంలో కూడ రోజులు, వారాలు, సంవత్సరాలు

గడిచిపోతున్నా ఆ అలవాటు నిజంగా అంతమవదనే విషయం ఎవరైనా గ్రహించవచ్చు ప్రతిఘటనతో కానీ, కాలంతోకానీ నిమిత్తం లేకుండా ఏ అలవాటునైనా తక్షణం అంతంచేయడం సాధ్యమా అని మేమడుగుతున్నాము

భయ విముక్తికి కావలసినది, దానిని ప్రతిఘటిస్తూ కాలం వెచ్చించటం కాదు, ఆ అలవాటుని అప్పటికప్పుడే ఢీకొని నిర్మూలించగల శక్తి కావాలి, అదే సావధానత శక్తిలో వున్న అసలు సారాంశం సావధానతే మనిషి సావధానుడై ఉండాలంటే, అతను తన మదిని, హృదిని, దైహిక శక్తినీ వినియోగించి, ఆ ప్రత్యేకమైన అలవాటుని గురించిన పూర్తి ఎఱుకతో, ఎదుర్కొనగలగాలి అప్పుడిక ఆ అలవాటుకి మీపైన ఉండే పట్టు సడలిపోతుంది – తక్షణం అది అదృశ్యమైపోతుంది

మనుష్యుల్లో కనిపించే ఈ రకరకాల అలవాట్లను ఇంతగా పట్టించుకొనవలసిన దేముంది అని ఎవరైనా అనుకోవచ్చు – ఉంటే ఉంటాయి, అదేమంత ముఖ్యమైన విషయం కాదనీ భావించవచ్చు, లేక వాటిని ఏదో విధంగా సమర్థించుకోవచ్చు కానీ మనిషి మనసులో కనుక ఈ సావధానతా లక్షణాన్ని సుస్థిరంగా నెలకొల్పుకో గలిగితే, మనసు ఆ వాస్తవాన్ని ఆ సత్యాన్ని పట్టుకుంటే, ఆ శక్తే సావధానత అవుతుంది ఏ అలవాటునైనా కరిగించివేయడానికి ఈ సావధానతే అవసరమనీ, ప్రత్యేకమైన ఏ అలవాటునైనా లేక సంప్రదాయాన్నైనా కూడ 'అది వున్నది' అనే ఎరుక కలగగానే అది దానిని పూర్తిగా అంతం చేసి వేస్తుందనే విషయాన్ని మీరే గ్రహిస్తారు

మనిషి మాట్లాడేటపుడు అతని పద్ధతేదో అతనికి ఉంటుంది నిస్సారమైన విషయం గురించి కూడ అంతులేకుండా మాట్లాడే వారూ వుంటారు సంపూర్ణ సావధానతలో ఉన్న మనిషికి అసాధారణమైన శక్తి లభిస్తుంది ఆ శక్తి మిగతాశక్తులవలె ప్రతిఘటన ద్వారా లభ్యమయే శక్తివంటిది కాదు సావధానతతో కూడిన ఈ శక్తే స్వేచ్ఛ ఈ విషయాన్ని కనుక, మనిషి నిజంగా లోతుల్లోకి చూసి అర్థం చేసుకుంటే, సిద్ధాంతపరంగా కాక, ప్రయోగం చేసి, స్వానుభవంలో చూసిన వాస్తవంగా గ్రహిస్తే ఆ వాస్తవాన్ని చూసి, దానిని గురించిన పూర్తి ఎరుకతో వుంటే, అప్పుడు మనం భయం యొక్క సంపూర్ణ స్వరూప స్వభావాలను తఱచి చూడటానికి ముందుకుసాగుతాం సంక్లిష్టమైన ఈ అంశాన్ని గురించి ప్రస్తావించుకునేటపుడు వక్తకూ – మీకూ మధ్య వాగ్రూపకమైన భావప్రసారం కొంచెం కష్టంగా ఉండవచ్చుననే విషయం గుర్తుంచుకోండి మీరు తగినంత శ్రద్ధా – సావధానతలతో విననట్లయితే, మన మధ్య భావప్రసారం సాధ్యంకాక పోవచ్చు మీరేదో విషయం గురించి ఆలోచిస్తుంటేనూ, వక్త మరేదో విషయాన్ని వివరిస్తుంటేనూ, మన మధ్య సంధానం దాదాపు లేనట్లేనని భావించవచ్చు మీరు మీ స్వంత భయం గురించే తలపోస్తుంటేనూ, మీ ప్రత్యేక భయం పైననే మీ మనసుని లగ్నం చేస్తేనూ, మీకూ – వక్తకూ మధ్య వాగ్రూపకమైన సంధానం కూడా అంతమైపోయినట్లే ఒకరు మరొకరితో సంభాషిస్తున్నపుడు, అక్కడ ఒక రకమైన సావధానత నెలకొనాలి అందులో శ్రద్ధ, జాగరూకత, సునిశితత్వం, భయమనే అంశాన్ని అర్థం చేసుకోవడం అత్యవసరం – అవన్నీ మిళితమవాలి

భావప్రసారంకన్నా అత్యంత ప్రధానమైనది అనుసంధానం భావప్రసారం పదాలతో కూడినది అనుసంధానంలో పదాలు ఉండవు సుపరిచుతులైన ఇద్దరు వ్యక్తులు మాటలతో నిమిత్తం లేకుండానే ఒకరినొకరు సంపూర్తిగా తక్షణం అర్థం చేసుకోగలిగివుంటారు అప్పటికే వారు తమ మధ్య ఒక రకమైన భావప్రసారాన్ని ఏర్పర్చుకున్నారన్న మాట భయమనే సంక్లిష్టమైన అంశాన్ని మనం చర్చించబోతున్నందున మన మధ్య పదముల ద్వారా జరిగే సంధానంతోపాటు పదాలతో నిమిత్తంలేని హృదయావగాహన కూడ ఉండాలి ఆ రెండూ ఎప్పుడూ కలిసి ప్రవర్తిల్లాలి. లేని పక్షంలో, మనం కలిసి పనిచేయడం లేదనే అనుకోవాలి ఇదంతా చెప్పిన తర్వాత – ఇది చెప్పవలసిన ఆవశ్యకత ఉన్నది ఇంక మనం భయమనే అంశాన్ని విచారణ చేద్దాం

మీరు భయము నుంచి విడివడి తీరాలీ అనడం లేదు మీరు కనుక భయవిముక్తికై ప్రయత్నించినట్లయితే, ప్రయత్నం ఆరంభించిన క్షణమందే మీరు దానిపై ప్రతిఘటనను సృష్టిస్తున్నారన్న మాట ప్రతిఘటన అనేది ఏ రూపంలో ఉన్నా, అది భయాన్ని అంతంచేయదు – భయాన్నుంచి తప్పించుకునే ప్రయత్నం చేసినా, ప్రతిఘటించినా, అణిచిపెట్టినా, దాని నుంచి పరుగిడి పారిపోయినా, ఏమిచేసినా, అది ఎప్పుడూ అక్కడే వుంటుంది పరుగెత్తడం, అణిచిపెట్టడం, అదుపులో పెట్టడం – అనేవన్నీ ప్రతిఘటనకు మారురూపాలే ప్రతిఘటించే నిమిత్తం మీరు మీ బలాన్ని పెంచుకున్నా అది కొనసాగుతూనే వుంటుంది కనుక, మనం భయవిముక్తిని గురించి మాట్లాడటం లేదు దేనినుంచైనా స్వేచ్ఛనొందటమనేది స్వేచ్ఛ అనిపించుకోదు దయచేసి దీనిని అర్థం చేసుకోండి ఈ అంశాన్ని తఱచి చూస్తున్న ఈ సమయంలో, చెప్పబడుతున్న విషయంపైన మీరు మీ శ్రద్ధను యావత్తూ ఉంచి వినినట్లయితే, భయంయొక్క నీడలులేని మనసులతో మీరు ఈ హాలు నుంచి నిష్క్రమించగలరు అదొక్కటే ముఖ్యం ఈ వక్త ఏమిచెప్పారు, ఏమి చెప్పలేదు, దానిని మీరు అంగీకరిస్తున్నారా, లేక అంగీకరించటం లేదా అనేవేవీ ముఖ్యం కాదు మనిషి సంపూర్తిగా, తన మూలసత్తాలో, మానసికంగా భయాన్ని అంతం చేయడమే ముఖ్యం.

కనుక, భయవిముక్తుణ్ణవాలి, లేక ఆ భయాన్ని ప్రతిఘటించాలి అనేవి ముఖ్యం కాదు, భయము యొక్క పూర్తి స్వరూప స్వభావాల నాకళింపుచేసుకోవాలి, 'అర్థం చేసుకొనుట' అనగా దాని గురించి నేర్చుకొనుట, గమనించుట, నేరుగా దానివద్దకు చేరి దానిని స్పృశించుట భయమంటే ఏమిటో తెలుసుకోవాలి కానీ దానినుంచి ఎలా తప్పించుకోవాలీ, ధైర్యం పుంజుకుని దానినెలా ప్రతిఘటించాలీ అనే ప్రయత్నాలలో పడరాదు మనం ఉన్నది నేర్చుకొనడానికే 'నేర్చుకొనుట' అనే పదానికున్న అర్థం ఏమిటి? భయమును గురించిన విజ్ఞాన సమీకరణ కాదు అనేది స్పష్టం ఈ విషయాన్ని పూర్తిగా అర్థం చేసుకోకుండా విచారణకు పూనుకోవడమనేది నిష్ప్రయోజనం నేర్చుకొనుట అంటే ఒక విషయాన్ని గురించిన విజ్ఞానాన్నంతా పోగుచేసి, కూడబెట్టుకొనుట అని మన అభిప్రాయం ఇటాలియన్ భాషను నేర్చుకొనాలంటే, ఆ భాషకు సంబంధించిన పదాలను, వాటి అర్థాలను, ఆ భాష యొక్క వ్యాకరణాన్ని దగ్గర పెట్టుకుని, వాక్య నిర్మాణమెలా చేయాలన్నది నేర్వాలి ఆ భాషకు చెందిన విజ్ఞానాన్ని

సేకరించుకున్న తర్వాతనే, మీరా ప్రత్యేక భాషలో మాట్లాడగల్గుతారు అనగా ముందు విజ్ఞానసేకరణ, తర్వాత కార్యాచరణ, అందులో కాలం యిమిడి ఉన్నది అలాంటి విజ్ఞానసేకరణ నేర్చుకొనుట కాదని మేము చెప్తున్నాము నేర్చుకొనుట అనేదెపుడూ చైతన్యంతో కూడిన వర్తమానంలోనే జరుగుతూ వుంటుంది అది కూడబెట్టుకున్న విజ్ఞానం యొక్క ఫలితం కారాదు నేర్చుకొనుట అనేదొక క్రియాకలాపం, అది ఎప్పుడూ వర్తమానంలోనే జరుగుతుంటుంది

మనలో చాలా మందిమి విజ్ఞానాన్ని, సమాచారాన్ని, అనుభవాన్ని ముందుగా సేకరించిపెట్టుకుని, దానినుంచి కర్మనాచరించాలి అనే అభిప్రాయానికి అలవాటుపడ్డాము మేము చెప్తున్నది పూర్తిగా తద్భిన్నమైనది విజ్ఞానమనేదెపుడూ గతానికి సంబంధించినది కాబట్టి, ఈనాటి మీ చర్యను గతమే నిర్ధారిస్తుంటుంది మేము చెప్తున్నదేమంటే, 'నేర్చుకొనుట' అనేది క్రియాచరణతోనే జతకలిసి వున్నది కాబట్టి, అందులో విజ్ఞానరూపంలో నిల్వచేసుకున్నదేమీ వుండదు

భయాన్ని గురించి నేర్చుకోవడమనేది వర్తమానంలోనే వుంటుంది అది తాజాగానే జరగాలి గత విజ్ఞానంతోనూ, గతించిన జ్ఞాపకాలతోనూ, తత్సంబంధిత విషయాలతోనూ భయాన్ని కనుక సమీపిస్తే, నేను ఆ భయాన్ని ముఖాముఖి దర్శించజాలను, అందువల్ల దాని గురించి నేర్చుకోవటమూ జరగదు నా మనసు తాజాగా, వినూత్నంగా ఉన్నప్పుడే నేను నేర్వగలను అదే మనకు వచ్చిన యిబ్బంది మనం భయాన్నెపుడూ తత్సంబంధిత విషయాలతోనూ, జ్ఞాపకాలతోనూ, సంఘటనలతోనూ, అనుభవాలతోనూ సమీపిస్తాం. కనుకనే అవన్నీ భయాన్ని సరికొత్తగా దర్శించడంలో, దానిని కొత్తగా నేర్చుకోవడంలో మనల్ని ఆటంకపరుస్తాయి

భయాలెన్నో – మరణభయం, చీకటిభయం, ఉద్యోగం ఊడిపోతుందేమోనన్న భయం, భర్తను చూసి లేక భార్యను చూసి భయం, అభద్రతాభావం, కృతకృత్యులం కాలేమేమోనన్న భయం, ప్రేమను పొందలేమోనని భయం, ఒంటరితనపు భయం, జీవితంలో సఫలురం కాలేమోనని భయం ఈ నానారకాల భయాలు ఒక్క మూలభయం నుండే కదా వ్యక్తీకరింపబడుతున్నవి? ఇప్పుడు మనం ఏదో ఒక ప్రత్యేక భయం గురించి ప్రస్తావిస్తున్నామా లేక భయస్వభావాన్ని గురించి విచారణ చేస్తున్నామా అనేది ప్రశ్న

మనం భయస్వభావాన్ని అర్థం చేసుకొనుటకు ప్రయత్నిస్తున్నాం కాని ఏదో ఒక ప్రత్యేక దిశలో ప్రకటితమౌతున్న భయం గురించి కాదు భయం అనే ఆ ప్రధాన అంశాన్ని చూసి, దానితో తలపడగలిగితే దానిని పరిష్కరించగలం, అపుడే ఆ ప్రత్యేక భయాన్ని కూడా, దానితోబాటు పరిష్కరించవచ్చు కనుక మీ స్వంత భయాన్ని ఒక దానిని దృష్టిలో పెట్టుకుని, 'నేను దీనిని పరిష్కరించక తప్పదు' అనవద్దు భయం యొక్క పూర్తి స్వరూప స్వభావాలనర్థం చేసుకుంటే, ఆ ప్రత్యేక భయం విషయంలో కూడ పరిష్కారం చేయగలరు

మనసులో భయమనేది లేశమాత్రం లేకుండా చేయటం ఎంత అవశ్యకమో చూడండి భయం ఉన్నచోట చీకటి అలముకుంటుంది మనసు మొద్దుబారిపోతుంది,

అప్పుడా మనసు వినోదాల ద్వారా ఉత్తేజం పొందటానికీ, పలుమార్గాలలో తప్పించుకోటానికీ చూస్తుంటుంది – వినోదమనేది చర్చిలో లభించినా, ఫుట్‌బాల్ ఆటలో లభించినా, రేడియో వింటున్న సమయంలో పొందినా దానికి ఒకటే భయములో నున్న మనసు విశదంగా చూడలేదు 'ప్రేమ' అంటే ఏమిటో దానికి తెలియదు – సుఖమంటే దానికి తెలియవచ్చునేమో కానీ, ప్రేమ అంటే మాత్రం ఖచ్చితంగా తెలియదు భయమనేది ఆ మనసుని చీకాకుపరచి వికృతంగా చేస్తుంది

భౌతికపరమైన భయం ఒకటైతే, మానసికభయం మరొకటి భౌతికదేహానికి ప్రమాదం వాటిల్లినపుడు, ఉదాహరణకు, ఒక సర్పం ఎదురవడం, కొండ కొసను చేరడం వంటివి సంభవించినపుడు కలిగే భయం భౌతికపరమైనా – అది తెలివికాదా? అక్కడ కొండకొస ఉన్నది – నేను దానిని చూసి, తక్షణం స్పందించి, దాని దరిదాపులకే వెళ్ళను. 'అటువెడితే ప్రమాదకరం, జాగ్రత్తగా ఉండమని' నన్ను హెచ్చరిస్తున్న ఆ భయం తెలివికాదా? ఆ తెలివి కాలగతిలో కూడబెట్టుకున్న విజ్ఞానఫలితం, ఎందరో అక్కడి నుంచి పడిపోయారని నేను విన్నందువల్లకానీ, మా అమ్మో లేక నా మిత్రుడో ఆ కొండకొన వద్ద జాగ్రత్తగా ఉండమని హెచ్చరించినందువల్లగానీ ఏర్పడి ఉండవచ్చు భౌతికపరంగా ప్రకటితమయే ఆ భయంలో జ్ఞప్తీ, తెలివీ ఏకకాలంలో ప్రవర్తిల్లుతున్నవి ఇక, ఇపుడు శారీరిక సంబంధమైన భయాన్ని గురించిపడే మానసిక భయాన్ని చూద్దాం, ఒకప్పుడు వ్యాధిగ్రస్థుడైన వ్యక్తికి, ఆనాడతనుభవించిన అపరిమితమైన బాధ పూర్తిగా దేహానికి సంబంధించినది అది స్మృతిలో ఉన్నది ఇప్పుడు ఆ బాధ వాస్తవం కానప్పటికీ, అది స్మృతిలో ఉన్న కారణంచేత, అది తిరిగి సంభవించటం మనకు ఇష్టంలేదు కానీ తిరిగి రాగలదేమోనని భయపడటమనేది మానసిక భయం అవుతుంది ఈ మానసిక భయాన్నర్థం చేసుకుని ఆ భయమిక మనసులో పుట్టకుండా చేయగలమా? అందరికీ కలిగినట్లే నాకూ ఒక బాధ కలిగింది అనుకుందాం క్రితం వారం కానీ, సంవత్సరం క్రిందట కానీ, భరించనలవికాని ఆ బాధ తిరిగి సంభవించటం నాకిష్టంలేదు కానీ వస్తుందేమోనని భయపడుతుంటాను. ఇక్కడ జరిగిందేమిటి? జాగ్రత్తగా వినండి ఆ బాధను గురించిన స్మృతి నా మనసులో ఉన్నది, ఆలోచన, 'దానిని తిరిగి రానివ్వద్దు, జాగ్రత్తగా ఉండమని చెప్తున్నది గతంలో అనుభవించిన బాధ, దాని గురించి ఆలోచన మదిలో మెదలగానే, అది పునరావృతమౌతుందేమో నన్న భయాన్ని కూడ ఆ ఆలోచనే తెస్తుంది. ఆ వ్యాధి, తత్సంబంధమైన బాధతోపాటు తిరిగి రానున్నదేమోననే ఈ భయం; ఇది ఒక రకమైన భయం

ఆలోచన ద్వారానే అన్ని రకాల మానసిక భయాలు ఉత్పన్నమౌతున్నాయి – పొరుగువారేమనుకుంటారో, అని భయం మధ్యతరగతిలోనే, కాస్త పై స్థాయికి చెందిన వారివలె గౌరవింపబడమేమోనని భయం, సమాజనీతిలో నీతిలేదని తెలిసికూడ దానిననుసరించకపోతే భయం, ఉద్యోగం పోతుందేమోననీ, ఒంటరినైపోతానేమోననీ భయం, ఆందోళనతో భయం, అసలు మనసు ఆందోళనా పూరితంగా ఉన్నదంటేనే. దానిలో ఏదో భయం ఉన్నట్లే అర్థం అలానే ఈ భయాలన్నీ ఆలోచనపై ఆధారపడి జీవించేవారి జీవితంలో నుంచి పుట్టుకు వచ్చినవే

వ్యక్తచేతనలో కనిపించే ఈ భయాలే కాక మనోతత్వంలో అవ్యక్తంగా అంతరంగపు లోతుల్లో, లోలోపలి పొరల్లో దాగిన భయాలెన్నో వున్నాయి బాహ్యంలో బైటికి కనిపించే భయాలనైతే పరిష్కరించవచ్చు, లోతున దాగిన భయాలతో వ్యవహరించడమే కష్టం వ్యక్తంకాకుండా, లోతుల్లో దాగిన భయాలను ఉపరితలానికి తెచ్చి బహిర్గతం చేయడం ఎలా? వ్యక్తచేతన ఆ పనిచేయగలదా? వ్యక్తచేతన తన చురుకైన ఆలోచనతో నిగూఢంగా ఉన్న అవ్యక్తచేతన పై పొరలను ఛేదించగలదా? మనం 'అవ్యక్తచేతన' అనే పదాన్ని సాంకేతికపరంగా వాడటంలేదు మన స్పృహకు అందనిది, అజ్ఞాతమైనది, దాగి ఉన్న పొరలు – అనే అర్థంలో వాడుతున్నాం అంతే వ్యక్తచేతన – బాహ్య పరిస్థితులెలా ఉన్నా తననుతాను రక్షించుకోవడంలోనూ, వాటి కనుగుణంగా తనను మల్చుకోవడంలోనూ శిక్షణ పొందిన ఈ మనసు – ఎంత తెలివైనదో, ఎంత యుక్తికలదో మీకు తెలుసుకదా? అలాంటి వ్యక్తచేతన అవ్యక్తంలో వున్న ఆ మొత్తం విషయసామగ్రిని తెరచి చూడగలదా?

అది అలా చేయగలదని నేననుకోను ఒక పొరనైతే అది ఛేదించవచ్చునేమో! దానిని కూడ తన నిబద్ధత కనుగుణంగా అనువదించటానికి పూనుకుంటుంది అయితే, నిబద్ధతానుసారం అనువదించబడేసరికి వ్యక్తచేతనలోని అపోహలు మరింతగా వృద్ధిచెందటం, తత్కారణంగా దానికి ఆ తర్వాతి పొరను పూర్తిగా పరీక్షించగల సామర్థ్యం తగ్గిపోవటం జరుగుతుంది

ఉపరితలపు మనసు తన మొత్తం నిబద్ధత నుంచీ, అన్ని అపోహల నుంచీ, అన్ని భయాల నుంచీ సంపూర్తిగా స్వేచ్ఛనొందితేతప్ప అట్టడుగు మనసులో వున్న విషయాన్ని కేవలం ప్రయత్నం ద్వారా పరీక్షించటమనేది చాలా కష్టమని గ్రహించవచ్చు – స్వేచ్ఛలేని మనసుకి చూడగల శక్తి ఉండదు ఇది అత్యంత కఠినతరమనీ, బహుశా దుస్సాధ్యమేమోననీ మీకు అనిపించవచ్చు ఇపుడు ప్రశ్న దీనికి పూర్తిగా భిన్నంగా ఉండే మార్గమేదైనా ఉన్నదా?

విశ్లేషణ ద్వారా అంటే స్వీయవిశ్లేషణ ద్వారాగానీ లేక వృత్తిపరంగా విశ్లేషించే వారి ద్వారాగానీ మొత్తం భయాన్నీ మనసు తన నుండి బైటికి తోసేసి ఖాళీగా ఉంచుకోగలదా? ఇందులో ఇంకొకటి కూడ యిమిడి వుంది నన్ను నేను విశ్లేషించ పూనుకున్నప్పుడు, నన్ను నేను చూస్తూ, పొరవెంబడి పొరను పరీక్షిస్తూ తీర్పు చెప్తాను, అంచనా కడతాను 'ఇది ఒప్పు', 'ఇది తప్పు' అనీ, 'దీనిని నేను అట్టిపెట్టుకుంటాను', దీనిని వదిలేస్తాను' అనీ చెప్తుంటాను విశ్లేషిస్తున్నపుడు, నేను విశ్లేషింపబడే వస్తువుకి భిన్నంగా ఉన్నానా? నాకు నేనే సత్యం ఏమిటనేది చూచి సమాధానం చెప్పుకోవాలి విశ్లేషకుడు విశ్లేషించబడే దానికి భిన్నంగా ఉన్నాడా? – ఉదాహరణకు అసూయని తీసుకోండి.

అతను వేరుకాడు, అతనే అసూయ అసూయనుంచి తనను విభజించుకునే ప్రయత్నంచేసి, దానికి ఎడంగా నిలబడి, 'నేను అసూయను చూడబోతున్నాను దానికి సమీపంగా చేరి, దానిని వదిలించుకుంటానం'టాడు కానీ ఆ అసూయ, ఆ విశ్లేషకుడు ఒకరిలో ఒకరు అంతర్భాగమే

విశ్లేషణా ప్రక్రియలో కాలం యిమిడి ఉన్నది దానర్థం, నన్ను నేవు విశ్లేషించుకొనటానకి ఎన్నో రోజులు, ఎన్నో సంవత్సరాలు తీసుకుంటాను అన్ని

సంవత్సరాలు గడిచిన తర్వాత కూడ నేను యింకా భయపడుతూనే వుంటాను కనుక, విశ్లేషణ మార్గం కాదు విశ్లేషణ అంటేనే ఎంతో సమయం కావాలీ అని అనుకోవచ్చు ఇల్లు దగ్ధం అవుతూవుంటే మీరు విశ్లేషిస్తూ కూర్చోరు, లేక విశ్లేషణను వృత్తిపరంగా చేసే వారి వద్దకు వెళ్ళి, 'నన్ను గురించి యావద్విషయం చెప్పండి' అనరు – తక్షణ కర్తవ్యం ఏమిటో చేసితీరాలి విశ్లేషించడమనేది ఒక విధంగా తప్పించుకునే మార్గం, సోమరితనం, అసమర్ధత, నరాల వ్యాధిగ్రస్థుడు విశ్లేషకుని వద్దకు వెళ్ళడమనేది సరైనపనే, అపుడు కూడ ఆ వ్యాధి అతనికి పూర్తిగా నివారణ అవుతుందనేది చెప్పలేము అది వేరే సంగతి అనుకోండి

వ్యక్తచేతన అవ్యక్తచేతనను విశ్లేషించటమనేది మార్గం కాదు ఇది గ్రహించిన మనసు తనతో తానిలా అంటున్నది 'నేనికముందు విశ్లేషణకు పూనుకోను, ఇందులోని వ్యర్థత ఏమిటో గమనించాను ' నేనిక భయాన్ని ప్రతిఘటించను' అంటుంది అపుడా మనసులో ఏమి సంభవించిందో చూశారా? సాంప్రదాయకమైన విధానాలనూ, విశ్లేషణా మార్గాన్నీ త్యజించింది ప్రతిఘటించడం మానేసింది కాలం యొక్క అవసరం లేదంది ఆ స్థితిలో ఉన్న మనసుకి ఏమి లభ్యమైంది? అత్యంత అపూర్వమైన చురుకుదనం, పదును లభ్యమైనాయి గమనిక యొక్క ఆవశ్యకతను గ్రహించిన ఆ మనసు అపూర్వమైన తీక్ష్ణతతో, పదునుగా, సజీవంగా తయారవుతుంది

అది ఇలా అడుగుతున్నది, నాలో కూడుకున్న గతం, జాతి వారసత్వం, వంశాచారం, మతమూ, సంస్కృతుల ద్వారా రెండువేలు లేక పదివేవేండ్ల ఫలితంగా సంక్రమించిన సంప్రదాయపు బరువునంతా నింపుకున్న మనసు తనపైన ఉన్న ముసుగుని తొలగించి ఆ మొత్తాన్నీ వెలికి తెచ్చే మార్గం వేరే ఉన్నదా? ఆ మొత్తాన్నుంచి విడివడగలదా? అలా దానినంతా పక్కకు నెట్టినందువల్ల దానితోపాటు భయాన్ని కూడ పారదోలగలదా?

కనుక ఇదీ నా సమస్య, చురుకుగా అయిన నా మనసు విశ్లేషణకు కాలము యొక్క అగత్యము ఉన్నదని తెలుసుకున్నందువల్ల, ప్రతి ఒక్క విశ్లేషణా మార్గాన్ని పక్కకు నెట్టేసింది అందువల్ల దానికిక రేపు అనే దానితో నిమిత్తం లేదు కనుక – ఇప్పటికిప్పుడే అది ఆ సమస్యను పూర్తిగా పరిష్కరించాలి ఇక దానికి ఏ ఆదర్శమూ అవసరంలేదు, భవిష్యత్తుని గురించిన ఆలోచన లేదు అంచేత అది, 'నేనిక ముందు స్వేచ్ఛ పొందుతాను' అని అనదు అందువల్ల ఆ మనసిపుడు సంపూర్ణ సావధానతలో ఉన్నది ఇకనది తప్పించుకోదు, సమస్యా పరిష్కారానికి కాలాన్ని ఆశ్రయించదు, విశ్లేషణ నికవినియోగించదు, ప్రతిఘటించే ప్రయత్నం చేయదు తత్ఫలితంగా ఆ మనసే స్వయంగా వినూత్న లక్షణంతో భాసిల్లుతుంది

మానసిక శాస్త్రజ్ఞులు 'మీకు నిద్రలో స్వప్నాలు రావాలి, లేని పక్షంలో మీరు పిచ్చివారైపోతారని' చెప్తారు 'నాకసలు కలలు ఎందుకు రావాల అని నేను ప్రశ్నించుకుంటున్నాను కలలే రాని విధంగా జీవించే మార్గం ఉన్నదా? స్వప్న రహితమైన నిద్రే, మనసుకి నిజమైన విశ్రాంతినిస్తుంది అది దినమంతా చురుకుగా గమనిస్తూ, వింటూ, ప్రశ్నిస్తూ ఆకాశంలోని ఆ మబ్బు సౌందర్యాన్నీ, ఆ సుందర వదనాన్నీ, ఆ

జలరాశినీ, ఆ జీవితగమనాన్నీ, ప్రతి ఒక్కదానినీ - గమనిస్తూ, గమనికతో వుంటూ వుండే ఆ మనసు నిద్రకుపుక్రమించినపుడు దానికి పూర్తి విశ్రాంతి లభించాలి లేని పక్షంలో మర్నాటి ఉదయం అది మేల్కొంచినపుడు దానికి అలసట తీరదు కాబట్టి అది యింకా పాతమనసే

ఇప్పుడు ప్రశ్న, స్వప్నాలే లేకుండా నిద్రించే వీలున్నదా? ఆ విధంగా నిద్రించిన మనసుకి పూర్తిగా విశ్రాంతి లభ్యమౌతుంది కనుక మేలుకొన్న సమయంలో లభ్యంకాని ప్రత్యేక లక్షణాలేవో ఆ మనసుకి సిద్ధిస్తాయి ఇది సాధ్యమేనా అంటే సాధ్యమేకాదు, ఇది వాస్తవం కూడాను ఇదేమీ ఊహలో నుంచి జనించింది కాదు, సిద్ధాంతం కాదు, కల్పితం కాదు, ఆశాజనితమూ కాదు - ఇది సాధ్యం కావాల్నంటే, ప్రతీదినం పగటివేళలో, పూర్తిమెలకువతో మీ ఆలోచనా సరళినీ, మీ భావనల్నీ, మీలోని ప్రతిప్రేరణనీ, లోలోపలి నుంచి అందే ప్రతిసూచననీ, ప్రతి హెచ్చరికనీ గమనికతో చూడాలి అలాగే, మీరేదో ఒకటి మాట్లాడుతున్నపుడూ, నడుస్తున్నపుడూ, మరెవర్లైనా మాట్లాడుతుంటే వింటున్నపుడూ గమనిస్తూనే వుండాలి

మీలోని ఆకాంక్షల్నీ, అసూయనీ, మీ దేశపుకీర్తి ప్రతిష్ఠల్ని గురించి మీరు వింటున్నపుడు మీలో కలిగే ప్రతిస్పందనల్నీ, మీరు చదివే గ్రంథాలలో, 'మీ మత విశ్వాసాలన్నీ నిర్థకమైనవని' రాసివుంటే, అది చదువుతున్నపుడు విశ్వాసంలో ఇమిడి ఉన్నదేమై ఉంటుందో, దానినీ తెలుసుకుంటూ వుండాలి

బస్సులో కూర్చున్నా, భార్యా పిల్లలతో మాట్లాడుతున్నా, స్నేహితునితో సంభాషిస్తున్నా, పొగతాగుతుంటే - మీరు ఎందుకు పొగతాగుతున్నారో దానిని, అపరాధ పరిశోధక నవల చదువుతున్నపుడు, మీరు దానినెందుకు చదువుతున్నారనీ, సినిమా చూడటానికి వెళ్ళినపుడు, ఉద్రిక్తత కోసం వెళ్ళారా, శృంగారానుభూతి కోసం వెళ్ళారా అని ప్రశ్నించుకుంటూ ఉండాలి - ఇలా పగటిపూట ఈ వివిధ రకాల కార్యకలాపాలలో మీ మనసు ప్రవర్తిల్లే తీరునంతా పూర్తి మెలకువతో, శ్రద్ధగా గమనిస్తూ వున్నట్లయితేనే అది సాధ్యం అలానే ఆ అందమైన చెట్టునీ, ఆకాశంలో కదిలిపోతున్న ఆ మేఘాన్నీ చూచినప్పుడూ, మీలోనా, మీకు బయటా ఏమేమి సంభవిస్తున్నవో పూర్తి ఎరుకతో వీక్షిస్తూ ఉన్నట్లయితే మీరు నిద్రకుపక్రమించినపుడు ఇక స్వప్నాలనేవి ఉండవు మరుసటి ఉదయం మేల్కొంచినపుడు మీ మనసు స్వచ్ఛంగా, నిశితంగా, చైతన్యవంతంగా తయారౌతుంది

*పారిస్, ఏప్రిల్ 13, 1969*

# 8. అధిమానసిక స్థితి

## యదార్థతత్వంలోకి చొచ్చుకుపోవుట.
## ధ్యాన సంప్రదాయం.
## యదార్థతత్వం. నిశ్చలమైన మనస్సు.

ప్రపంచంలోని అల్లకల్లోలం, విపరీతమైన హింస, గందరగోళం, అనేవి, లోపలా, బయటాకూడ వ్యాపించివున్నవనే విషయం మనం మాట్లాడుకుంటున్నాం భయ ఫలితమే హింస అని గ్రహించిన మనం భయమనే అంశాన్ని కూడ తఱచి చూశాం ఇప్పుడు మీలో చాలా మందికి పరిచయం లేవి విషయం గురించి విచారణ చేయబోతున్నాము అదంతా ఒక భ్రమ అనీ, ఒక సరదా అనీ, తిరస్కరించకుండా విచారణ చేయవలసిన విషయం

చరిత్ర మొత్తంలో మానవుడు - తన జీవితకాలం అత్యల్పమనీ, ప్రమాద భూయిష్ఠమనీ, దుఃఖం, అనివార్యమైన మృత్యువులతో కూడివున్నదనీ గ్రహించి - భగవంతుడనే పేరుతో ఒక భావాన్నెప్పుడూ ప్రతిపాదిస్తూవచ్చాడు ఇపుడు మన మనుకుంటున్నట్లే - అతను కూడ జీవితమశాశ్వతమని గ్రహించి, మనోరాగ భావాలతో ఆవిష్కరించలేని, బ్రహ్మాండమైన దానిని, సర్వోత్కృష్టమైన దానిని అనుభవంలోకి తెచ్చుకుందామనుకున్నాడు, ఈ ప్రపంచం, ఇందులోని సమస్త దుఃఖాలకు చిత్రహింసలకూ, ఆవల దీనిని మించినదీ, దీనికి పూర్తిగా భిన్నమైనదీ అయిన ఆ ప్రపంచాన్ని దర్శించాలనీ, అందులోకి మార్గం వెతుక్కోవాలనీ ఆశించాడు కోరినందువల్లా, ఆశించనందువల్లా, ఆలోకాతీత ప్రపంచాన్ని అతను కనుగొనగలననే ఆశించాడు ఈ లోకానికి భిన్నంగా, భిన్నపరిమాణంలో వేరొక యదార్థతత్వం - దానికి ఏ పేరు పెట్టుకున్నా ఫరవాలేదు - అలాంటిది ఒకటి ఉన్నదా, లేదా అని కనుగొనటానికి మనమీ అంశాన్ని తఱచి చూడవలసి వుంది దాని లోతుల్లోకి చొచ్చుకు వెళ్ళడానికి కేవలం వాచ్యార్థాన్ని అర్థం చేసుకుంటే చాలదు అనేది ఎవరైనా సహజంగా గ్రహించగలరు - కారణం, వర్ణన ఎపుడూ వర్ణించబడేది కాదు, పదమెన్నటికీ వస్తువూ కాదు ఇంతకాలంగా మనిషి ఈ రహస్యంలోకి - ఇది రహస్యమే అయితే - అందులోకి ప్రవేశించాలనీ, దానిని పట్టుకోవాలనీ, దాని నాహ్వానించాలనీ, దానిని స్వాధీనపర్చుకోవాలనీ, దానిని ఆరాధించాలనీ, ఆరాధకుణ్ణవాలనీ ప్రయత్నిస్తూ వచ్చాడో - అందులోకి మనం చొచ్చుకు పోగలమా?

నేటి మన జీవితం - అట్టే లోతులేకుండా, పేలవంగా, అర్థరహితంగా అత్యంత బాధాకరంగా, ఖాళీగా ఉంటున్నందువల్ల - దానికొకింత ప్రాముఖ్యతను కల్పించి అర్థవంతం చేయాలని మనిషి ప్రయత్నించాడు ఆ మనిషి కొకింత చాతుర్యం ఉన్నట్లైతే, జీవితానికి అతను కల్పించిన ప్రాధాన్యమూ, ప్రయోజనమూ మరింత క్లిష్టంగా రూపొందుతాయి ఆ బ్రహ్మాండమైన దానినీ, ఆ సౌందర్యాన్నీ, ఆ ప్రేమనీ కనుగొనలేక, విఫలుడై అన్నింటిలోనూ విశ్వాసం కోల్పోయి, అంతా వ్యర్థమేననే భావంలో పడిపోవచ్చు మన జీవితానికి ఏ అర్థమూ లేకపోయిన తర్వాత - మన జీవితసరళి యదార్థంలో అలానే ఉన్నది గదా - ఏదో ఒక సిద్ధాంతాన్నీ, సూత్రాన్నీ ప్రతిపాదించి, దేవుడు ఉన్నాడనో లేడనో నిర్ధారించటమన్నది, అసంగతము, అర్థరహితము, భ్రమజనిత మనేది గ్రహించవచ్చు. కనుక మనం దీనికి ఏదో ఒక అర్థం కల్పించవద్దు

మీరూ, నేనూ కలిసి అలాంటి యదార్థతత్వం ఒకటి ఉన్నదా, లేదా అనేది కనుగొంటే బాగుంటుంది, అయితే అది మేధాపరంగా, భావపరంగా చేసే కల్పన అయితే, అది ఒక పలాయనం అవుతుంది. మానవుడు మొదటి నుంచీ కూడ యదార్థతత్వం ఒకటి ఉన్నదనీ, దానికై మీరు తయారవాలనీ అన్నాడు దాని కోసం మీరు క్రమశిక్షణలో వుంటూ, కొన్ని నిర్దిష్ట కార్యాలనాచరిస్తూ, అన్ని రకాల వ్యామోహాలనూ నిర్జించి, లైంగిక వాంఛలనదిమిపెట్టి, మతాధికారులు, సాధుపుంగవులు మొదలైనవారు నిర్దేశించిన సూత్రాలననుసరిస్తూ సిద్ధంగా ఉండమన్నారు లేదా, ఏ వ్యామోహానికీ గురికాకుండా ఉండేందుకు వీలుగా, ఈ ప్రపంచాన్నే త్యజించి, ఏ సన్యాసాశ్రమానికో, ఏ కొండగుహకో వెళ్ళిపోయి, ఒంటరిగా నుంటూ ధ్యానం చేయమన్నారు ఇటువంటి ప్రయత్నమెంత అసంగతమో చూడవచ్చు; ఈ ప్రపంచం నుంచి, ఇందులో తాను 'ఉన్నస్థితి' నుంచి, ఈ బాధల నుంచి, ఇతర ఆకర్షణల నుంచి, శాస్త్రీయరంగంలో మనిషి సమకూర్చిపెట్టిన వాటన్నింటినుంచి ప్రయత్న పూర్వకంగా తప్పించుకుపోవడం సాధ్యం కాదనేది గ్రహించవచ్చు ఇకపోతే, మత - వేదాంతపరమైన సిద్ధాంతాలు అన్ని రకాల సిద్ధాంతాలనూ, అన్ని విశ్వాసాలనూ త్యజించకతప్పదు ఏ రకమైన విశ్వాసాన్నైనా మనిషి వదిలివేసినప్పుడే భయమనేది పూర్తిగా లేకుండాపోతుంది.

సమాజపునీతి, నీతేకాదనీ, అవినీతిమయమనీ తెలిసిన తదుపరి, మనిషి ఎంత అసాధారణమైన నీతితో జీవించవలెనో గ్రహిస్తాడు, నిజానికి నీతి అంటే ఏమిటి? మనిషి అంతరంగంలోనూ బాహ్యంలోనూ క్రమత నెలకొనటమే, అయితే ఆ విధమైన నీతి మనిషి చర్యల్లో ఉండాలి, కేవలం భావాత్మకంగానో, ఆలోచనాత్మకంగానో వుంటే, సరిపోదు, ఆ నైతికత ప్రవర్తనలో, ఆచరణలో ఉండాలి

అణిచిపెట్టుట, అదిమిపెట్టుట, తప్పించుకొనుటతో నిమిత్తం లేకుండా ఎవరికి వారు క్రమశిక్షణలో జీవించడం సాధ్యమేనా? 'క్రమశిక్షణ' అన్న పదానికి మూలార్థం 'నేర్చుకొనుట' ఎవరికో శిష్యులై, వారిననుసరిస్తూ, అనుకరిస్తూ, అణిచిపెట్టబడటం కాదు, నేర్చుకొనుటే క్రమశిక్షణ యొక్క అవసరాన్ని తెలియచేస్తుంది ఈ రకమైన క్రమశిక్షణలో ఏదో ఒక సిద్ధాంతపరమైన భావాలను తెచ్చి తనపై విధించుకోవడంకాదు, దానికనుగుణంగా తనను మల్చుకోవడమూ కాదు - సన్యాసులవలంబించే కఠినమైన

నైష్ఠికతా కాదు కానీ లోతైన ఓ నిష్ఠ లేకుంటే మాత్రం దైనందిన జీవితంలోని మన ప్రవర్తన క్రమం తప్పుతుంది మనిషికి తనలో సంపూర్ణమైన క్రమత ఉండటమనేదెంత ఆవశ్యకమో గ్రహించండి గణితశాస్త్రంలో ఉన్నంత క్రమం ఉండకతప్పదు. అది సాపేక్షమైనదీ కాదు పోల్చదగినదీ కాదు, పరిసరాల ప్రభావంచే మలచబడినదీ కాదు ప్రవర్తన అనగా ధార్మికత సుస్థాపితమవాలి అప్పుడే ఆ మనసులో సంపూర్ణమైన క్రమం నెలకొంటుంది

హింసకు గురైనందువల్ల, వైఫల్యాలు చెందినందువల్ల, పరిసరాల ప్రభావంతో రూపుదిద్దబడినందువల్ల, సమాజపు నీతినే శిరోధార్యమనుకుని బ్రతుకుతున్నందువల్ల, ఆ మనసు చిందరవందరై పోయి వుంటుంది అస్తవ్యస్తమై పోయిన ఆ మనసు ఏది సత్యమో కనుగొనజాలదు ఆ విచిత్ర రహస్యం మనసుకు స్ఫురించవలెనంటే – అలాంటి రహస్యం ఒకటి, ఉన్నట్లైతే – సమాజనీతికి భిన్నమైన నీతి, నడవడికలను పునాదిగా చేసుకోవాలి ఏ మాత్రం భయంలేనందువల్ల, ఆ నైతికతలో స్వేచ్ఛ ప్రవర్తిల్లుతుంది అపుడు మాత్రమే అలాంటి – లోతైన పునాది వేసుకున్న తర్వాతనే – ధ్యానం అంటే ఏమిటో, నిశ్శబ్ద లక్షణమెలాంటిదో, పరిశీలకుడు లేని పరిశీలన అంటే ఏమిటో కనుగొనడానికి మనసు ముందుకు సాగగలదు ఇలాంటి ధార్మిక ప్రవర్తన, మనిషి జీవితంలో మూలకందం కాకపోతే, అతడి చర్యల్లో అది ప్రతిబింబించకపోతే, అప్పుడు ధ్యానానికి అర్థం ఉండదు

ప్రాచ్యదేశాల్లో, జెన్, యోగావంటి పద్ధతులతో సహా, పలురకాల పద్ధతులలో, ప్రక్రియలలో ధ్యానాన్ని నేర్పుతుంటారు అవన్నీ పశ్చిమదేశాలకు కూడ తీసుకురావడం జరిగింది ఒక పద్ధతి ద్వారా, ఓ ప్రక్రియ ద్వారా, ఓ ప్రత్యేక సరళి లేక ఓ సంప్రదాయాన్ని అనుసరించడం ద్వారా, మనసు ఆ యదార్థతత్వాన్ని దర్శించగలదనే వారి సూచనను అర్థం చేసుకోవడంలో మీరు స్పష్టంగా ఉండాలి ప్రాగ్దేశం నుంచి తెచ్చినా, పశ్చిమదేశాల్లో సృష్టించినా ఈ రకమైన విధానం ఎంత అసంబద్ధమో గ్రహించవచ్చు పద్ధతిలో అనుసరించటం ఉంటుంది పద్ధతి అంటేనే, ఎవరో ఒకరు జ్ఞానసాధనలో ఒక దశకు చేరారనీ, వారు ఇతరులకు 'ఇది చెయ్య'మనీ, 'అది చెయ్యవద్దనీ' చెప్పగలరనే అర్థం ఉన్నది ఇక మనమా! ఆ వాస్తవాన్ని దర్శించాలనే ఆతురతతో ఉంటాము కనుక, వారు చెప్పినదంతా అనుసరిస్తూ, ఆచరిస్తూ, వారి కత్యంత విధేయులమై, రోజుల తరబడి యంత్రాలవలె సాధనచేస్తూ వుంటాం. సున్నితత్వం కోల్పోయి, మందకొడి అయిన ఆ మనసుకి అట్టే తెలివి కూడ లేనందువల్ల ఒక పద్ధతిని పట్టుకుని అంతులేకుండా అభ్యసిస్తూ వుంటుంది అది మరింత మందకొడిగా, మరింత మందమతిగా తయారౌతుంది అయినా ఆ మనసుకి దాని నిబద్ధతా పరిధిలో తనదైన 'ఒక అనుభవం' కలుగుతుంది.

మీలో కొందరు తూర్పుదేశాలకు వెళ్ళి అక్కడి ధ్యాన పద్ధతులను నేర్చి ఉంటారు దాని వెనుక ఎంతో సంప్రదాయం ఉన్నది పురాతన కాలంలో ఇండియాలోనూ, మొత్తం ఆసియా ఖండంలోనూ, అది బ్రహ్మాండంగా విస్తరిల్లింది ఈనాటికీ, అది మనసుని కట్టివేస్తుంది దానిపై అనేకానేక సంపుటాలు వ్రాయబడ్డాయి – ఏ రకమైన

సంప్రదాయమైనా – గతాన్నుండి దిగివచ్చినట్లయితే – ఒక మహత్తరమైన యదార్ధతత్వం ఉన్నదా అని కనుగొనే నిమిత్తం దానిని వినియోగిస్తే, మన ప్రయత్నమంతా వృధాయే అవుతుంది. అన్ని రకాల ఆధ్యాత్మిక సంప్రదాయాల నుంచీ, అన్ని శాస్త్ర విధుల నుంచీ మనసు విడివడాలి లేని పక్షంలో అత్యున్నతమైన ఆ తెలివి మనిషిలో పూర్తిగా లోపిస్తుంది

ధ్యానం సంప్రదాయానికి చెందకపోతే, మరి ధ్యానమంటే ఏమిటి? – అది సంప్రదాయబద్ధం కాజాలదు దాని నెవ్వరూ నేర్పలేరు, ఏదో ఒక ప్రత్యేక మార్గాన్ని అనుసరిస్తూ, 'ఈ మార్గంలో నేను ధ్యానం నేర్చుకుంటాను' అని మీరనజాలరు మనసు పూర్తిగా నెమ్మదించటంలోనే ధ్యానం యొక్క సంపూర్ణార్థం యిమిడి వున్నది, ఈ నిశ్చలత, వ్యక్తచేతన స్థాయిలోనే కాక, చేతనలో, లోతుగా, రహస్యంగా దాగిన స్థాయిలలో కూడ ఉండాలి, మనసు ఎంత పూర్తిగా నెమ్మదైపోవాలంటే, ఆలోచన నలువైపులా తిరుగాడకుండ నిశ్శబ్దంగా ఉండిపోవాలి మనం ఇపుడు సంప్రదాయ దృష్టిలో, ధ్యానాన్ని గురించి మాట్లాడుకుంటున్నాం; ఈ సాంప్రదాయికమైన విధానాల్లో ఒకటేమంటే ఆలోచనని అదుపులో పెట్టాలి అని, అయితే దానిని పూర్తిగా పక్కన పెట్టేయాలి అలా పెట్టుటకు మనిషి ఆలోచనను అత్యంత సమీపంగానూ, తటస్థంగానూ, భావోద్వేగ రహితంగానూ, చూసితీరాలి

ధ్యానం చేయుటలో మీకు సహాయపడటానికి, ఒక గురువో, ఒక బోధకుడో అవసరమంటుంది సంప్రదాయం, అతడు మీకు ఏం చేయాలో చెప్తాదంటుంది పశ్చిమదేశాల వారికి ప్రత్యేకంగా వారి సంప్రదాయం వారికి ఉన్నది ప్రార్థనలు, వారి ధ్యానాలోచనలు, వారి పాప నివేదనలు, కానీ ఈ మొత్తం సూత్రంలో యిమిడి ఉన్నదేమంటే, ఎవరికో తెలుసును, మీకు తెలియదు, ఆ తెలిసినవారు మీకు బోధించి, జ్ఞానోదయం కలిగిస్తారని అర్థం; అనగా, ఆధిపత్యం, ప్రభువు, గురువు, రక్షకుడు, దేవుని కుమారుడు యిత్యాదులు, తమకు తెలుసుననీ, మీకు తెలియదనీ; అందువల్ల మీరీ పద్ధతి ననుసరించండి, ఈ మార్గంలో అనునిత్యం సాధనచేస్తూవుంటే, చిట్టచివరకు మీరాదరికి చేరగలరంటారు – అదీ మీకదృష్టం ఉంటేనూ – అనగా ఒక పద్ధతిని కానీ, ఒక మార్గాన్ని కానీ అనుసరించాలని ప్రయత్నిస్తూ, మీరు మీలోని కోరికల్ని, బలీయమైన మీ వాంఛల్ని, మీలో జనించే అసూయా ద్వేషాల్నీ, ఆకాంక్షల్నీ అణిచిపెట్టడానికి ప్రయత్నిస్తూ వుంటారు. అంటే మీతో మీరు పోరు సల్పుతుంటారన్నమాట అందువలన, మీ'రున్నదానికీ'– పద్ధతి ద్వారా మీరు 'ఉండాలనుకున్నదా'నికీ మధ్య ఘర్షణ ఏర్పడింది దీనర్థం, ఇక్కడ ప్రయత్నం జరిగిందన్నమాట. ప్రయత్నం చేసే మనసెప్పటికీ నెమ్మదిగా ఉండజాలదు; ప్రయత్నం ద్వారా మనసెన్నటికీ పూర్తిగా నిశ్చలంకాలేదు.

మీ ఆలోచనల నదిమిపెట్టుటకు ఏకాగ్రత వహించమంటుంది సంప్రదాయం. ఏకాగ్రతలో ఉండటమంటే, ప్రతిఘటించటమే; అది ఒక భావమైనా, సూత్రమైనా, చిత్రమైనా, మీకు నచ్చినదేదైనా సరే, దేనిపైనైతే, మీరు దృష్టిని నిలిపారో, దానిలో మరేదీ చొరనివ్వకుండా, దానిని రక్షించుకునే నిమిత్తం మీ చుట్టూ ఓ గోడను నిర్మించుకున్నట్లే అవుతుంది మీరు కనుగొనదల్చుకున్నదేమైనా, దానిని కనుగొనుటకు ఈ విధానం అవలంబించవలసిందే నంటుంది సంప్రదాయం కూడ విపరీత మనస్కులయిన సాధు,

సన్యాసులు చెప్తూ వచ్చినట్లు, మీకు లైంగిక సంబంధం ఉండరాదనీ, ఈ లౌకిక ప్రపంచం వంకే చూడరాదనీ అంటుంది దీనినంతా కేవలం వాగ్రూపకంగానూ, మేధాపరంగానూ కాక, వాస్తవంలో ఇందులో ఏమేమి యిమిడి ఉన్నవో చూసినపుడు – ఆ చూడడం కూడ, దేనికీ కట్టుబడకుండా, తటస్థంగా చూసినప్పుడే – దీనిని పూర్తిగా వదిలివేస్తారు సంపూర్తిగా వదిలిపెట్టాలి? అలా వదిలివేయడంలోనే, ఆ మనసు స్వేచ్ఛని పొందుతుంది అప్పుడు ఆ మనసు తెలివితో, ఎఱుకతో వుంటుంది; అది ఇక ఏ భ్రమలలోనూ చిక్కుకునే ఆస్కారంలేదు

ధ్యానించుటకు, ఆ పదానికున్న లోతైన అర్థాన్ని బట్టి, మనిషిలో ధార్మికత, నైతికత ఉండాలి, అయితే ఆ నీతి ఒక సమూనానో, ఒక సాధనా క్రమాన్నో, ఓ సాంఘిక నియమావళినో అనుసరించేది కాదు. మిమ్మల్ని మీరు అర్థం చేసుకోవడం మొదలుపెట్టినపుడూ, మీ ఆలోచనలూ, భావాలూ, మీ కార్యకలాపాలూ, మీలోని బలీయమైన వాంఛలు, ఆకాంక్షలు – ఎలా ఉంటున్నవో గమనిస్తూ, ఉన్నపుడూ – ఆ గమనికలో ఎంపిక ఏ మాత్రం లేకుండా కేవలం పరిశీలనే చేస్తుంటే, అపుడు మీలో ఆ నైతికత సహజంగా, సౌమ్యంగా, తప్పని సరిగా ప్రవేశిస్తుంది అలాంటి పరిశీలనలో నుంచే సరైన చర్య జరుగుతుంది దానికి అనుసరణతో నిమిత్తం లేదు, ఆదర్శానికి అనుగుణంగా ఆచరించడమనేది లేదు ఆ విధమైన పరిశీలనా, కాఠిన్యం ఏ మాత్రంలేని దాని సౌందర్యం, తత్సంబంధమైన నిష్ఠ, మనిషి స్వభావంలో కనుక నెలకొన్నట్లయితే – ప్రయత్నం ఉన్నచోటనే కాఠిన్యం ఉంటుంది కనుక – అన్ని మార్గాలనూ, అన్ని పద్ధతులనూ, అన్ని వాగ్దానాలనూ ఇష్టా ఇష్టాలతో నిమిత్తంలేకుండా, తటస్థంగా చూచి వాటినన్నిటినీ విసర్జించగలుగుతారు అపుడు మీ మనసు గతం నుండి విముక్తి చెందుతుంది, ఇపుడు మీరిక ధ్యానమంటే ఏమిటో కనుగొనేందుకై ముందుకు సాగగలరు

మీరిలాంటి పునాదిని నిజంగా వేయనట్లయితే, మీరు ధ్యానంతో ఆటలాడుకోవటమే అవుతుంది, అది అర్థరహితం – కొందరు తూర్పుదేశాలకు వెళ్ళి, అక్కడ ఎవరో ఒక గురువుని చూచుకుని, వారి వద్ద తామెలా కూర్చోవాలో, ఎలా శ్వాసించాలో, ఏం చేయాలో, ఇదీ, అదీ, ఏదేదో తెలుసుకుని తిరిగివచ్చి, ఒక గ్రంథం వ్రాయడం లాంటిది, ఇదంతా శుద్ధ తెలివితక్కువ. తనకుతానే గురువు, తనకుతానే ఒక శిష్యుడై వుండాలి, ప్రామాణికంగా చెప్పేవారెవరూలేరు, ఉన్నదంతా అవగాహన మాత్రమే పరిశీలించేవాడు కేంద్రంలో లేకుండా పరిశీలించినపుడే అర్థం చేసుకోవడమనేది సాధ్యమౌతుంది అర్థం చేసుకొనుట అంటే ఏమిటో, మీరెప్పుడైనా పరిశీలించారా, గమనించారా, కనుగొనాలని ప్రయత్నించారా? అవగాహన మేధకు సంబంధించిన ప్రక్రియ కాదు; అవగాహన అంతఃస్ఫురణ కాదు, మనోభావమూ కాదు. ఎవరైనా దేనినో చూసి, 'నేను దానిని స్పష్టంగా అర్థం చేసుకున్నాను' అంటే, సంపూర్ణ నిశ్శబ్దంలో నుంచి పరిశీలించడం జరిగిందన్న మాట. అపుడు మాత్రమే అవగాహన ఏర్పడినట్లు. మీరు, 'నాకేదో అర్థమైంది' అన్నప్పుడు, మీ మనసు అతినిశ్శబ్దంగా, అవుననకుండా, కాదనకుండా విన్నదని అర్థం ఆ స్థితిలో ఉన్న మనసు సంపూర్తిగా వింటుంది – అపుడు

మాత్రమే అవగాహన ఉంటుంది, ఆ అవగాహనే క్రియ ముందు అర్థం చేసుకోవడం, తర్వాత ఆచరించటంకాదు అవి రెండూ ఒకేసారి జరుగుతాయి అదంతా ఒకే చలనం

ఇక, ధ్యానం - సంప్రదాయం దానిపై మోపిన ఎన్నో అర్థాలతో ఆ పదం బరువెక్కిపోయింది ధ్యానమంటే - ప్రయత్నం లేకుండా, ఏ విధమైన ఒత్తిడీ పెట్టకుండా, ఈ మనసునీ, ఈ మెదడునీ, వాటి అత్యున్నత స్థాయికి చేర్చడమే, అదే తెలివి అంటే, అవి అత్యంత సున్నితత్వంలో ఉండడమన్నమాట ఇపుడు మెదడు నెమ్మదిగా ఉన్నది, లక్షలాది సంవత్సరాలుగా పరిణామం చెంది, ఆ గతాన్నంతా తనలో నిక్షేపించుకుంటూ వస్తున్న ఆ మెదడు, నిరంతరం, నిర్విరామంగా పనిచేస్తూ, చురుకుగా వుండే - ఆ మెదడు ఇపుడు నిశ్శబ్దమైంది

అన్ని వేళలా, తన నిబద్ధతానుసారం ప్రతి చిన్న ప్రేరణకూ, ప్రతిస్పందిస్తూ, ప్రతిక్రియ సల్పుతూ నిశ్శబ్దంగా వుండటం సాధ్యమేనా? ఉఛ్వాస - నిశ్వాసాలను క్రమబద్ధీకరిస్తూ, ఎఱుకని అభ్యసిస్తూ వుంటే మనసు నెమ్మదిస్తుందని సంప్రదాయవాదులంటారు ఇందులోనుంచి, మళ్ళీ, మరొక ప్రశ్న పుట్టుకు వస్తుంది, అదుపునందుంచే వా'రెవరు'? సాధన చేసే'దెవరు' మెదడుని రూపుదిద్దే'దెవరు'? అదంతా ఆలోచన గాదా? ఆ ఆలోచనే, 'చూచే వాడిని నేనే', మెదడుని అదుపులో వుంచేది నేనే, ఆలోచనని అంతం చేసేది నేనే" అంటున్నది ఆలోచనే ఆలోచనాపరుని సృష్టిస్తున్నది

మెదడు పూర్తిగా నిశ్శబ్దంగా ఉండటం సాధ్యపడుతుందా? అది కనిపెట్టడం ధ్యానంలో భాగమే, ఎలా కనిపెట్టాలనేది మరొకరు చెప్పేదికాదు అది ఎలా చేయాలో ఎవ్వరూ మనకు చెప్పలేరు దీర్ఘకాలపరిణామం యొక్క ఫలితంగా, అనేకానేక అనుభవాలచే, సంస్కృతిచే, అమితంగా నిబద్ధీకరింపబడిన మీ మెదడు - అంత నిశ్చలం అవగలదా? లేని పక్షంలో, అది ఏమి చూసినా, ఏమనుభవించినా అది వక్రీకరించబడుతుంది స్వీయ నిబద్ధతానుసారం అది అనువదించబడుతుంది

జీవించటంలో కానీ, ధ్యానించటంలో కానీ నిద్రకు ఉన్న పాత్ర ఏమిటి? ఇది అత్యంత ఆసక్తికరమైన ప్రశ్న, దీనిని మీరు స్వయంగా తఱచి చూచుకుంటే, దీని గురించి మీరెంతో కనుగొంటారు ఆ మధ్య మేమన్నట్లు, స్వప్నాలు అవసరంలేదు పగటివేళలో మనసు, మెదడు పూర్తి ఎఱుకలో ఉండవలెనని చెప్పాము-బాహ్యంలోనూ, అంతరంగంలోనూ రెంటిలోనూ ఏమి సంభవిస్తున్నదో, సావధానతతో చూస్తూ ఉండాలి. బాహ్యమైన వాటికి లోనకలిగే ప్రతిచర్యలూ, ఒత్తిళ్ళను, ఈ ఒత్తిళ్ళు రేకెత్తించే ప్రతిక్రియల్నీ, అదే సమయంలో అవ్యక్త చేతన నుంచి అందుతున్న సూచనల్నీ శ్రద్ధగా చూడాలి - అటు తర్వాత, ఆ దినం అంతమయ్యే వేళలో, ఆ మొత్తాన్నీ సమీక్షించుకోవాలి ఆ విధంగా ఆ దినమంతమయ్యేసరికి ఆ రోజు జరిగిన వాటినన్నిటినీ సమీక్షించుకొనకపోతే, తనలో క్రమతను తీసుకురావడానికి, నిద్రించే సమయంలో ఆ మెదడు శ్రమించవలసివస్తుంది - ఇది స్పష్టం ఈ మొత్తాన్నీ కనుక, ఈ విధంగా మీరు చేసినట్లయితే, మీరు నిద్రించే వేళలో, పూర్తిగా విభిన్నమైనదేదో, మీరు నేర్చుకుంటూవుంటారు, అపుడు మీరు నేర్చుకుంటున్నది విభిన్న ప్రమాణంలో ఉంటుంది అదీ ధ్యానంలో భాగమే

ప్రవర్తనకు ఒక పునాది వేసుకోవడం జరిగింది అపుడు చేసేదేదైనా ప్రేమపూరితమే అన్ని సంప్రదాయలను త్రోసిపుచ్చినందువల్ల, మనసు పూర్తి స్వేచ్ఛలో ఉన్నది. మెదడు పూర్తిగా నెమ్మదించింది దీనినంతా మీరు జాగ్రత్తగా పరికించినట్లయితే, ఏ యుక్తీ ప్రయోగించకుండానే, మత్తుపదార్థం సేవించకుండానే - దినమంతా చురుకుగాను, అనాసక్తమైన ఎరుకతోనూ గడిపిన ఆ మెదడు పూర్తిగా నిశ్శబ్దమౌతుందని మీరే గ్రహిస్తారు ఆ దినం అంతమయ్యేసరికి, ఆ దినాన జరిగిన వాటినన్నిటినీ సమీక్ష చేసుకుంటే, దాని ద్వారా క్రమతను తీసుకురావచ్చు, అపుడు నిద్రించినపుడు ఆ మెదడు నెమ్మదించి, విభిన్నగతిలో నేర్చుకుంటూ వుంటుంది

కనుక, మొత్తం శరీరమూ, మెదడు, సమస్తమూ, ప్రతిదీ ఏ విధమైన వక్రీకరణా లేకుండా, నిశ్శబ్దమైంది, అపుడు మాత్రమే, యదార్థతత్వం ఏదైనా ఉన్నట్లయితే, అలాంటి మనసు మాత్రమే స్వీకరించగలదు అది ఆహ్వానించగలిగింది కాదు, ఆ బ్రహ్మాండమైనది - అలాటిదొకటి ఉన్నట్లయితే, ఆ నామరహితమైనది, ఆ లోకాతీతమైనది ఉన్నట్లయితే - అటువంటి మనసు మాత్రమే ఆ యదార్థతత్వం యొక్క నిజానిజాలను చూడగలదు

'మా జీవితాలకి దీనితో సంబంధం ఏమిటండీ' అని మీరనవచ్చు. మా రోజువారీ జీవితంలో ఆఫీసుకి వెళ్ళాలి, పాత్రలు కడుక్కోవాలి, రణగొణ ధ్వనులతో రద్దీగా వుండే బస్సుల్లో ప్రయాణించాలి వీటన్నిటికీ, ధ్యానానికీ సంబంధంమేమిటి? అని మీరంటారు కానీ ధ్యానమంటే జీవితాన్ని అర్థం చేసుకోవడమే, నిత్యజీవితంలోని సంక్లిష్టత, దుఃఖం, అవస్థలూ, ఒంటరితనం, ఆశాభంగాలతోపాటు, జీవితంలో పేరుగడించాలనీ, విజయం సాధించాలనీ, భయం, ఈర్ష్య - వీటన్నిటినీ అర్థం చేసుకోవడమే ధ్యానం. దీనిని అర్థం చేసుకొనకుండా, కేవలం, దీని వెనుకనున్న రహస్యాన్ని కనుగొనాలని చేసే ప్రయత్నం శుష్కము, విలువలేనిది ఇది ఎలాంటిదంటే, క్రమంతప్పిన మనసుతో, క్రమరహిత జీవితం గడుపుతూ, గణితశాస్త్రంలో ఉండే క్రమతను తన జీవితంలో కనుగొనాలని చేసే ప్రయత్నం జీవితంలోని అన్నిటితోనూ ధ్యానానికి సంబంధం ఉంది, భావోద్వేగంతో ఏదో ఒక తన్మయత్వంలోకి వెళ్ళిపోవటం కాదు సుఖంతో సంబంధంలేని తన్మయత్వం ఒకటి వున్నది; గణితశాస్త్రపు క్రమం మనిషిలో కూడ నెలకొన్నప్పుడే, ఆ తన్మయత్వం లభిస్తుంది అదే పరిపూర్ణత్వం ధ్యానమనేది జీవిత విధానం అవాలి, ప్రతిదినం - అప్పుడు మాత్రమే, అవినాశకరమైనది, కాలరహితమైనది, ఆవిర్భవిస్తుంది

**ప్రశ్న: తనలో కలిగే ప్రతిక్రియలను పరిశీలించేవారెవరు? అందులో వినియోగించ బడుతున్న శక్తి ఏమిటి?**

**కృష్ణమూర్తి:** ప్రతిక్రియ లేకుండా మీరు దేనినైనా చూశారా? చెట్టునైనా, స్త్రీ యొక్క ముఖాన్నైనా, ఆ పర్వతం, ఆ మబ్బు, ఆ నీటి మీది కాంతినైనా కేవలం పరిశీలించుటకే చూశారా? వాటి ఎడల మీకు ఉండే యిష్టాయిష్టాలుగానీ, బాధాసుఖాలుగానీ, మీ చూపుని ఆటంకపరచకుండా, మీరు వాటిని అనువదించుకోకుండా ఉన్నదానిని ఉన్నట్లుగా చూశారా? అట్టి పరిశీలనలో మీరు సంపూర్ణ సావధానులై ఉన్నపుడు, పరిశీలనకుడు ఒకడున్నాడా? చేసి చూడండి,

సర్, నన్నడగవద్దు - చేసి, చూసినట్లయితే, మీరు కనుగొనగలరు మీలో కలుగుతున్న ప్రతిక్రియలను తీర్పు చెప్పకుండా, విలువకట్టకుండా, వక్రీకరించకుండా, ప్రతీ ప్రతిక్రియనీ సంపూర్ణ సావధానతతో పరిశీలించండి, అలాంటి సావధానతలో పరిశీలకుడుగానీ, ఆలోచించేవాడుకానీ, అనుభవించేవాడుకానీ లేరు అనే విషయం మీకే విదితమౌతుంది

ఇక, రెండవ ప్రశ్న, మనిషిలో దేనిని మార్చాలన్నా, పరివర్తన తేవాలన్నా, మనోతత్వంలో విప్లవం తేవాలన్నా, వినియోగించబడే శక్తి ఏమిటి? అలాంటిశక్తి కలిగుండటం ఎట్లా? ఇపుడు మనలో శక్తి ఉన్నది కానీ, అది నరాల ఒత్తిడిలో, వైరుధ్యంలో, ఘర్షణలో ఉన్నది, రెండు కోరికల మధ్య జరిగే పోరులోనూ శక్తి వున్నది, నేను చేయక తప్పనిది, నేను చేయదగినది అనేవాటి మధ్య - అవన్నీ ఎంతో శక్తిని హరిస్తున్నాయి. అసలు ఏ వైరుధ్యమూ లేదనుకోండి - అపుడు మీలో శక్తి పుష్కలంగా ఉంటుంది మీ జీవితం వంకే చూడండి, నిజంగా చూడండి - అది పరస్పర వైరుధ్యాలతో కూడినది. మీరు ప్రశాంతంగా ఉండాలనుకుంటారు కానీ ఎవరినో ద్వేషిస్తుంటారు మీకు ప్రేమించాలనే వుంటుంది కానీ ఆకాంక్షా పరత్వంతో వుంటారు మనలోని వైరుధ్యమే, పోరునీ, ఘర్షణల్నీ పెంచుతుంటుంది సతతము సాగే ఈ పోరువల్లనే శక్తి వృధా అవుతున్నది ఈ విధమైన వైరుధ్యం ఏ మాత్రం లేకపోతే మీలో పరివర్తన తీసుకురాగల రావడానికి సర్వోత్కృష్టమైన శక్తి మీలో నిండివుంటుంది ఇపుడు ప్రశ్న, పరిశీలకుడు - పరిశీలించేవాని మధ్య, అనుభవించేవాడు - అనుభవముల మధ్య, ప్రేమ - ద్వేషాల మధ్య వైరుధ్యం లేకుండా వుండటం సాధ్యమేనా? - ఈ రకమైన ద్వంద్వాలు లేకుండా జీవించడం సాధ్యమేనా? ఒక్క వాస్తవం మాత్రమే వుండి, మరింకేమీ లేకుండావుంటే, అది సాధ్యమే. మీరు ద్వేషిస్తున్నారనేది వాస్తవం, హింసాపరుణ్ణిఅనేది వాస్తవం,

మీరు భయపడినపుడు, తద్వ్యతిరేకమైన ధైర్యాన్ని కూడగట్టుకుంటే, భయాన్ని ప్రతిఘటిస్తున్నారన్న మాటే దానితోనే వైరుధ్యం ప్రారంభమైంది, ప్రయత్నం జరిగింది తద్వారా ఒత్తిడి కలిగింది అలాకాక, భయాన్ని సంపూర్తిగా అర్థం చేసుకుంటే. భయానికి వ్యతిరేకమైన దాని వద్దకు పారిపోకుండా, భయం పైననే మీ యావత్తు శ్రద్ధనూ నిలిపితే, మానసికంగా ఆ భయం అంతమైపోవడమే కాక, దాని నెదుర్కొనడానికి అవసరమైన శక్తి మీలో ఉంటుంది సంప్రదాయవాదులు, 'మీకు శక్తి అత్యంత ఆవశ్యకం కనుక, శృంగారం వైపు, ప్రాపంచిక సుఖాలవైపు విముఖులవండి ఏ వ్యామోహానికీ గురికావద్దు ఏకాగ్రచిత్తులవండి దైవం వైపు మనసుని లగ్నం చేయండి ప్రపంచాన్ని త్యజించండి, వ్యామోహాలకు గురికావద్దు' అంటారు - ఇదంతా ఆ శక్తిని కలిగి ఉండడానికే కానీ, మనిషి మానవమాత్రుడు కాబట్టి, శృంగార సంబంధమైన, దైహికపరమైన వాంఛలులోన దహించి వేస్తూనే వుంటాయి అయితే, వాటినన్నిటినీ బలవంతంగా అణిచిపెట్టడం, అదుపులో ఉంచడం వంటివి చేస్తూ, సతమతమౌతూ వుంటాడు - దానివల్ల శక్తి వృథా అవుతుంటుంది అయితే, మీరు, మరేదీ, లేకుండా, వాస్తవంతోనే జీవిస్తూంటే - 'మీలో ఆగ్రహం జనిస్తే, దానినే అర్థం చేసుకుంటూ, 'ఆగ్రహం లేకుండా ఉండటమెలా' అనే ఊహ లేకుండా, ఆగ్రహంతోనే వుంటూ, దానిలోకి వెళ్ళి, దానితోనే జీవిస్తూ, దానిపైనే మీ

పూర్తి సావధానతను నిలిపితే - అపుడు మీకీ శక్తి పుష్కలంగా వున్నదని మీరే గ్రహిస్తారు ఈ శక్తే మీ మనసుని సుస్పష్టంగా చేస్తుంది మీ హృదయ కవాటాన్ని తెరుస్తుంది కాబట్టి, అక్కడ ప్రేమ సమృద్ధిగా వుంటుంది - భావాలు, భావోద్వేగాలు కావు

**ప్రశ్న: తన్మయత్వమంటే ఏమిటి? మీరు దానిని వర్ణించగలరా? తన్మయత్వం సుఖంకాదనీ, ప్రేమ సుఖం కాదనీ మీరన్నారే?**

**కృష్ణమూర్తి:** తన్మయత్వమంటే ఏమిటి? మీరొక మబ్బునీ, ఆ మబ్బులో మెరిసే కాంతినీ చూచినపుడు, అందులో అందం ఉన్నది సౌందర్యం అంటే గాఢాభినివేశమే ఆ మేఘ సౌందర్యాన్నీ లేక ఆ వృక్షం పై ప్రసరించే ఆ వెలుగు సౌందర్యాన్నీ చూచుటకు, గాఢాభినివేశం ఉండాలి తీక్షణత ఉండాలి ఈ తీక్షణతలో, ఈ గాఢాభినివేశంలో భావోద్వేగమే మాత్రం లేదు, ఇష్టాయిష్టాలకు తావులేదు తన్మయత్వమనేది వ్యక్తిగతం కాదు ప్రేమ అనేది మీకు కానీ, నాకు కానీ చెందనట్లే, తన్మయత్వమనేది కూడ మీదీ, నాదీ కాదు సుఖమనేది ఉన్నపుడు, అది మీదో, నాదో అయివుంటుంది మనసు ధ్యానమగ్నమైనపుడు, దానికి తనదైన తన్మయత్వం ఉంటుంది దానిని, మనం నిర్వచించలేము పదాలలో పెట్టలేము

**ప్రశ్న: మంచి, చెడు అనేవి లేవనీ, అన్ని ప్రతిక్రియలు మంచివేననీ మీరు అంటున్నారా? అదేనా మీరనేది?**

**కృష్ణమూర్తి:** లేదండీ, నేనలా చెప్పలేదు నేనన్నదల్లా, మీలో కలిగే ప్రతిక్రియలకు మంచి - చెడు అనే పేర్లు పెట్టకుండా పరిశీలించమంటున్నాను మీరు వాటిని, మంచి అనీ, చెడు అనీ, పేర్లు పెట్టడంతోటే వైరుధ్యాన్ని తీసుకువస్తున్నారన్న మాట మీరు మీ భార్యవంక, ఎప్పుడైనా చూశారా? ఇదే ప్రశ్నను, పదే పదే అంటున్నందుకు క్షమించండి - ముప్పై ఏళ్ళకు పైబడిన సాన్నిహిత్యంలో మీరామెపై ఏర్పర్చుకున్న మనోచిత్రంతో నిమిత్తం లేకుండా, ఆమెను చూశారా? మీకు ఆమెపై ఒక మనోచిత్రం ఉంది ఆమెకు మీపై ఒక మనోచిత్రం ఉంది, ఈ మనోచిత్రాల మధ్యే సంబంధం ఉన్నది కానీ, మీకూ - ఆమెకూ మధ్య సంబంధం లేదు మీ బాంధవ్యంలో మీరు సావధానతలో వుండనందువల్లనే, ఈ మనోచిత్రాలు ఏర్పడుతున్నాయి - సావధానత లోపించినందువల్లనే, మనోచిత్రాలు రూపొందుతున్నాయి మీరు మీ భార్యను నిందించకుండా, ఆమెది ఒప్పు అనీ, తప్పు అనీ అనకుండా, మీ పూర్వాభిప్రాయాలతో నిమిత్తం లేకుండా కేవలం ఆమెను మాత్రం పరిశీలించగలరా? అపుడు, ఆ పరిశీలనలో నుంచి పూర్తిగా విభిన్నమైన చర్య ఆవిర్భవిస్తుందని మీరే గ్రహిస్తారు

*పారిస్, ఏప్రిల్ 24, 1969*

# 1. హింస

## హింస అంటే ఏమిటి? 'మానసిక హింస' మూలంపై మరొకటి విధించుట. పరిశీలన యొక్క ఆవశ్యకత - సావధాన రాహిత్యం.

**కృష్ణమూర్తి:** ఈ చర్చల యొక్క ఉద్దేశం సృజనాత్మకమైన పరిశీలన-సంభాషిస్తున్న సమయంలోనే మనల్ని మనం సృజనాత్మకంగా గమనించుకొనుట మనం చర్చించదల్చుకున్న విషయమేదైనా, అందులో అందరమూ అరమరికలు లేకుండా పాల్గొనాలి-అవతలివారి తెలివి తక్కువనుకానీ, తెలివినికానీ, మోటుగా, మొరటుగా ప్రస్తావించరాదు అయితే, మనలో ప్రతి ఒక్కరం, ఆ ప్రత్యేకాంశాన్నీ, అందులో ఉన్న సమస్తాన్నీ చర్చించడంలో పాలుపంచుకోవాలి మనం తరచి చూస్తున్న అంశంలోగానీ, మన భావనల్నిగానీ వివరిస్తున్నపుడు అక్కడ నూతనమైనదేదో స్ఫురించినట్లుండాలి. అదే సృజనాత్మకత అంటే, పాతవాటిని వల్లె వేయడంకాదు మనల్ని మనం కనుగొంటూ, కనుగొన్నదానిని పదాలలో వ్యక్తీకరిస్తున్నపుడు, ఆ నూతనమైనది ప్రకటితమవాలి అపుడే ఈ చర్చలు ఫలప్రదమైనట్లు భావిస్తాను

**ప్రశ్న (1): శక్తి అనే అంశాన్ని మరింతలోతుకు వెళ్ళి, ఆశక్తి ఎలా వృధా అవుతుంటుందో చూద్దామా?**

**ప్రశ్న (2): మీరు హింసను గురించి మాట్లాడుతూ వచ్చారు; యుద్ధంలో జరిగే హింస, తోటిమనుష్యులతో మనం వ్యవహరించేతీరులో హింస, వారిని గురించి ఎలా ఆలోచిస్తున్నాము, ఎలా చూస్తున్నాము అనే వాటిలోని హింసను ప్రస్తావించారు. మరి స్వీయరక్షణార్థం జరిపే హింస మాటేమిటి? నన్ను ఒక తోడేలు ఎదుర్కొన్నప్పుడు, నాయావచ్ఛక్తినీ వినియోగించి రక్షించుకుంటాను. మనలో ఒకభాగం హింసతో ఉండడం, మరొక భాగంలో హింసలేకపోవడం సాధ్యమేనా?**

**కృష్ణమూర్తి:** హింసను గురించి ఒక సూచన చేయబడింది, సమాజానికి చెందిన ఒక ప్రత్యేకమైన నమూనానో, నీతినో అనుసరించడంవల్ల మనల్ని మనం వక్రీకరించుకోవడం, అయితే అందులో స్వీయరక్షణార్థం చేసే హింసమాట ఏమిటని అంటున్నారు స్వీయరక్షణకై, కొన్ని సందర్భాలలో ఆవశ్యకమైన హింసకూ, ఇతరరకాల హింసకూ మధ్య,గీటు ఎక్కడగీయాలి? మీరావిషయం గురించి చర్చించాలనుకుంటున్నారా?

**శ్రోతలు:** అవునండీ

కృష్ణమూర్తి: మొట్టమొదట, వివిధ రూపాలలో, ప్రకటితమయే మానసిక హింసను గురించి చర్చించి, తర్వాత మనపైదాడి జరిగినప్పుడు, స్వీయరక్షణకున్న స్థానమేమిటో చూద్దాం హింస అంటే మీకు ఏమనిపిస్తోంది?

ప్ర (1): అది ఒక రకమైన రక్షణ.

ప్ర (2): నా సుఖశాంతుల కది భంగం కలిగిస్తుంది.

కృష్ణమూర్తి: హింస, హింసించాలనే భావం, హింస అనేపదం, హింస యొక్క స్వభావం - ఈ పదాలు మీకెలా అర్థమౌతున్నాయి

ప్ర (1): అది దౌర్జన్యం.

ప్ర (2): వైఫల్యంచెందినపుడు, మీరు హింసాపూరితులౌతారు.

ప్ర (3): తాననుకున్నది చేయనశక్తుడైనపుడు, మనిషిలో హింస బయలుదేరుతుంది.

ప్ర (4): తట్టుకోలేనపుడు కలిగేద్వేషం.

కృష్ణమూర్తి: హింస అంటే మీకేమనిపిస్తోంది

ప్ర (1): నేను అనేది ప్రవేశించినపుడు, ప్రమాదవ్యక్తీకరణ.

ప్ర (2): భయం.

ప్ర (3): మీలో హింస ప్రవర్తిల్లినపుడు ఎవరికైనా, దేనికైనా, మానసికంగానో, దైహికంగానో గాయపరచడం ఖాయం.

కృష్ణమూర్తి: మీకు అహింస తెలుసు కాబట్టి, హింస అంటే ఇదీ, అని తెలుసుకుంటున్నారా? తద్వ్యతిరేకమైనది లేనపుడు కూడా మీకు హింస అనేది తెలుస్తుందా? అహింసాస్థితులు ఎలా ఉంటాయనేది మీకు తెలుసుకాబట్టి, అందుచేత హింసను గుర్తిస్తున్నారా? మీకు ఈ హింస అంటే, ఎలా తెలిసింది మనిషి దౌర్జన్యపరుడైనందువల్ల, పోటీలు పడుతున్నందువల్ల, తత్ఫలితాన్నంతా చూశాడు కాబట్టి - అనగా హింసాధోరణిని-అతడు ఒక అహింసా స్థితిని భావనచేస్తాడు అసలు వ్యతిరేకమైనదే లేనపుడు, హింస అనేది ఏమిటో తెలుస్తుందా?

ప్ర: నేను దానికి ఒక పేరుపెట్టనుకానీ, నాలో ఏదో ఒక భావం మెదుల్తుంది.

కృష్ణమూర్తి: అలాంటి భావం స్వతఃసిద్ధమా లేక మీకు హింస అంటే తెలుసు కాబట్టి అది జనిస్తున్నదా?

ప్ర: హింస మనకు బాధ కలిగిస్తున్నదనుకుంటాను; పైగా అది అనారోగ్యకరమైన భావం కాబట్టి దానిని మేము వదిలించుకోవాలనుకున్నాం, అందుచేతనే మేము అహింసాపరుల మవాలనుకుంటున్నాము.

కృష్ణమూర్తి: నాకు హింసనుగురించి ఏమీతెలియదు, అహింసనుగురించీ తెలియదు. నేను ఏరకమైన భావంతోనూ, సూత్రంతోనూ ప్రారంభించను నాకు హింస అంటే ఏమిటో నిజంగా తెలియదు నేను కనుక్కోవాలి.

ప్ర: గాయపడినపుడు, దాడి సల్పబడినపుడు కలిగిన ఆ అనుభవం, మనిషిని స్వీయరక్షణకు పురికొల్పుతుంది.

కృష్ణమూర్తి: అవును, అదినాకు అర్థమైంది, అది ఇంతకు ముందే సూచింపబడ్డది కానీ,

నేను ఇప్పటికీ హింస అంటే ఏమిటో కనుగొనాలనే ప్రయత్నిస్తున్నాను. నేను దానిని పరిశోధించాలి, పరిశీలించాలి, దానిని పెళ్ళగించిచూడాలి, మార్చివేయాలి- బోధపడ్తున్నదా?

**ప్ర: ప్రేమ రాహిత్యమే హింస.**

**కృష్ణమూర్తి:** ప్రేమ అంటే, ఏమిటో మీకు తెలుసా?

**ప్ర: ఇవన్నీ మననుంచే పుట్టుకువస్తున్నవని అనుకుంటాను-**

**కృష్ణమూర్తి:** అవును, సరిగ్గా అదే.

**ప్ర: హింస మననుంచే పుట్టుకువస్తుంది.**

**కృష్ణమూర్తి:** సరిగ్గా చెప్పారు అది బాహ్యంనుంచి వస్తున్నదా, లోపల్నుంచి వస్తున్నదా అనేది నేను కనుక్కోవాలి.

**ప్ర: రక్షణకు అదొక రూపం.**

**కృష్ణమూర్తి:** మెల్లగా సాగుదాం, ఆగండి ఇది అత్యంత గంభీరమైన సమస్య, మొత్తం ప్రపంచం దీనితో ముడిపడి ఉన్నది

**ప్ర: హింస, నాశక్తిలో కొంతభాగాన్ని వ్యర్థం చేస్తోంది.**

**కృష్ణమూర్తి:** ప్రతివారు హింసనుగురించీ, అహింసనుగురించీ మాట్లాడారు మనుష్యులు, 'మనం హింసాయుతంగానే జీవించాలీ' అంటుంటారు, దాని ఫలితాన్ని చవి చూసిన తర్వాత, 'మనం శాంతియుతంగానే జీవించాలీ' అంటారు. గ్రంధాలనుంచీ, బోధకులనుంచీ, విద్యావేత్తలనుంచీ, తదితరులనుంచీ మనమెన్నో విషయాలను విన్నాం, కానీ నేను హింసయొక్క స్వరూపాన్ని స్వయంగా కనుగొనడం సాధ్యమేనా, జీవితంలో దానికున్న స్థానం-అదేమైనప్పటకీ-కనుగొనదల్చుకున్నాను. మనిషిని హింసాపరునిగా, దౌర్జన్యపూరితునిగా, అత్యాశాపరునిగా, పోటీదారునిగా తయారుచేస్తున్నదేమటి? ఒక నమూనాని-అది ఎంత ఉదాత్తమైనదైనా- అనుసరించడంలోనే హింస యిమిడి ఉన్నది ఒక క్రమశిక్షణను తనపైతాను విధించుకున్నా, లేక సమాజం విధించినా, హింస అందులో భాగమా? హింస, మనిషిలోపలా, బయటా ఉండే ఘర్షణేనా? హింసకు మూలం, మొదలు ఏమిటి, అని కనుగొనదల్చుకున్నాను, లేని పక్షంలో నేను కేవలం అనేక పదాలను అల్లినట్లవుతుంది మానసికభావపరిధిలో హింస ఉండటం సహజమా! (దైహిక-మానసిక స్థితిగతులగురించి తర్వాత విచారణ చేద్దాం) అంతరంగంలోని హింస-దౌర్జన్యమా, ఆగ్రహమా, ద్వేషమా, ఘర్షణా, అణచివేతా, అనువర్తించడమా? ఇక ఈ అనువర్తించడానికి మూలం-తానేదో కనుగొనాలని, సాధించాలని, ఏదో అవాలని, ఎక్కడికోచేరాలని, తనని తాను తెలుసుకోవాలని, ఉత్తముడి నవాలని

ఇదంతా మానసికరంగంలోనే జరుగుతున్నది మనం ఇందులోకి చొచ్చుకుపోనట్లయితే, మన నిత్యజీవితంలో ఓ భిన్న స్థితిని-దానిలో ఒకింతస్వీయరక్షణ ఆవశ్యకత ఉండనే వుంటుంది-ఎలా తీసుకురావడమనే విషయం అర్థం చేసుకోలేము. అవునా? అందుచేత మనం, అక్కడినుంచి మొదలు పెడదాం.

ఏది హింస అని మీరు భావిస్తున్నారు-పదాలలోకాదు, అంతరంగంలో, యదార్థంలో?

**ప్ర (1): అది దేనినో ఉల్లంఘిస్తున్నది; మరిదేనినో విధిస్తున్నది.**

**ప్ర (2): తిరస్కరించడం మాటేమిటి?**

**కృష్ణమూర్తి:** ముందు 'ఉన్నస్థితి'పై మరొకటి విధించుట అనేవిషయంతీసుకుందాం నేను 'అసూయ'తో ఉన్నాను దానిపై అసూయ ఉండరాదనే భావాన్ని తెచ్చి పెడుతున్నాను 'నాకు అసూయ ఉండకూడదు' ఈ విధంగా ఉన్నదానిని ఉల్లంఘించి, దానిపై వేరొకదానిని విధించడం హింసే మనం కొద్ది కొద్దిగా ప్రారంభిద్దాం, బహుశా ఆ ఒక్క వాక్యంలోనే మొత్తం విషయం ఇమడవచ్చు 'ఉన్నస్థితి' ఎప్పుడూ కదిలిపోతూనే వుంటుంది అది స్థిరంగా ఉండదు నాఊహలో 'ఉండాలనుకున్నదానిని' తెచ్చి దీనిపై విధించి, దానికి భంగం కలిగిస్తున్నాను

**ప్ర: నాకు ఆగ్రహం కలిగినపుడు, ఆగ్రహించకూడదని తలచి, ఆగ్రహించేబదులు దానిని వెనక్కిలాగి పట్టుకోమనా, మీ భావం? అది హింస అవుతుందా? లేక నా ఆగ్రహాన్ని వ్యక్తం చేయడం హింస అవుతుందా!**

**కృష్ణమూర్తి:** ఇందులో ఏమున్నదోచూడండి, నాకు కోపం వచ్చింది వచ్చినకోపాన్ని వెళ్ళగ్రక్కేందుకు మిమ్మల్ని కొట్టాను అది అనేకానేక ప్రతిచర్యల్ని గొలుసుకట్టువలె తీసుకువచ్చింది అందువల్ల మీరు నన్ను తిరిగికొట్టారు ఆ విధంగా కోపాన్ని వ్యక్తీకరించడం హింసే నాలో వాస్తవంగా ఉన్న ఆగ్రహంపైన, మరొకటి అనగా, 'ఆగ్రహం ఉండకూడదన్న భావాన్ని విధిస్తే' అది కూడ హింసే కదా?

**ప్ర: సర్వసాధారణమైన ఆ నిర్వచనంతో నేనూ ఏకీభవిస్తానుకానీ, లేనిదానిని తెచ్చి మీదపెట్టడమన్నది మరీ కర్కశంగా జరిగినప్పుడే అది హింస అనిపించుకుంటుంది. కానీ, క్రమేణా ప్రవేశపెడితే అప్పుడు అది హింస, అనిపించుకోదు.**

**కృష్ణమూర్తి:** నాకర్థమైనదండీ, ఇలా విధించడమనేదాన్ని మృదువుగా, నేర్పుగా ప్రవేశపెడితే, అపుడది హింసకాదంటారు నాలో ద్వేషం రగులుతుండగా ద్వేషమనే ఆ వాస్తవాన్ని క్రమక్రమంగా, సున్నితంగా, అణచిపెడుతూ భంగం చేయడమనేది, హింసకాదు, అంటున్నారాయన. కానీ, మీరు హింసాపూరితంగా చేసినా, మృదువుగా చేసినా, యదార్థమేమంటే 'ఉన్నదాని'పైన వేరొకదానిని తెచ్చి విధిస్తున్నారు కొంతవరకు మనం దీనికి అంగీకరించినట్లేనా?

**ప్ర: లేదు.**

**కృష్ణమూర్తి:** మనం దీనిని పరీక్షించిచూద్దాం. ఈ ప్రపంచంలో నాకు గొప్ప కవీశ్వరుణ్ణి అవాలి అనే బలీయమైన కోరిక ఉన్నది (మరేదైనాకానీ) అలాకాలేకపోవడం వల్ల విఫలుణ్ణయాను. ఈ వైఫల్యం, ఈ ఆకాంక్షాపరత్వం నేనేదైతే కాదో, ఆ వాస్తవానికి వ్యతిరేకంగా జరిపేహింస, మీరునాకన్నా మెరుగ్గా ఉన్నందువల్ల నాకు నిస్పృహ ఇది హింసను పెంచదా?

ప్ర: ఒక వ్యక్తి ఎడలగానీ, ఒక విషయం ఎడలగానీ వ్యతిరేకంగా చేసే ఏ చర్యఐనా, హింసే.

**కృష్ణమూర్తి:** దయచేసి, ఇందులో యిమిడి ఉన్న ఇబ్బంది ఏమిటో చూడండి అక్కడ ఒక వాస్తవం ఉన్నది మరో చర్య ద్వారా ఆ వాస్తవానికి భంగం కలగచేశాము ఉదాహరణకు నాకు రష్యన్లన్నా, జర్మన్లు అన్నా అమెరికనులు అన్నా యిష్టం లేదు ఆ నా అభిప్రాయాన్నీ, లేక రాజకీయపరమైన నా అంచనానీ వారిపై విధించాను అదోరకమైన హింస మీపై నేనేదైనా విధిస్తే అది హింస నన్ను, మీతో పోల్చుకుంటే, (మీరు చాలా గొప్పవారనీ, చాలా తెలివైనవారనీ) నన్ను నేనే ఉల్లంఘించుకుంటున్నా నన్నమాట – కాదా? నేను హింసాపూరితుణ్ణే స్కూలులో 'బి' అనే విద్యార్థిని 'ఎ' అనే విద్యార్థితో పోల్చారు, పరీక్షలు బాగా వ్రాసి కృతార్థుడైన 'ఎ' అనే విద్యార్థితో 'బి'ని పోల్చి, టీచరు 'నువ్వు 'ఎ'లాగా ఉండాలి' అన్నారు, ఆ విధంగా టీచరు 'బి'ని 'ఎ'తో పోల్చడంలో హింస ఉన్నది దానివల్ల 'బి'ని నాశనం చేయడం కూడా జరిగింది ఈ వాస్తవంలో ఏమి యిమిడి ఉన్నదోచూడండి, 'ఉన్నస్థితి'పైన 'ఉండాలనుకున్న దానిని' (అనగా ఆదర్శం, సమగ్రత్వం, మనోచిత్రం) వగైరాలను విధించినపుడు హింసించడం జరిగింది

ప్ర (1): నాకు ఏమనిపిస్తోందంటే, ఎక్కడ ఏ ప్రతిఘటన ఉన్నా, ధ్వంసం చేసేది ఉన్నా హింస ప్రవేశిస్తుంది; మీరు ప్రతిఘటించకుండా ఊరుకుంటేనూ, మిమ్మల్ని మీరు ఉల్లంఘించుకున్నట్లే అవ్వచ్చు.

ప్ర (2): ఇదంతాకూడ, 'స్వ' లేక 'నేను'తోనే కదా మనం వ్యవహరిస్తున్నది, అదేకదా హింసకు మూలం?

ప్ర (3): మీమాటే తీసుకుంటే, ఎలావుంటుందో చూద్దాం. మీరు ఎవరినో ద్వేషిస్తున్నారు అనుకోండి; ఆద్వేషాన్ని తొలగించుకోవాలనుకుంటారు. దీనికి రెండు పరిష్కారమార్గా లున్నాయి; ఒకటి హింసామార్గం. రెండవది అహింసావిధానం. మీలోని ఆద్వేషాన్ని తొలిగించే నిమిత్తం, మీరు మీ ఉనికిపైనే, వేరొకదానిని, విధించే ప్రయత్నంలో మిమ్మల్ని మీరు హింసించుకుంటారు. అందుకు బదులుగా మీద్వేషానికి గురైన ఆ వస్తువునీ, దాని ఎడల మీకు గల భావాలనీ అర్థం చేసుకునే నిమిత్తం, కొంత వ్యవధి తీసుకుని శ్రమిస్తే, ఆ వ్యవధిలో క్రమేణా మీరు ఆద్వేషాన్ని అధిగమిస్తారు. అప్పుడు మీరీ సమస్యను అహింసా మార్గంలో పరిష్కరించినట్లవుతుంది.

**కృష్ణమూర్తి:** సర్, మీరు చెప్పింది స్పష్టంగానే ఉన్నది కానీ, ప్రస్తుతం మనం హింసను తుదముట్టించేందుకు, హింసామార్గాన్ని అవలంబించాలా లేక, అహింసావిధానాన్ని అవలంబించాలా అని ప్రయత్నించడం లేదు మనలో ఈ హింసను జనింప చేస్తున్నదేమిటో కనుగొంటున్నాం మనలో మానసికపరంగా ఈ హింస అంటే ఏమిటి?

ప్ర: ఒక వాస్తవంపై వేరొకటి విధించడంలో దేనినో బ్రద్దలు కొట్టినట్లు అవుతుందిగదా? అపుడు మనిషి అసౌఖ్యానికి గురై మరింత హింసాపరుడౌతాడు.

**కృష్ణమూర్తి:** మనిషికి తన అభిప్రాయాలు గానీ, తన జీవన సరళిగానీ బ్రద్ధలైనపుడు, అది అసుఖాన్ని కలిగిస్తుంది ఆ అసుఖం హింసకు కారణం అవుతుంది

**ప్ర (1): హింస బాహ్యం నుంచీ రావచ్చు, లోపలినుంచీ రావచ్చు. సాధారణంగా, ఈ హింస బాహ్యం నుంచే బయలుదేరిందని, నేను దానినే తప్పుపడతాను.**

**ప్ర (2): హింసకు మూలం మనల్ని మనం ముక్కలు చేసుకున్నదానిఫలితమా?**

**కృష్ణమూర్తి:** దయచేసి వినండి హింస అంటే ఇది అని ఎన్నో విధాలుగా చూపించవచ్చు, ఎన్నో కారణాలను చెప్పవచ్చు ఒక చిన్న సరళమైన వాస్తవాన్ని తీసుకుని, అక్కడినుంచి మెల్లెగా మొదలు పెట్టవచ్చు గదా! ఏ రకమైనది దేనిపై విధించినా- పిల్లవానిపై తండ్రి, తండ్రిపై పిల్లవాడు, శిష్యునిపై గురువు, మనిషిపైన సమాజమూ లేక మతగురువు విధించేవన్నీ హింస యొక్క రూపాలేగదా! దీనిపై అంగీకారం కుదిరినట్లేగదా! అక్కడినుండి ప్రారంభిద్దామా?

**ప్ర: అది బాహ్యం నుంచే వస్తున్నది.**

**కృష్ణమూర్తి:** బాహ్యం లోనే కాదు, లోనకూడ మనం అదే చేస్తాం నాలో, 'నేను కోపంగా ఉన్నానని' గ్రహించాను దానిపై 'నేను కోపంగా ఉండకూడదు' అనే భావాన్ని విధిస్తాను మేము దానిని హింస అంటున్నాము బాహ్యంలో, ఒక నియంత తన ప్రజలను అణగ దొక్కుతుంటాడు, అది హింస నేను భావిస్తున్నదానిని భయం వల్ల అణగ దొక్కుతుంటాను - ఎందుకంటే, అది ఉదాత్తం కాదు కాబట్టి, స్వచ్ఛం కాదు కాబట్టి మరేవో కారణాలవల్ల దానిని అణగదొక్కితే, అది కూడ హింసే వాస్తవంగా "ఉన్నదానిని" అంగీకరించనందువల్లనే, ఈ రకంగా విధించడం జరుగుతున్నది నేను 'అసూయాపరుణ్ణి' అనే వాస్తవాన్ని అంగీకరించి, దానిని ప్రతిఘటించకపోతే, అప్పుడిక విధించడ మనేదే ఉండదు అప్పుడు దానితో నేనేమి చేయాలనేది నాకు తెలుస్తుంది అందులో హింసకు తావులేదు.

**ప్ర: విద్యావిధానంకూడ హింసేనని మీరంటారు.**

**కృష్ణమూర్తి:** అవును, అంటున్నాను హింస లేకుండా విద్యగరపలేమా?

**ప్ర: సంప్రదాయం ప్రకారమైతే లేదు.**

**కృష్ణమూర్తి:** సమస్య ఏమంటే, స్వభావరీత్యా నాలో హింస ఉన్నది

నా ఆలోచనల్లోనూ, నేను జీవించే తీరులోనూ, నేనొక హింసాపూరితుడనైన మనిషిని-దౌర్జన్యంతో, పోటీలతో, క్రూరత్వంతో, అలాంటివే మరికొన్ని- అదంతానేను ఇక ఇప్పుడు, 'నేను మరోలా ఎలా జీవించాలీ అనుకుంటాను. ఎందుకంటే, ఈ హింసాధోరణి, ప్రపంచంలో విపరీతమైన వైరాన్ని, విధ్వంసాన్ని పెంచుతున్నవి కాబట్టి, నాకు దానినర్థం చేసుకుని, దానినుంచి విడివడి, తద్భిన్నంగా జీవించాలని ఉంది అందుకని నన్ను నేను, 'నాలో ఈహింస అనేది ఏమిటి? అని ప్రశ్నించుకున్నాను దీనికి వైఫల్యం కారణమా? కీర్తిమంతుణ్ణి అవాలనుకుని, కాలేనని తెలుసుకున్నందువల్ల కీర్తిమంతులైన వారిని ద్వేషిస్తున్నానా? నేను అసూయాపరుణ్ణి, కానీ అసూయలేకుండా ఉండాలనివున్నది అందువల్ల ఈ అసూయా స్థితిని - ఇందులో ఉండే ఆందోళన,

భయం, చిరాకులను అసహ్యించు కుంటున్నాను. కనుక దానిని అణిచేస్తాను ఇదంతాచేసి, ఇదీ ఒక రకమైన హింసేనని గ్రహించాను ఇదంతా అనివార్యమా అని నేనిపుడు కనుగొన దల్చుకున్నాను, లేక దానిని అర్థం చేసుకోవడం, దానితో వ్యవహరించడం చేసి, మరో విధానమేమైనా ఉంటే దానిని కనుగొన్నప్పుడే నేను మరోరకంగా జీవించగలను కనుక, ఈ హింస అంటే ఏమిటో నేను కనుగొనకతప్పదు

ప్ర: అది ఒక ప్రతిక్రియ.

కృష్ణమూర్తి: మీకు మరీతొందరరండీ! అది నాహింసాస్వభావాన్ని అర్థం చేసుకోవడంలో తోడ్పడుతుందా? నేనందులోకి వెళ్ళాలి, కనుక్కోవాలి ఈద్వైదీభావమున్నంతవరకూ- అనగా హింస, అహింసలున్నంతవరకు-ఘర్షణతప్పదు అందువల్ల హింసపెరగకా తప్పదు నేను మందమతిని అనే వాస్తవం పైన నేను తెలివిగా ఉండాలీ అనే భావాన్ని మోపినంతకాలం హింస ప్రారంభమైనట్లే నాకంటే చాలా అధికులైన మీతో నన్ను పోల్చుకుంటే, అది కూడ హింసే పోల్చడం, అణిచిపెట్టడం, అదిమిపెట్టడం-అవన్నీ ఒకరకమైన హింసనే సూచిస్తాయి నేనలా తయారుకాబడ్డాను-నేను పోల్చుకుంటాను అణిచిపెడతాను. ఆకాంక్షాపరత్వంతో ఉన్నాను అది గ్రహించినపుడు నేను అహింసాయుతంగా ఎలా జీవించాలి! అందుకని ఈ రకమైన పోరులేని జీవితవిధానాన్ని కనుక్కోవాలనుకుంటున్నాను

ప్ర: వాస్తవాన్ని వ్యతిరేకిస్తున్నది, 'నేను' లేక 'స్వ'యేగదా?

కృష్ణమూర్తి: మనం దానివద్దకే వస్తున్నాం వాస్తవాన్ని చూడండి, మొదట జరుగుతున్నదేమిటో చూడండి నామొత్తం జీవితం, విద్యనేర్వనారంభించినప్పటినుంచీ, నేటివరకూ ఒక రకమైన హింసే నేను జీవిస్తున్నసమాజమే ఓ హింసారూపం సమాజం నన్ను అనుసరించమనీ, ఆమోదించమనీ, ఇదిచేయమనీ, అదిచేయకూడదనీ అంటుంది నేను అది చెప్పినట్లే చేశాను అదోరకమైన హింస నేను సమాజంపై తిరుగుబాటుచేస్తే అది కూడా ఒక రకమైన హింసే తిరుగుబాటు అంటే, సమాజం ఆమోదించిన విలువలను నేను అంగీకరించకపోవడమే, నేను దానిపై తిరుగుబాటు జరిపి నాస్వంతవిలువలను నేనే సృష్టించుకుంటాను. అవి ఒక నమూనాగా తయారవుతాయి ఆ నమూనాని ఇతరులపైనగానీ, నాపైనగానీ విధిస్తుంటాను అది ఇంకొక విధమైన హింసగా తయారవుతుంది నేనారకమైన జీవితాన్ని జీవిస్తుంటాను అనగా నేను హింసాపరుణ్ణి. మరినేనిపుడేం చేయాలి?

ప్ర: మొదట, మిమ్మల్ని మీరు అడగవలసిన ప్రశ్న ఏమంటే ఇక ముందు మీరు 'హింసాపరుడిగా ఉండకూడదని' ఎందుకనుకుంటున్నారు అని-

కృష్ణమూర్తి: ఎందుకంటే, నేటి ఈ ప్రపంచంలో హింస ఏమేమి చేసిందో చూశాను కాబట్టి, బాహ్యంలో యుద్ధాలు, అంతరంగంలో ఘర్షణలు, సంబంధబాంధవ్యాలలో సంఘర్షణలు, వస్తుగతంగానూ, లోలోననూ, సాగే ఈ పోరుని చూచినపుడు, దీనికి భిన్నంగా వేరే జీవితవిధానం ఒకటి ఉండే వుంటుందని భావిస్తున్నాను

ప్ర: ఈ పరిస్థితులు మీకెందుకు యిష్టం లేకుండా పోయినవి?

కృష్ణమూర్తి: అవి చాలా వినాశకరంగా ఉన్నవి

**ప్ర: అంటే, దాని అర్థం, మీ అంతటమీరు, ఇప్పటికే 'ప్రేమ'కు అత్యంత విలువ నిచ్చేశారన్నమాట.**

**కృష్ణమూర్తి:** నేను దేనికీ ఏ విలువాయివ్వలేదు, నేను కేవలం పరిశీలిస్తున్నాను

**ప్ర: మీకు అయిష్టమేర్పడినప్పుడు, విలువ నాపాదించడం మొదలెట్టారన్నమాట.**

**కృష్ణమూర్తి:** నేను విలువలనాపాదించడం లేదు, పరిశీలిస్తున్నాను యుద్ధం వినాశకరమని గ్రహించాను

**ప్ర: అందులో ఉండే తప్పు ఏమిటి?**

**కృష్ణమూర్తి:** అది ఒప్పు అనిగానీ, తప్పు అనిగానీ నేననడం లేదు

**ప్ర: మరి దానిని మీరు ఎందుకు మార్చాలనుకుంటున్నారు?**

**కృష్ణమూర్తి:** దానిని మార్చాలనుకోవడానికి కారణం, యుద్ధరంగంలో నాకుమారుడు చనిపోవచ్చు కాబట్టి అందుచేత 'ఒకరిని ఒకరు చంపుకోకుండా జీవించే విధానం ఏమీలేదా' అని అడుగుతున్నాను

**ప్ర: మీరు అనుకుంటున్నది. ఓ భిన్న జీవిత విధానాన్ని ప్రయోగాత్మకంగా చేసి చూసి, అటుపైన ఆ కొత్తవిధానాన్ని, ఇపుడు సాగిపోతున్నదానితో పోల్చిచూడడం.**

**కృష్ణమూర్తి:** లేదండీ, నేను పోల్చను. నేను దీనినంతా వ్యక్తీకరించాను నాకుమారుడు యుద్ధంలో చనిపోవచ్చునని భావించినందువల్ల, ఇంకొక జీవిత విధానమేదీ లేదా అని అడుగుతున్నాను అసలు హింసే ఉత్పన్నమవని జీవిత విధానం ఉన్నదా అని కనిపెట్టాలనుకుంటున్నాను

**ప్ర: ఒక వేళయిలాగనుకుంటే.......**

**కృష్ణమూర్తి:** అనుకోవడమేమీలేదండీ, నాకుమారుడు చనిపోవచ్చు కాబట్టి, ఇతర్ల కుమారులు కూడ చంపబడకుండా ఉండే ఒక జీవిత విధానాన్ని కనుగొనాలనుకుంటున్నాను

**ప్ర: కనుక, మీరు రెండు సాధ్యాలమధ్య, ఇదో, అదో, ఏదో ఒకటి కావాలంటున్నారు.**

**కృష్ణమూర్తి:** పన్నెండు రకాల సాధ్యాలుంటాయి

**ప్ర: భిన్నజీవిత విధానం కొరకు మీరు పడే తపన ఎంతగాఢంగా ఉన్నదంటే – మీరు మరో మార్గాన్ని అవలంబించాలనుకుంటున్నారు – అది ఏమైనాకానీ. దానిని ప్రయోగాత్మకంగా చేసి, దీనితో పోల్చాలంటున్నారు.**

**కృష్ణమూర్తి:** లేదండీ నేను ఇంకా స్పష్టపరచనిదానిని, దేనినో గురించి మీరు పట్టుపడుతున్నట్లు నాకు తోస్తున్నది

ఇప్పుడు ఉన్న జీవిత విధానాన్ని అందులోని హింస వగైరాలతో ఉన్నది ఉన్నట్లుగా అంగీకరించడమైనా చేయాలి; లేదంటే, మానవుని తెలివితో కనుగొనగలిగిన, హింసారహితమైన భిన్నజీవన మార్గం ఉండే వుంటుందని మేము చెప్తున్నాము అంతే ఇకపోతే, పోల్చుకొనటం, అణిచిపెట్టటం, అనుసరించటం, ఒక నమూనా ప్రకారం తనను తాను ఓ క్రమశిక్షణకు లోనుచేసుకోవటం–ఇవే కనుక జీవన విధానమైతే, హింస

ఉంటూనే వుంటుందని మేమంటున్నాం ఇందులో ఘర్షణ ఉన్నది, అందువల్ల హింస కూడా ఉంటుంది

ప్ర: అయోమయమనేది ఎందుకు జనిస్తుంటుంది? అది 'నేను' అనేదాని చుట్టూ సృష్టింపబడింది కాదా?

కృష్ణమూర్తి: మనం దానివద్దకే వస్తాం (ఆగండి )

ప్ర: హింసకు అట్టడుగున ఉండే ఆ పదార్థం, ఆ మూలం, ఆ సారమే నిజానికి మనల్ని ప్రభావితపరుస్తున్నది. మనం ఇక్కడ జీవిస్తున్న దానిఫలితంగా, మిగతా ఉనికిని ప్రభావితం చేస్తున్నాం. నేను ఇక్కడ ఉన్నాను. నేను గాలిని పీల్చినందువల్ల, గాలిలోని జీవరాశికి హాని కలిగిస్తున్నాను. కనుక, హింసయొక్క సారసంగ్రహమంతా పరస్పరం ప్రభావితం చేసుకోవడంలోనే ఉన్నదని నేను నమ్ముతున్నాను. ఇది సృష్టిలోనే, అంతర్భూతమై ఉన్నది. ఇలా ప్రభావితం చేసుకునే సమయంలో, ఒక దానికి ఒకటి పొసగనపుడు, శ్రుతికలవనపుడు, దానిని హింస అంటున్నాం. దానితో మనకు శ్రుతి కలిసినట్లయితే అప్పుడు అది హింసకు అవతలి ప్రక్కన ఉంటుంది – కానీ, అప్పటికీ, అది ప్రభావితం చేస్తూనే వుంటుంది. ఒకటి మరొక దానిపై వ్యతిరేక ప్రభావం చూపితే, అనగా భంగం వాటిల్లచేస్తుంటే, రెండవది అనుకూలంగా ప్రభావితం చేస్తుంటుంది.

కృష్ణమూర్తి: సర్, నేను ఒకమాట అడుగవచ్చా! హింస అనే అంశంలో మీకు శ్రద్ధ ఉన్నదా? హింస అనే చర్చలో మీరు పాల్గొంటున్నారా? మీలోని హింసను, ప్రపంచంలోని హింసను చూసి, చింతించి, 'నేను ఈవిధంగా జీవించలేను' అనిపించేటంతగా మీకు శ్రద్ధ ఉన్నదా?

ప్ర: మనం హింసపై తిరగబడినపుడు, మనం ఒక సమస్యని సృష్టిస్తున్నాం; ఎందుకంటే, ఎదురు తిరగడమే హింస కాబట్టి.

కృష్ణమూర్తి: నాకర్థమైందండీ, అయితే ఈ విషయంలో ముందుకు సాగడం ఎట్లా?

ప్ర: సమాజంతో నేను ఏకీభవించను. దాని భావాలపై తిరుగుబాటు చేస్తాను. అనగా ధనము, సమర్థత మొదలైనవాటిపై ఎదురు తిరగడం – అదీ నేనవలంబించే హింసారూపం.

కృష్ణమూర్తి: అలాగే, నాకర్థమైంది నేటి సంస్కృతి, విద్య మొదలైన వాటిపై తిరుగుబాటు చేయడం కూడ హింసే

ప్ర: నాలోని హింసను నేనలా చూస్తున్నాను.

కృష్ణమూర్తి: అయితే, మీరు దానిని ఏంచేస్తారండీ? మనం చర్చించదల్చుకున్న విషయమదే

ప్ర: అదే నేనూ తెలుసుకోవాలనుకుంటున్నాను.

కృష్ణమూర్తి: నేనూ అదే తెలుసుకోవాలని అనుకుంటున్నాను అందుచేత, మనం దీనికే కట్టుబడదాం

ప్ర: ఏ వ్యక్తితోనైనా నాకోసమస్య ఏర్పడితే అదినాకు స్పష్టంగానే అర్థం అవుతుంది. అలాగే నేనెవరినైనా ద్వేషిస్తుంటే నాకు అదీ బాగానే తెలుస్తుంది; అపుడు నేను దానికి ప్రతిస్పందిస్తాను. కానీ, సమాజం విషయంలో మాత్రం ఇది సాధ్యంకాదు.

కృష్ణమూర్తి: ఈ విషయమే తీసుకుందాం నేటి సమాజనైతిక వ్యవస్థపై నేను తిరుగుబాటు చేశాను నిజమైన నీతి ఏమిటో కనుగొనకుండా కేవలం అలా ఆ నైతిక వ్యవస్థపై తిరుగుబాటు చేయడంలో హింస ఉన్నదని గ్రహించాను నిజమైన నీతి అంటే ఏమిటి? నేను దానిని కనుగొని, ఆ విధంగా జీవిస్తే తప్ప, కేవలం సమాజనైతిక వ్యవస్థపై తిరుగుబాటు సల్పడమనే దానికి అర్థం లేదు

ప్ర: సర్, మీరు దానిని జీవించనపుడు, హింస అంటే మీకుతెలియదు.

కృష్ణమూర్తి: ఓ, అలాగా! అవతలిది నాకర్థమవాలంటే, ముందునేను హింసామార్గంలో జీవించక తప్పదంటారా?

ప్ర: నిజమైన నీతిని అర్థంచేసుకోవాలంటే, దానిని జీవించాలని మీరన్నారు గదా! 'ప్రేమ' అంటే ఏమిటో తెలుసుకోవాలంటే మీరు హింసాపూరితంగా జీవించాలి.

కృష్ణమూర్తి: నేను ఆవిధంగా జీవించాలని మీరు చెప్తుంటే. మీరు 'ప్రేమ' అంటే ఏమిటో మీరు భావించేదానిని నాపై ఇప్పటికే మోపుతున్నారన్నమాట

ప్ర: మీమాటల్ని మీకే అప్పగిస్తున్నామన్నమాట.

కృష్ణమూర్తి: సర్, సమాజనీతి ఎంత అసంబద్ధంగా ఉన్నదో చూశాను కాబట్టి, నేను దానిపై తిరుగుబాటు చేశాను, హింస ప్రవర్తిల్లని నిజమైననీతి ఏది?

ప్ర: నిజమైన నీతి హింసను అదుపులో పెడుతుంది గదా? అందరిలోనూ హింస ఉండనే వుంటుంది. మనుష్యులు, ఉత్తమశ్రేణికి చెందినవారిగా పరిగణించబడేవారు దానిని అదుపులో పెట్టుకుంటారు. ప్రకృతిలో హింస ఎపుడూ వుంటూనే వుంటుంది. పెనుతుఫానులో, లేక ఒక వన్యమృగం మరొక మృగాన్ని చంపడంలో, చనిపోతున్న ఆ వృక్షంలో అంతటా హింస ఉన్నది.

కృష్ణమూర్తి: హింస అనేది పైస్థాయిలోనూ జరుగుతుండవచ్చు, బహు సూక్ష్మంగా అతి సూక్ష్మంగా కనిపించీ కనిపించకుండానూ సాగుతుండవచ్చు అమిత కర్కశమైన హింసకూడ ఉన్నది అది చిన్నదైనా, పెద్దదైనా, మొత్తం జీవితం హింసామయమే హింసాత్మకమైన ఈ మొత్తం నిర్మాణాన్నుంచి అడుగుబయట పెట్టడం ఎలాగ అని కనుగొనదల్చుకుంటే, దానిలోకి వెళ్ళి చూడాలి. ప్రస్తుతం మన ప్రయత్నమదే

ప్ర: సర్, 'అందులోకి వెళ్ళి చూడాలి' అంటే మీ అర్థమేమిటి?

కృష్ణమూర్తి: 'దానిలోనికి వెళ్ళుట' అంటే 'ఉన్నస్థితిని' ముందుగా పరీక్షించాలి, పరిశోధించాలి అలా పరిశోధించడానికి, పూర్వాభిప్రాయాలనుండి, అంతకుమునుపే చేసుకున్న నిర్ణయాలనుండి, స్వేచ్ఛవుండాలి ఇప్పుడు ఆ స్వేచ్ఛతో, నేను హింస అనే సమస్యవంక చూస్తాను 'దానిలోనికి వెళ్ళుట' అంటే ఇదే

ప్ర: అప్పుడు ఏదైనా సంభవిస్తుందా?

కృష్ణమూర్తి: లేదు, ఏమీ సంభవించదు.

ప్ర: **యుద్ధానికి నా ప్రతిస్పందన ఏమిటి అని చూస్తే, 'నాకు యుద్ధం చేయాలని లేదు....కానీ నిజానికి నేచేస్తున్నదేమంటే, దానికి దూరంగా ఉండడానికి ప్రయత్నించడం, మరో దేశంలో నివసించడం, లేదా నాకు ఇష్టం లేని మనుషులనుండి దూరంగా వెళ్ళిపోవడం. ముఖ్యంగా అమెరికన్ సమాజాన్నుండి, ఎడంగా ఉండిపోతుంటాను.**

**కృష్ణమూర్తి:** ఆమె అంటున్నదేమంటే, 'నేను హింసకు వ్యతిరేకంగా ప్రదర్శనచేసే, నిరసన తెలిపే ఉద్యమకారిణిని కాదు', కానీ ఇదంతా ఉన్న ఈ దేశంలో మాత్రం నేను నివసించజాలను, నాకు ఇష్టంలేని మనుషుల మధ్యనుండి దూరంగా పోతాను" అని, ఇదంతా కూడా హింసారూపమే దయచేసి దీనిపై ఒకింత ధ్యాస ఉంచండి మన మనసులను ఈ విషయంపై లగ్నంచేసి, అర్థం చేసుకుందాం రాజకీయ, మత, ఆర్థిక రంగాలలో మనుషుల ప్రవర్తనా సరళిని–అందులో హింస ఎక్కువో, తక్కువో వున్నదని – చూచి, ఆ వలలో చిక్కుకుపోయాననీ, అది తాను సృష్టించినదేననీ గ్రహించిన మనిషి ఏం చేస్తాడు?

ప్ర: **అసలక్కడహింసేలేదనీ, ఆలోచన మూలకంగా అది ఉన్నట్లు కన్పిస్తున్నదని నేను సూచించవచ్చా?**

**కృష్ణమూర్తి:** ఓహో! నేనెవరినో చంపి, ఆ తర్వాత దాన్ని గురించి ఆలోచించినందువల్లనే అది హింస అవుతున్నదంటారా? లేదండీ, మనం పదాలతో ఆడుకుంటున్నాం విషయంలోకి మరికాస్తముందుకు పోదామా? మానసికంగా నేను నాపై ఒక భావాన్నో, ఒక నిర్ణయాన్నో మోపినపుడు అది హింసను పెంచుతుంది ఇప్పటికి ఈ విషయమొక్కటే తీసుకుందాం నాలో క్రౌర్యమున్నది–వాగ్రూపంలోనూ, భావరూపంలోనూ 'క్రౌర్యం పనికిరాదన్న భావాన్ని దానిపై విధిస్తున్నాను, అది ఓ రకమైన హింస అని గ్రహించాను నాలోని ఈ క్రూరస్వభావంపైన వేరొకటి తెచ్చిపెట్టకుండా, నాలోని క్రౌర్యంతో ఎలా వ్యవహరించాలి? దానిని అణచిపెట్టకుండా, దానినుంచి పారిపోకుండా, తప్పించుకోకుండా, దాని స్థానంలో మరొకటి తెచ్చిపెట్టకుండా నేను దానిని అర్థం చేసుకోగలనా? ఇక్కడ ఓ వాస్తవం ఉన్నది – నేను క్రూరుణ్ణి ఇది నాకు ఒక సమస్య అయింది ఎంత వివరించి చెప్పినా, మీరిలావుండాలనీ, ఉండకూడదనీ చెప్పినా అది పరిష్కరింపబడదు ఇది నన్నెంతో బాధిస్తున్నది నేను దీనిని పరిష్కరించితీరాలి, ఎందుకంటే, దీనికి భిన్న జీవిత విధానమేదో ఉండే ఉంటుంది అని నాకు అనిపిస్తున్నది కనుక, 'నేను ఈ క్రూర స్వభావాన్నుంచి ఘర్షణారహితంగా బయటపడడమెలా?' అని ప్రశ్నించుకుంటున్నాను. క్రౌర్యాన్నుండి బయట పడేందుకు నేను ప్రయత్నించిన మరుక్షణమందే, ఘర్షణను ప్రవేశపెట్టడం, దానితో పాటే హింసను తీసుకురావడం జరిగింది కనుక, ఘర్షణలో ఏమేమి ఇమిడి వున్నవో, ముందునేను స్పష్టంచేసుకోవాలి నేను ఏ క్రౌర్యాన్నుండి విడివడ దల్చుకున్నానో ఆక్రౌర్యం విషయంలో ఘర్షణచెలరేగితే – ఆ ఘర్షణలో నుంచే హింస ఉత్పన్నమౌతుందని తెలిసింది – ఘర్షణతో నిమిత్తం లేకుండా నేనీ క్రౌర్యాన్నుంచి ఎలా విడివడగలను?

ప్ర: దాన్ని అంగీకరించడమే.

కృష్ణమూర్తి: మన క్రూర స్వభావాన్ని అంగీకరించడమంటే మీ అర్థం ఏమిటోనాకు తెలియడం లేదు అదిగో, అది అక్కడ ఉన్నది, నేను దానిని అంగీకరించడంకానీ తిరస్కరించడంగానీ చేయడం లేదు అంగీకరించమని చెప్పడంలోని ప్రయోజనమేమిటి? నా చర్మం గోధుమరంగులో ఉన్నది, అనేది ఒక వాస్తవం - అదంతే నేను దానిని అంగీకరించడం కానీ తిరస్కరించడం గానీ, ఎందుకు? నేను క్రూరుణ్ణి అనేది వాస్తవం

**ప్ర: నేను క్రూరుణ్ణి అని చూచినపుడు దాని నంగీకరిస్తాను, అర్థం చేసుకుంటాను. అయితే క్రూరంగా వ్యవహరించడానికి, దానితో ఉండడానికి భయపడతాను.**

కృష్ణమూర్తి: అవును, 'నేను క్రూరుణ్ణి' అని అన్నాను కానీ నేను దాని నంగీకరించడం లేదు, తిరస్కరించమూలేదు అది ఒక వాస్తవం ఆ క్రౌర్యాన్ని వదిలించుకోవాలనుకున్నపుడు దానితో ఘర్షణ ఘర్షణ ఉన్నచోట హింస జనించడం ఇంకొక వాస్తవం కనుక నేను రెండిటితో వ్యవహరించాలి హింస, క్రౌర్యం; ఇక ప్రయత్నరహితంగా దానిని వదిలించుకోవడం నేను ఏమిచేయాలి? నా జీవితమంతా పెనుగులాట, పోరాటం

**ప్ర: ఇక్కడ ప్రశ్న, హింసను గురించి కాదు, మనోచిత్రం సృష్టించటమనేది ఇప్పటి ప్రశ్న.**

కృష్ణమూర్తి: ఆమనోచిత్రం, విధించబడుతున్నది, లేదా 'ఉన్నస్థితి'పైన మనిషి ఆ మనోచిత్రాన్ని మోపుతున్నాడు - అంతేనా?

**ప్ర: మనిషికి తన నిజమైన ఆస్తిత్వాన్ని గురించి తెలియకపోవడం వల్ల జరుగుతున్నది.**

కృష్ణమూర్తి: నిజమైన అస్తిత్వమంటే మీ అర్థమేమిటో నాకు సరిగా తెలియడం లేదు

**ప్ర: నాఅర్థమిది. మనిషి ప్రపంచం నుండి విడివడిలేదు, మనిషే ప్రపంచం. అందువల్ల బాహ్యంలో జరుగుతున్న హింసకంతా అతడే బాధ్యుడు.**

కృష్ణమూర్తి: అవును, నిజమైన అస్తిత్వం అనగా - మనిషే ప్రపంచం, ప్రపంచమే మనిషనే విషయం గుర్తించడమనీ, అలాగే క్రౌర్యం, హింస అనేది కూడా వేరుగా లేవు, అవి అతడిలో భాగాలేనని వారంటున్నారు సర్, అదేనామీరంటున్నది?

**ప్ర: కాదు, అజ్ఞానంలో భాగమంటున్నాను.**

కృష్ణమూర్తి: అంటే మీరు నిజమైన అస్తిత్వం అనేదొకటి, అజ్ఞానమనేదొకటి ఉన్నవంటున్నారా? ఉన్నవి రెండు స్థితులు అనగా నిజమైన అస్తిత్వం, అది అజ్ఞానంచే ఆవరింపబడివుండడం, ఎందువల్ల? ఇది ప్రాచీన హిందూసిద్ధాంతం నిజమైన అస్తిత్వం ఒకటి ఉన్నదనీ, అది భ్రాంతిచేత, అజ్ఞానంచేత ఆవరింపబడివున్నదనీ, మీకెలాతెలిసింది?

**ప్ర: మనకేర్పడిన సమస్యలన్నీ వ్యతిరిక్తరూపాలనుండే వస్తున్నవని గ్రహిస్తే, అన్ని సమస్యలూ అంతరించిపోతాయి.**

కృష్ణమూర్తి: మనిషి చేయవలసిందంతా తన ఆలోచనల్లో వ్యతిరేకాలు లేకుండా ఉండడమే అంటారు మనం అదిచేస్తున్నామా లేక అది కేవలం ఒక ఊహేనా?

ప్ర: సర్, ఈ ద్వైదీభావమనేది ఆలోచనలో స్వతఃసిద్ధం కాదా?

**కృష్ణమూర్తి:** మనం విచారణలో ఒక దశవరకూ వచ్చి మళ్లీ దాని నుండి మరలిపోతుంటాం నేను క్రూరుణ్ణి అని నాకు తెలుసు - వివిధ మానసిక కారణాల వల్ల అది ఒక వాస్తవం ప్రయత్నరహితంగా, నేనీ గుణాన్నుండి విడివడడమెలా?

ప్ర: ప్రయత్న రహితంగా అని మీరనడంలోని అర్థమేమిటి?

**కృష్ణమూర్తి:** ప్రయత్నమంటే ఏమిటో నేనింతకుముందే వివరించాను నేను దేనినైనా అణచిపెట్టినపుడు, అందులో ప్రయత్నముంటుంది-అంటే భావవైరుధ్యం క్రూరత్వం, క్రూరంగా ఉండరాదనే కోరిక 'ఉన్నస్థితికీ', "ఉండాలనుకునే స్థితికి" మధ్యఘర్షణ

ప్ర: నేను దానిని నిజంగా చూచినట్లయితే, నేను క్రూరంగా వుండజాలను.

**కృష్ణమూర్తి:** నేను అది కనుక్కోవాలి, రూఢిగా పలికే వాక్యాల నంగీకరించడంకాదు క్రౌర్యం నుండి స్వేచ్ఛ పొందడం అసలు సాధ్యమా అని నేను కనుగొనాలను కుంటున్నాను దాని నణచిపెట్టకుండానూ, దానినుండి పారిపోకుండానూ, బలవంతం చేయకుండానూ దానినుండి విముక్తి చెందడం సాధ్యమేనా? మనషి ఏమి చేయాలి?

ప్ర: దానిని బహిర్గతం చేయడమనేది ఒక్కటే మార్గం.

**కృష్ణమూర్తి:** దానిని బహిర్గతం చేయడానికి దానిని వెలికి రానివ్వాలి - అది తనని తాను ప్రదర్శించుకోనివ్వాలి - దాని అర్థం, మరింత క్రూరంగా అవాలని కాదు దానిని నేనెందుకు బైటికి రానివ్వడం లేదు? మొదటిది - దానిని చూస్తే నాకు భయం తీరా, నేను దానిని బయటికి రానిస్తే, నేను మరింత క్రూరుణ్ణవుతానేమో, నాకు తెలియదు అదీకాక దానిని బయల్పరచినప్పుడు, దాని నర్థం చేసుకోగలిగివున్నానా? నేను దానిని అత్యంత జాగరూకతతో, అనగా సావధానుడనై, చూడగలనా? అది బహిర్గతం అయిన క్షణంలో, నాశక్తీ, ఆసక్తీ, నా ఆత్రుత కలిసినపుడే ఆ పని చేయగలను ఈ క్షణాన నాకిది అర్థమవాలి అనే వేగిరపాటు ఉండాలి, ఏ విధమైన వక్రీకరణలేని మనసూ వుండాలి, చూడడానికి నాలో బ్రహ్మాండమైన శక్తి వుండాలి ఆ క్రౌర్యం బహిర్గత మయ్యే క్షణాన్నే ఈ మూడూ అప్పటికప్పుడు సంభవించాలి దాని అర్థం, ఈ ముఖ్యప్రాణశక్తీ, తీక్షణతా, సావధానత కలిగి ఉంటానికి అవసరమైనంత సున్నితత్వమూ, స్వేచ్ఛ కలిగి వున్నానన్నమాట అంతటి తీక్షణతతో కూడిన సావధానత నాలో ఎలా ఏర్పడుతుంది? అది నాకెలా తటస్థపడాలి?

ప్ర: అది అర్థం కాకపోతే నేనిక తట్టుకోలేను అనేదశకు వచ్చినప్పుడే మనకీ సావధానత ఏర్పడుతుంది.

**కృష్ణమూర్తి:** నాఁకర్థమయింది నేనంటున్నదల్లా, సావధానుడనై వుండడం సాధ్యమా? కాస్త ఆగండి, దీనిలోని చిక్కులేమిటో, ఇందులో ఏమేమియిమిడి ఉన్నవో చూడండి అంతాలు చెప్పవద్దు కొత్త రకపు పదాల్ని తీసుకురావద్దు

ఇక్కడనేను ఉన్నాను 'నాకు సావధానత అంటే ఏమిటో తెలియదు. జీవితంలో అధికభాగం సావధానరహితంగానే వుండిపోయాను కాబట్టి, బహుశ నేను ఎప్పుడూ, దేనియెడలా సావధానతతో వుండివుండను హఠాత్తుగా మీరు నావద్దకువచ్చి చూడు,

నీ క్రూర స్వభావం యెడల సావధానుడివై వుండు అన్నారు నేను, 'అలాగే' నన్నాను-కానీ దాని అర్థమేమిటి? నేను ఈ సావధానతాస్థితిని ఎలా తెచ్చుకోవాలి? దీనికేమైనా ఒక పద్ధతి ఉన్నదా? పద్ధతి ఉండి, సావధానుణ్ణి అవడానికి సాధన చేయాలంటే, కాలం కావాల్సి వుంటుంది ఆ విరామ కాలంలో నేను సావధానతా లేమిలోనే కొనసాగు తుంటాను, ఆవిధంగా మరింత విధ్వంసాన్ని తెస్తుంటాను అందువల్ల ఇదంతా తక్షణం జరగాలి నేను క్రూరుణ్ణి, దానిని అణచి పెట్టను దాన్నుంచి తప్పించుకోను దీని అర్థం 'తప్పించుకోనని' పట్టుదల పూనాను అనికాదు, దానిని అణచనని నిశ్చయించుకున్నాననీ కాదు కానీ అణచిపెట్టడం, అదుపు చేయడం, తప్పించుకు తిరగడం వంటి చర్యలు సమస్యను పరిష్కరించలేవు, అనే విషయాన్ని చూశాను, తెలివిగా అర్థం చేసుకున్నాను, అందువల్ల వాటన్నిటినీ పక్కకు పెట్టేశాను, అణచివేత, తప్పించుకొనుట, అధిగమించే యత్నం చేయుటవంటి చర్యలయొక్క నిష్ఫలత్వాన్ని అర్థం చేసుకున్నందువల్ల, నాకీతెలివి పుట్టుకొచ్చింది ఈ తెలివితో నేను క్రౌర్యాన్ని పరీక్షిస్తున్నాను, పరికిస్తున్నాను దానిని వీక్షించడానికి నేనత్యంత సావధానుడినై ఉండవలసి వుంటుందని గ్రహించాను, ఆ సావధానతలో ఉండటానికి, నేను నా సావధానతాలేమిని గురించి చాలా జాగ్రత్తగా వుండాలి అందువల్ల ఇపుడు నా శ్రద్ధ అంతా నా సావధానతా లేమినిగురించిన ఎరుకమీదనే దాని అర్థమేమిటి? అనగా, నేను గనుక సావధానతను సాధన చేయ బూనుకుంటే, అది యాంత్రికమవుతుంది, తెలివి తక్కువ అవుతుంది, అర్థముండదు అలాకాక నేను సావధానుడినై వున్నా, నా సావధానతాలేమిని గమనించినా, అప్పుడు నా సావధానత ఎలా పుట్టుకొస్తుందో నాకు తెలియనారంభిస్తుంది ఇతరుల మనోభావాల పట్ల, నేను మాట్లాడేతీరు, భుజించేతీరు పట్ల, మనుష్యులు పలికే పలుకులు, చేతల పట్ల, నేనింత అసావధానుణ్ణై ఎందుకున్నాను? నకారాత్మక స్థితిని అర్థం చేసుకున్నానంటే, సకారాత్మక స్థితి, అనగా సావధానత వద్దకు, చేరగలను కనుక నేను, ఈ అసావధానత ఎలా పుట్టుకొచ్చింది అని అర్థం చేసుకోడానికి, దీనిని పరీక్షిస్తున్నాను

ఇది చాలా గంభీరమైన విషయం - మొత్తం ప్రపంచం దగ్ధమైపోతున్నది కాబట్టి, నేను ఆప్రపంచంలో భాగమైనప్పుడు, ఆప్రపంచం నేనే అయినప్పుడు-నేనా అగ్గిని అంతమొందించాలి కాబట్టి మనము ఈ సమస్యవద్ద ఆగిపోయాం, ఎందుకంటే ఈ ప్రపంచంలోని అల్లకల్లోలానికి సావధానత లేకపోవడమే కారణం ఇక్కడ మనకో వింత వాస్తవం కనిపిస్తుంది-సావధానతారాహిత్యమే నకారాత్మక స్థితి, అనగా ఆక్షణంలో అక్కడ ఉండకపోవడం సావధానతాలేమి, సావధానతగా మారేటంత సంపూర్ణమైన ఎరుకతో ఉండటం సాధ్యమా? నాలోని ఈ క్రౌర్యాన్ని, పూర్తిగా, ఇప్పటికిప్పుడు, గొప్పశక్తితో-అంటే ఒరిపిడి, వైరుధ్యం లేకుండా ఉన్నందువల్ల కలిగే సంపూర్ణశక్తితో, దానిని నేనెలా తెలుసుకోవాలి? నేను దీనినెలా తేగలను? సంపూర్ణ సావధానతతో నున్నప్పుడే అది సాధ్యమవగలదని మేమన్నాం, అట్టి సంపూర్ణ సావధానత ఉండకపోవడానికి కారణం మన జీవన శక్తినంతా సావధానతాలేమిలో వెచ్చిస్తూ వృధాపరుచుకోడంవల్లనే

*సానెన్, స్విట్జర్లాండ్, ఆగస్టు3,1969*

# 2. సమూలమైన మార్పు

## చూచే ఆ పరికరం ఏమిటి?

**కృష్ణమూర్తి:** లోలోన మనిషి మారలేదు మనం మాట్లాడుతున్నది, మనిషిలో సంభవించాల్సిన సమూల విప్లవం గురించే కానీ, అతని పాత ప్రవర్తనావళిపై, మరో నూతన విధానాన్ని విధించడం కాదు మనలో, మన మనసులో ప్రస్తుతం ప్రవర్తిల్లుతున్న దానిలో మౌలికంగా రావలసిన మార్పుని గురించే మనకు శ్రద్ధ ఇంతకుముందు చెప్పుకున్నట్లు ఈ ప్రపంచమూ, మనమూ భిన్నం కాదు, ప్రపంచమే మనం, మనమే ప్రపంచం కనుక, మన ఉనికికి మూలంలోనే, ఓ విప్లవం, ఓ పరివర్తన, ఓ ఉత్పరివర్తనం-పదం ఏది వాడామన్నది ముఖ్యం కాదు-దానినెలాతీసుకురావాలన్నదే మనం ఈ చర్చలలో ప్రస్తావించదల్చుకున్నది.

నిన్న మనం వేసుకున్న ప్రశ్న ఏవిధమైన వక్రీకరణాలేకుండా, మనిషి తననుతాను స్పష్టంగా చూడగలడా-వక్రీకరణ అంటే, మనసులో, విలువకట్టాలి, తీర్పుచెప్పాలి దేనినో సాధించాలి, 'ఉన్నదాని'ని వదిలించుకోవాలి, అనే కోరికలు ప్రవర్తిల్లడం అవన్నీ స్పష్టంగా గ్రహించనివ్వవు మనిషిని, 'ఉన్నస్థితి'ని సరిగ్గా, సన్నిహితంగా, చూడటంలో ఆటంకం కలిగిస్తాయి కనుక, మనమీ ఉదయం పరిశీలన యొక్క స్వరూపాన్నీ, పరికించే విధానాన్నీ, వినుట, చూచుట గురించి కలిసి మాట్లాడుకోవటంలోను చర్చించుకొనడంలోను కొంత సమయం వెచ్చిద్దామా? ఈవిధంగా చూడటం, మన ఉనికిలో ఏదో ఒక భాగంతో కాకుండా, అనగా కంటితోనో, మేధతోనో, భావోద్వేగంతోనో కాక, మొత్తంతో చూడటం సాధ్యమేమోకనుగొనాలి దానికి అత్యంత సమీపంగా, ఏ రకమైన వక్రీకరణ లేకుండా చూడడం సాధ్యమా? దీనిని తరచి చూడటమెంతైనా ప్రయోజనకరం చూచుట అంటే, ఏమిటి? మనల్ని, మనలోని మౌలిక వాస్తవాన్ని చూడగలమా?-అనగా, దురాశ, ద్వేషం, ఆందోళన, భయం, కాపట్యం, మోసం, ఆకాంక్షాపరత్వం-అన్నిటినీ ఏరకమైన వక్రీకరణ లేకుండా కేవలం గమనిస్తూవుండగలమా?

మనం, ఈ ఉదయం చూడటమంటే, ఏమిటో, నేర్చుకొనుటకు ప్రయత్నిద్దామా? నేర్చుకోవడమనేదొక నిరంతర చలనం, నిరంతర నవ్యత్వం 'కొంతవరకు నేర్చుకుని' ఆ స్థాయినుంచి చూడటం కాదు చెప్పిన మాటల్ని విన్నందువల్ల, మనల్ని మనం కొద్దిగా గమనించుకున్నందువల్ల, ఏదో నేర్చుకుంటాం, ఏదో అనుభూతిని పొందుతాం; అలా నేర్చుకున్నదానిని, పొందిన అనుభవాన్ని ఆధారంచేసుకుని చూస్తాం, పూర్వం నేర్చిన దాని స్మృతితోనూ, పూర్వానుభవ స్మృతితోనూ చూస్తాం, మనసులోని జ్ఞప్తితో చూస్తాం

అందువల్ల అది చూడటమూ కాదు, నేర్వడమూ కాదు నేర్చుకొనుట అంటే, ప్రతిసారి మనసు కొత్తగా నేర్చుకుంటుందని అర్థం కనుక అది నేర్చుకొనే నిమిత్తం, ఎప్పుడూ తాజాగా వుంటుంది మన శ్రద్ధ, జ్ఞాపకశక్తిని పెంచుకోవడంలో లేదు, యదార్థంగా జరుగుతున్నదేమిటో పరిశీలించటంలోనే, చూడటంలోనే ఉన్నదని గుర్తుంచుకోండి మనం చూచినది కానీ, నేర్చినది కానీ స్మృతిగా మారి, వక్రీకరించబడుతుంది కనుక, అది స్మృతిగా అవకుండా ఉండుటకుగాను, మనం అప్రమత్తంగా, అత్యంత సావధానులమై ఉండటానికి ప్రయత్నిద్దాం ప్రతిసారి, ఇదే మొదటిసారి అన్నట్లుచూడాలి. 'ఉన్నస్థితి'ని ఒక జ్ఞప్తితో చూసినా, పరిశీలించినా, ఆ జ్ఞప్తి మన పరిశీలనను నిర్దేశిస్తుంది, రూపుమారుస్తుంది. మార్గం చూపుతుంది కనుక అది అప్పటికే వక్రీకరించబడింది మనమిక్కడినుంచి ముందుకి పోదామా? పరిశీలించుట అంటే ఏమిటో కనుగొనదల్చుకున్నాము శాస్త్రజ్ఞుడు మైక్రోస్కోపు ద్వారా దేనినైనా తన కత్యంత సమీపంగా చూడవచ్చు, పరిశీలించవచ్చు, బాహ్యంలో ఓ వస్తువున్నది, అతను చూడదల్చిన ఆ వస్తువుని గురించి అతనికి కొంత జ్ఞానం ఉన్నప్పటికీ, అతడు దానిని ఆ పూర్వాభిప్రాయం లేకుండా చూస్తాడు కానీ, ఇక్కడ మనం, ఈ మొత్తం నిర్మాణాన్ని, ఈ మొత్తం జీవిత చలనాన్నీ, ఈ మొత్తం ఉనికినీ, అనగా 'నాసమస్తాన్ని' చూస్తున్నాను దానిని, మేధతోనో, భావోద్వేగంతోనో, తప్పొప్పుల గురించి చేసుకున్న నిర్ణయాలతోనో, "ఇదిలా ఉండాలి" లేక "ఉండకూడదు" అనే భావంతోనోకాకుండా చూడాలి కనుక, మనం దానిని సన్నిహితంగా చూచే లోపలే, మనలో సాగిపోయేదీ, మన పరిశీలనను ఆటంకపరిచేది అయిన ఈ క్రియాకలాపం అనగా విలువకట్టడం, తీర్పుచెప్పడం, తీర్మానాలు చేస్తూవుండడమనే వాటి విషయంలో ఎఱుక గలిగి వుండాలి

ఇప్పుడు మనచింత, చూపును గురించికాదు, అది దేనితో చూస్తున్నదో దానిని గురించి చూస్తున్న ఆ పరికరం మరకలు పడివున్నదా, వక్రీకరించబడిందా, హింసించబడిందా, భారంగా ఉన్నదా? ఇప్పుడిక చూడటం ముఖ్యం కాదు, చూస్తున్న పరికరం మీరే కనుక, మిమ్మల్ని మీరు పరిశీలించుకొనుటే ముఖ్యం నేనిప్పటికే, ఒక తీర్మానం చేసుకుని, మాటవరసకి, జాతీయతనే తీసుకోండి, (అది ఆటవిక జాతులవారి వేర్పాటు ధోరణి) ఆ జాతికి చెందిన భావాలతో తీవ్రంగా నిబద్ధింపబడినట్లయితే, బలీయమైన పూర్వాభిప్రాయాలతో చూస్తాననేది స్పష్టం, అందువల్ల నేను స్పష్టంగా చూడలేను లేక, అసలు చూడటానికే నేను భయపడినట్లయితే, అది వక్రీకరించబడిన చూపు అనేది తేటతెల్లం అంతేకాక, నేను జ్ఞానోదయాన్నో ఉన్నతపదవినో, మరిదేనినో కాంక్షిస్తుంటే, అది కూడ గ్రహించడంలో స్పష్టతను నిరోధిస్తుంది అదంతా తెలుసుకోవాలి, చూస్తున్న పరికరం గురించి, దాని శుభ్రతను గురించి మనిషి తెలుసుకు తీరాలి

**ప్రశ్న: పరికరాన్ని చూసి, అది పరిశుభ్రంగా లేదని కనుగొన్న మనిషి, ఆ తర్వాత ఏం చేయాలి?**

**కృష్ణమూర్తి:** చెప్తున్న దానిని జాగ్రత్తగా వినండి 'ఉన్నస్థితి'ని పరిశీలించమని చెప్పాము మౌలికంగా ఉన్న అహంభావ, స్వార్థపూరిత కార్యకలాపాలను, ఆ ప్రతిఘటిస్తున్న

దానిని, వైఫల్యం చెందుతున్న దానిని, ఆగ్రహిస్తున్న దానిని - ఆ మొత్తాన్నీ పరిశీలించమన్నాం అటుపైన, పరిశీలిస్తున్న పరికరాన్ని గమనించమన్నాం, ఆ పరికరం పరిశుభ్రంగా ఉన్నదో, లేదో కనుగొనమన్నాం ఇపుడు మనం వాస్తవంనుంచి, చూడబోతున్న పరికరం వద్దకు వచ్చాం పరికరం యొక్క పరిశుభ్రతను గురించి పరీక్షించి అది పరిశుభ్రంగా లేదని కనుగొన్నాం ఇప్పుడు మనం చేయవలసిందేమిటి? మన తెలివి పదునెక్కుతున్నది ఇంతకు ముందు నాశ్రద్ధ యావత్తూ, ఆ వాస్తవాన్ని, ఆ 'ఉన్నస్థితి'ని మాత్రమే పరిశీలించటంలో ఉన్నది దానిని గమనిస్తూనే ఉన్నాను, ఇపుడు దాని నుంచి దూరం జరిగి, నేనిక చూస్తున్న పరికరం పరిశుభ్రంగా ఉన్నదా, లేదా అని గమనించాలి అన్నాను అలా అనుకోవడంలోనే ఒక తెలివి ఉన్నది - ఇదంతా మీకు బోధపడ్తున్నదా? అందువల్ల, తెలివిపదునవుతున్నది, మనసు, మెదడూకూడ చురుకైనాయి

**ప్రశ్న: అంటే, చేతనలో ఒకస్థాయిలో విభజనా లేదు, నిబద్ధతా లేదు అనా దీనర్థం?**

**కృష్ణమూర్తి:**దానర్థమేమిటో నాకు తెలియదు నేను కొద్దికొద్దిగా కదులుతున్నాను ఈ చలనం తునాతునకలైన చలనం కాదు అవిచ్ఛిన్నమైనది ఇంతకు ముందు, నేను చూస్తున్నపుడు, నాలో తెలివిలేదు అపుడు నేనిలా అనేవాణ్ణి 'దీనిని మార్చాలి' లేక 'మార్చకూడదు', 'ఇది మంచి' 'ఇది చెడు', 'ఇది ఇలా ఉండాలి' లేక 'ఉండకూడదు' అని అంటుండేవాణ్ణి ఆ రకమైన తీర్మానాలతో నేను చూసినపుడు ఏమీ సంభవించలేదు ఇప్పుడు నేను గ్రహించిందేమంటే, చూడాల్నంటే, చూచే పరికరం అసాధారణమైన పరిశుభ్రతతో ఉండాలని కనుక, ఈ తెలివి నిరంతరం ఒకటిగా ఉండే చలనం, విచ్ఛిన్నమైన స్థితికాదు, నేను దానితో పాటే సాగి పోవాలనుకున్నాను

**ప్రశ్న: ఈ తెలివే శక్తి అంటారా? అది దేనిమీదైనా ఆధారపడితే అది ఆవిరైపోతుందేమో?**

**కృష్ణమూర్తి:** ఇప్పటికి ఆ విషయాన్ని పట్టించుకోవద్దు, శక్తి అనే అంశాన్ని గురించిన ప్రశ్నని అవతలపెట్టండి

**ప్ర: అది మీకిప్పటికే లభ్యమైంది; మా వంటి వారికి, మళ్ళీ మళ్ళీ సంస్కరించబడవలసి వస్తుంది. కానీ ఇచ్ఛమాత్రం అలాగే వుంటుంది.**

**కృష్ణమూర్తి:** అవును, అదేగదా జరుగుతున్నది-సంస్కరించబడటమే గదా? పలురకాల ఒత్తిళ్ళవల్లా, పలువ్యాపకాల వల్లా ఆ మనసు, ఆ మెదడు, ఆ మొత్తం ఉనికి మొద్దుబారిపోయిందా? మేమంటున్నదేమంటే, ఆ మొత్తం ఉనికి పూర్తిగా మేల్కొనాలని

**ప్ర: అదే వచ్చినతంటా.**

**కృష్ణమూర్తి:** కాస్త ఆగండి, దానిదగ్గరకే వస్తున్నాను, మీరే చూద్దురుగాని తెలివికి, పరిణామక్రమమంటూ లేదు అది కాలంలోనుంచి, పుట్టుకు వచ్చిందికాదు సున్నిత స్పృహ కలిగిన ఎఱుక అనే లక్షణంతో 'ఉన్నస్థితి'ని వీక్షించుటే తెలివి నామనసు మందకొడి కనుక, నేను, 'నన్ను చూసుకోవలసి ఉన్నది' అని చెప్పుకున్నాను

ఈ మందబుద్ధి తనను తాను చూచుకొనడానికి ప్రయత్నిసున్నది అది ఏమీ చూడలేదనేది, స్పష్టమే అది ప్రతిఘటించడమైనా చేస్తుంది, లేకపోతే తిరస్కరిస్తుంది అదీకాకపోతే అనుసరిస్తుంది అది ఎంతో మర్యాదగల, పెద్దమనుష్యుల జాతికి చెందినది, అల్పబుద్ధిగల ఆ మనసు చూస్తున్నది

**ప్ర: ఇంతకుముందు సిద్ధాంతపరమైన నైతిక సూత్రాలను గురించి మాట్లాడటం మొదలు పెట్టారు. ఇపుడు మరికాస్త ముందుకు వెళ్ళి, ఆ పద్ధతులూ, సూత్రాలు అన్నీ వ్యర్థం. మనల్ని మనం పరిశీలించుకోవటమే ముఖ్యమని సూచిస్తున్నారు. ఇదికూడ ఒక సిద్ధాంతం గాదా?**

**కృష్ణమూర్తి:** కాదండీ, అందుకు విరుద్ధంగా నేచెప్తున్నదేమంటే, మీరు ఏ సిద్ధాంతంతోనైనా చూస్తే, నేను చెప్పేదానితో సహా, మీరు దారితప్పినట్లే, అపుడు మీరసలు చూడడమే లేదన్నమాట మీకెన్నో సిద్ధాంతాలున్నాయి, గౌరవ ప్రదమైనవి, అంతగౌరవప్రదం కానివి, వగైరా వగైరా! ఆయా సిద్ధాంతాల్ని మీ మెదడులో, హృదయంలో ఉంచుకునే మీరు చూస్తున్నారు ఆ సిద్ధాంతాలు మీ మెదడునీ, మీ మనసునీ, మీమొత్తం ఉనికినీ మొద్దుబారేటట్లు చేశాయి ఇపుడా మందబుద్ధే చూస్తున్నది మందకొడి మనసు దేనిని చూసినా, ధ్యానం చేసినా, చంద్రమండలానికి వెళ్ళినా, అది యింకా మందమతే కనుక, ఆ మందకొడి మనసు పరిశీలిస్తుండగా, ఎవరో అటువైపువచ్చి, "బాబూ, నీవు మందమతివి, నీవు ఏది చూసినా, అదికూడ నీలాగే మందకొడిగా వుంటుంది అన్నారు. నీకు తెలివిలేదు కాబట్టి నీవు చూసేది కూడ తప్పనిసరిగా తెలివిలేనిదే అవుతుంది " అన్నారు ఇక్కడ ఒక గొప్పవిషయం ఆవిష్కరించబడింది. మందకొడి మనసు, అసాధారణ చైతన్యంతో ఉండే దానిని చూచినప్పటికీ, ఇది దానిని కూడ మసకమసకగా చేస్తుంది.

**ప్ర: చూడటానికే గదా అది ముందుకి తోసుకువస్తుంటుంది.**

**కృష్ణమూర్తి:** కొంచెం ఆగండి, మీరేమీ అనుకోకపోతే, వక్తతోపాటే, అడుగు మీద అడుగువేసుకుంటూ నడవండి.

**ప్ర: తెలివితక్కువ మనసు, తనలో తెలివి లోపించిందని గుర్తించినట్లయితే, ఇంక అది అంతమందకొడిగా వుండదేమో!**

**కృష్ణమూర్తి:** నేను గుర్తించనుకదండీ! తాను మందమతినని గుర్తించినట్లయితే, అది చాలా చక్కని విషయం; కానీ అది అలాచేయదు అది తనను మరింత మెరుగులు దిద్దుకుంటూనైనా వుంటుంది, విద్యాధిక్యతనో, శాస్త్రపరిజ్ఞానాన్నో, మరివేటినో సంపాదిస్తూ ఉంటుంది; లేకపోతే తాను మందమతిననే విషయం తెలుసుకుని 'ఈ మందమతి స్పష్టంగా చూడలేదని' చెప్తుంది ఇక తర్వాతి ప్రశ్న: ఏ పరికరంతోనైతే మనిషి చూస్తున్నాడో, అది అమిత శుభ్రమవడానికి - అనగా, మచ్చలతో, మందకొడితనంతో నిండిపోయిన ఈ మనసు - అత్యంత అసాధారణమైన తెలివినెలా పొందాలి?

ప్ర: ఆ మనసు అవిధంగా ప్రశ్నించుకున్నట్లయితే, అది తన మందకొడితనాన్ని అంతం చేసినట్లేనంటారా? అపసవ్యమైన కారణాల ఆధారంగా చేసే పనులు, సవ్యంగా ఉంటాయా?

కృష్ణమూర్తి: లేదు, మీ నిర్ణయాలను కాసేపు పక్కనపెట్టి, వక్తచెప్తున్నదానిని సరిగా అర్థం చేసుకోనండి

**ప్ర: అలాకుదరదు, నా ప్రశ్నకు సమాధానం చెప్పండి.**

కృష్ణమూర్తి: మీరంటున్నది ఇది మందకొడిమనసుని చురుకుగానూ, తేజోవంతంగానూ చేయడానికి మీరు దేనినో పట్టుకోవాలని ప్రయత్నిస్తున్నారు నేనాపనిచేయను నేనంటున్నది, మందమతి లక్షణాన్ని గమనించమని

**ప్ర: నిరంతరం సాగే చలనాలు లేకుండానా?**

కృష్ణమూర్తి: మందకొడి మనసుని, నిరంతరం వక్రీకరణకు గురిచేసే చలనాలు లేకుండా గమనించమంటున్నాను – అదెలా సంభవిస్తుంది? నా మందకొడి మనసు చూస్తున్నది, అందువల్ల అక్కడ చూసేందుకు ఏమీలేదు 'మనసుని తేజోవంతం చేయడమెలాగ' అనే ప్రశ్న వేసుకున్నాను నా ఈ ప్రశ్న మందకొడి మనసుని మరొక తెలివిగల మనసుతో నేను పోల్చినందువల్ల జనించిందా? 'నేను దానిలాగా ఉండాలి' అని అనుకున్నందువల్ల జనించిందా? అర్థమౌతున్నదా? అసలు అలా పోల్చుకోవడమే మందకొడితనాన్ని కొనసాగించడం

**ప్ర: మందకొడి మనసు స్వయంగా తెలివిగల వారితో పోల్చుకుంటుందా?**

కృష్ణమూర్తి: తనకన్నా మెరుగ్గా ఉన్న మనసుతో పోల్చుకోవడం అనేది జరగడం లేదా? దానినే కదా మనం పరిణామ మంటాము, కాదా?

**ప్ర: మందకొడి మనసు పోల్చుకోదు, అది, 'నేనెందుకు పోల్చుకోవాలంటుంది', లేక దీనినే మరోవిధంగా చెప్పుకోవచ్చు; ఇపుడు ఉన్నదానికన్నా, మరికాస్త తెలివిగా ఉంటే, మరింత సాధించవచ్చుననే నమ్మకంతో ఉంటాడు మనిషి.**

కృష్ణమూర్తి: అవునండీ, అదేగదా, నేనంటున్నది ఇక్కడ నేనొక విషయం కనుక్కున్నాను. మందకొడి మనసు, ఏమంటున్నదంటే, 'ఆ మనిషి తెలివిగా ఉన్నాడు కాబట్టి, నేనాయనతో పోల్చుకున్నందువల్ల మందమతినయాను' అని; తాను స్వతహాగా మందకొడిననే విషయం, దానికి తెలియడం లేదు ఇక్కడ రెండు భిన్నస్థితులున్నాయి. మీరు తేజోవంతులైనందువల్ల, నా మందమతితనాన్ని తెలుసుకోవడమనేది ఒకటి. పోల్చుకోకుండానే తెలుసుకోవడం పూర్తిగా భిన్నమైనస్థితి మీరే స్థితిలో ఉన్నారు? ఎవరితోనైనా పోల్చుకుని 'నేను మొద్దుని' అంటున్నారా? లేక, పోల్చుకోకుండానే, మీరు మందమతిననే విషయం తెలుసుకున్నారా? అది సాధ్యమేనా? దీని మీద మీ దృష్టిని కాసేపు నిలపండి

**ప్ర: అది సాధ్యమేనంటారా?**

కృష్ణమూర్తి: రెండు నిమిషాలపాటు ఈ విషయం పై శ్రద్ధపెట్టండి. నాకు ఆకలి వేస్తున్నదని మీరు చెప్పినందువల్ల నేను తెలుసుకుంటున్నానా? లేక నాకే ఆకలిగా

ఉన్నట్లనిపిస్తున్నదా? నా ఆకలిని గురించి మీరు గుర్తు చేసినపుడు, నాకు కొద్దిగా ఆకలిగా ఉన్నట్లు అనిపించవచ్చు కానీ, అది నిజమైన ఆకలికాదు అలాకాక, నాకే ఆకలి వేసినట్లయితే అపుడు, "నిజంగానే నేను ఆకలితో ఉన్నానన్నమాట" కనుక, ఈనా మందకొడితనం పోల్చుకున్న దాని ఫలితమా, ఆ విషయంలో నేను చాలా స్పష్టంగా ఉండాలి అపుడే, నేను అక్కడి నుంచి ముందుకి పోగలను

ప్ర: **నేను మందమతిననే విషయం స్వయంగా గ్రహించాలి కానీ, పోల్చుకున్నందువల్ల తెలియడం, అంత ప్రధానంకాదని మీరెందుకు భావిస్తున్నారు?**

**కృష్ణమూర్తి:** పోల్చుకున్నందువల్లనే, ఆ మనసు మందకొడి అయిపోతున్నదనే సత్యాన్ని నేను గ్రహించాను కాబట్టి, స్కూలులో ఒక పిల్లవాడిని మరొక పిల్లవాడితో పోలుస్తారు వాడిని మరొకడితో పోల్చడం ద్వారా వాడిని నాశనం చేస్తున్నారు అలాగే, తమ్ముడితో, నీవు అన్నయ్యంత తెలివిగా ఉండాలని చెప్పినపుడు, మీరు ఆ తమ్ముడిని నాశనం చేస్తున్నారు అవునా, మీకు తమ్ముడిని గురించిన చింత కన్నా, అన్నయ్య తెలివితేటలమీదే శ్రద్ధ ఎక్కువ

ప్ర: **మందకొడిమనసు, తాను మందమతిననే విషయం స్వయంగా చూసి, కనుగొనగలదా?**

**కృష్ణమూర్తి:** మనమిపుడు కనుగొనబోతున్నాం మళ్ళీ మొదలుపెడదాం ఈపూట మన విచారణను ఈ ఒక్క విషయానికే పరిమితం చేద్దామా?

ప్ర: **ఉన్నదానిని మార్చాలనే ఇచ్ఛ ఉన్నంత సేపూ, నేను మందమతిననే విషయం స్వయంగా కనుగొన్నానా, పోల్చుకుని కనుగొన్నానా అనే దానికి ఉండే ప్రామాణికత ఏమిటి?**

**కృష్ణమూర్తి:** మనం కనుగొనబోతున్నాం దయచేసి వక్తతో అంగీకరించడమో, లేక తిరస్కరించడమో చేయకుండా వక్తతోపాటే ఉండండి, అయితే మిమ్మల్ని మీరు గమనించుకుంటూ వుండండి ఈ ఉదయం మన సంభాషణల ప్రారంభంలో, మన ఉనికికి మూలంలోనే విప్లవం సంభవించాలన్నాము 'మనలో ఉన్నదేమిటో' పరిశీలించడం ఎలాగో తెలుసుకున్నప్పుడు మాత్రమే అది సంభవిస్తుందని చెప్పుకున్నాం ఎలా పరిశీలించాలి అనేది, ఆ మనసు యొక్క తేజస్సు, సుస్పష్టత, నిష్కపటతలమీద ఆధారపడి వుంటుంది కానీ, మనలో చాలామందిమి, మందమతులం కాబట్టి, చూసినా మనకేమీ కనిపించలేదంటుంటాం, మనం ఆగ్రహాన్ని, అసూయనీ వగైరాలను చూస్తాం, కానీ చూచిన ఫలితం ఎందులోనూ కానరాదు కనుక, మనశ్రద్ధ అంతా మందకొడి మనసుపైనే, కానీ అదేమీ చూస్తున్నదో అనేదానితోకాదు ఈ మందకొడిమనసు అంటుంది, 'చూచుటకుగాను నేను తెలివిగా ఉండాలి' అని, తెలివిగా ఉండటమంటే ఏమిటో అది ఒక నమూనాని తయారుచేసుకుని, అలా అగుటకుగాను ప్రయత్నిస్తూవుంటుంది 'పోల్చుకొనుటే మందకొడితనాన్ని జనింపచేస్తుంది', అని ఎవరోదానికి చెప్తారు అప్పుడు అది, 'నేను ఈ విషయంలో ఇకనుంచి చాలా జాగ్రత్తగా ఉండాలి, కనుక నేను పోల్చుకోను'

ఇంతకుముందు పోల్చుకొనుట ద్వారానే నాకు మందకొడి తనమంటే ఏమిటో తెలిసింది నేను కనుక పోల్చుకోకపోతే, నేను మందమతినని నాకు ఎలా తెలుస్తుంది? అంటుంది నాతో నేనిలా అనుకున్నాను, 'నేను దానిని మందబుద్ధి' అని పిలవను అసలా 'మందకొడి' అనే పదాన్నే వాడను 'ఉన్నస్థితి'ని పరిశీలిస్తానేకానీ, దానికి మందకొడి అనే పేరే పెట్టను ఎందుకంటే దానికి ఆ పేరు పెట్టిన క్షణమందే, దానికో పేరు ఖాయం చేయడం, దానిని మందకొడి చేసేయడం జరిగింది నేను దానిని మందకొడి అని పిలవకుండా, దానిని కేవలం పరిశీలిస్తుంటే పోల్చుకోవడ మనేదానిని తొలగించాను 'మందకొడి' అనే పదాన్ని తొలగించాను, ఇపుడు అక్కడ 'ఉన్నస్థితి' మాత్రమే ఉన్నది ఇదేమీ కష్టం కాదు, అవునా? మీకు మీరే గమనించుకోండి ఇపుడు ఏం జరిగిందో చూడండి! ఇపుడు నా మనసు ఎలా ఉన్నదో చూడండి

**ప్ర: నా మనసు చాలానెమ్మదిగా పనిచేస్తున్నట్లు చూశాను.**

**కృష్ణమూర్తి:** దయచేసి నేను చెప్పేది వింటారా? నేను ఒక్కొక్క అడుగూ వేసుకుంటూ వెడతాను

నామనసు మందకొడి అని నేనెలా గ్రహించాలి మీరు చెప్పారు కనుకనా? అసాధారణమైన తెలివితో, అతి క్లిష్టంగానూ, బహుసూక్ష్మంగానూ వ్రాయబడిన గ్రంధాలను పఠించినందువల్లనా? మేధావంతులని చూసి, వారితో నన్ను పోల్చుకుంటూ, నన్ను నేను మందమతినని అనుకుంటున్నానా? నేను దీనిని కనుక్కోవలసి ఉన్నది. కనుక, నేను పోల్చుకోను, మరొకరితో నన్ను పోల్చుకోవడమనే దానిని తిరస్కరిస్తాను. అపుడు నేను మందమతినని నాకు తెలుస్తుందా? నా పరిశీలనలో నన్ను ఆటంకపరుస్తున్నది ఆ పదమేనా? 'వాస్తవంగా నాలో ఉన్నదాని', స్థానాన్ని ఆ పదం వచ్చి ఆక్రమిస్తున్నదా? మీకు అర్థమవుతున్నదా? నేనిక, ఏ పదాన్నీ వాడను నేను దానిని మందబుద్ధి అని పిలవను నీవు స్తబ్ధుగా ఉన్నావనీ అనను. నేను దానిని ఏపేరు పెట్టీ పిలవను కానీ, 'ఉన్నస్థితి' ఏమిటనేది కనుక్కుంటాను కనుక, బహుసూక్ష్మమైన ఈ పోల్చుకొనుటను వదిలించుకున్నాను నా మనసు అసాధారణమైన తెలివితో ప్రవర్తిల్లుతున్నది కారణం ఏమంటే, ఇక అది పోల్చుకోదు 'ఉన్నస్థితి'ని చూచుటకుగాను అది ఏ పదాన్నీవాడదు ఎందుకంటే, వర్ణన ఎపుడూ వర్ణించబడేదికాదు అనే విషయం గ్రహించింది వాస్తవమైన 'ఉన్నస్థితి'లో ఉండే యాదార్థ్యమేమిటి?

మనమక్కడి నుండి ముందుకు పోదామా? నేను దానిని గమనిస్తున్నాను, మనసు దాని చలనాన్ని అదే గమనించుకుంటున్నది ఇపుడు దానిని నేను నిందిస్తానా? తీర్పుచెప్పీ, విలువ కట్టీ, 'ఇదిలా ఉండాలీ', 'ఇదిలా ఉండకూడదు' అని అంటానా? దానికేమైనా సూత్రంగానీ, ఏదైనా ఆదర్శంకానీ, ఏదైనా తీర్మానం కానీ ఉన్నాయా? ఉంటే మాత్రం అది 'ఉన్నస్థితి'ని వక్రీకరిస్తుందనేది ఖాయం. నేనందులోకి ప్రవేశించి చూడాలి నాకిప్పటికే ఓ తీర్మానం ఉంటే, నేనుచూడలేను నేను ఓ నైతిక వాదిగానో, గౌరవనీయమైన వ్యక్తిగానో లేక ఓ క్రిస్టియన్‌నో, ఓ వేదాంతినో లేక 'జ్ఞానోదయమొందిన' వానిగానో, ఇదో, అదో అయివుంటే-అదంతా నాచూపుని నిరోధిస్తుంది అందువల్ల, ఆ

మొత్తం నుంచి నేను విడివడాలి, నేను ఏదో ఒక రకమైన తీర్మానం చేసుకున్నానా అని నన్ను గమనించుకుంటున్నాను దానితో, ఆ మనసు అసాధారణమైన స్పష్టతను సంతరించుకుంది 'భయమేమైనా ఉన్నదా' అని అది అడుగుతున్నది నేను దానిని గమనించి, 'భయమేకాదు, భద్రంగా ఉండాలనే కోరిక కూడ ఉన్నది, సుఖం కోసం ప్రేరణ, వగైరాలూ ఉన్నాయన్నాను అందువల్ల నాలో ఏరకమైన తీర్మానం ఉన్నా, ఏ రకమైన సుఖానికి సంబంధించిన చలనమున్నా, నేను చూడజాలను' అనేది తెలిసింది కనుక, నేనలా గమనిస్తూనే ఉండిపోగా, నేను గొప్ప సంప్రదాయవాదినని కనుక్కున్నాను అలాంటి సంప్రదాయబద్ధమైన మనసు చూడలేదని, గ్రహించాను చూడటంలోనే నాకు గాఢాసక్తి, నాగాఢాసక్తే నాకు తీర్మానాలు చేసుకోవడంలోని ప్రమాదాన్ని చూపించింది అందుచేత, ప్రమాదాన్ని చూసిన ఆ చూపే, ఆ ప్రమాదాన్ని తొలగించివేసింది కనుక, ఇపుడు నామనసుకి అయోమయం లేదు, దానికి తీర్మానం లేదు అది పదాలు, వర్ణనల పరంగా ఆలోచించదు అలాటి మనసు, పరిశీలించగలదు, అది దేనిని పరిశీలిస్తున్నదో, అది తానే అందువల్ల విప్లవం సంభవించినట్లే ఇపుడు, మీరు అనేవారు లేరు – పూర్తిగా లేరు

**ప్రశ్న: ఈ విప్లవం సంభవించిందని నేననుకోవడం లేదు. ఈరోజున, మీరు చెప్పినట్లే, నేను నా మనసుని చూసుకోగలిగాను, మనసు కొంచెం పదునైంది. కానీ రేపు పొద్దునకే నేనెలా చూడాలో, మర్చిపోతానేమో!**

**కృష్ణమూర్తి:** మీరు దానిని మర్చిపోలేరు సర్, మీరు సర్పాన్ని మర్చిపోతారా? మీరు కొండకొసను మర్చిపోతారా? 'విషం' అని రాసిపెట్టిన సీసాని మర్చిపోతారా? మీరు మర్చిపోలేరు ఆయన 'నేను ఆ పరికరాన్ని ఎట్లాశుభ్రం చేయగలను', అంటున్నారు ఆ పరికరం మందకొడిగా, మసక మసకగా, మబ్బుకమ్మినట్లు ఎలా అయిందో, తెలుసుకుంటూవుండడమే, పరికరాన్ని శుభ్రపరిచేందుకు మీరు చేయవలసినని అని మేము చెప్పాం. దానిని మబ్బు కమ్మినట్లుగా చేసినదేమిటో వర్ణించాము, అయితే వర్ణన వర్ణించబడే వస్తువుయొక్క వాస్తవరూపంకాదనేది కూడ చెప్పాం, కనుక, పదాలలో చిక్కుకొనవద్దు. వర్ణించబడిన దానితో వుండిపొండి, అనగా మబ్బుకమ్మినట్లు చేయబడిన పరికరంతో.

**ప్ర: మీరు వర్ణించినట్లు, మిమ్మల్ని మీరు చూచుకుంటే, మీకేదో దక్కుతుందనుకుంటున్నారు గదా!**

**కృష్ణమూర్తి:** నేను దేనినీ ఆశించడం లేదు, పరివర్తనకానీ, జ్ఞానోదయంకానీ, ఉత్పరివర్తనం గానీ, ఏమి జరగనున్నదో నాకు తెలియదు కాబట్టి నేను దేనినీ ఆశించను నాకు స్పష్టంగా తెలిసింది ఒక్కటే, చూస్తున్న పరికరం శుభ్రంగా లేదని, మబ్బు కమ్మినట్లుందనీ, పగుళ్ళిచ్చిందనీ నాకు తెలిసిందంతే, ఇంకేమీ తెలియదు నాకున్న శ్రద్ధంతా, ఆ పరికరాన్ని పరిపూర్ణంగా, ఆరోగ్యవంతంగా ఎలా చేయగలను?

ప్ర: మరి, మీరెందుకు చూస్తున్నట్లు?

**కృష్ణమూర్తి:** ప్రపంచం తగలబడి పోతున్నది, ఆ ప్రపంచం నేనే, కనుక, నేనెంతో అలజడి చెందాను, ఎంతో అయోమయానికి గురయాను, ఇంత గందరగోళంలో కూడ, ఎక్కడో ఏదోక్రమం ఉండేవుంటుంది. అదే, నన్ను చూసేటట్లు చేస్తున్నది కానీ, మీరు వచ్చి ప్రపంచం బాగానే వుంది, దానిని గురించి మీరెందుకు చింతిస్తారు మీకు మంచి ఆరోగ్యం ఉంది, కొంత డబ్బుంది, భార్యా బిడ్డలున్నారు, మంచి యిల్లుంది, ప్రపంచాన్ని దానిపాటికి దాన్ని ఉండనివ్వమంటారు అలాగైతే, మీదృష్టిలో ప్రపంచం దగ్ధం అవడం లేదు, కానీ, మీకిష్టం ఉన్నా, లేకపోయినా ప్రపంచం తగలబడుతూనే వున్నది. అదే నన్ను చూచేటట్లు చేస్తున్నది, ఇదేదో మేధాపరమైన సిద్ధాంతం కాదు, భావోద్వేగంలోనుంచి పుట్టుకు వచ్చిన అలజడీ కాదు, ప్రపంచం తగలబడుతున్నదేది వాస్తవం ఆ యుద్ధాలు, ఆ ద్వేషాలు, ఆ మోసం, ఆ మనోచిత్రాలు, ఆ అబద్ధపు దేవుళ్ళు, వగైరాలు బాహ్యంలో జరుగుతున్నవాటిని గ్రహించడమే, నన్ను మనసులోనవి కూడ గ్రహించేటట్లు చేస్తున్నది నేనంటున్నదే మంటే, మనసులోని స్థితే, బాహ్యంలోని స్థితి, ఆ రెండూ ఒకటే, అవిభాజ్యమైనవి.

ప్ర: **మనం, మళ్ళీ మొదటికి వచ్చాం. వాస్తవమేమంటే, మందకొడి మనసు, పోల్చుకోవటం ద్వారా, తాను భిన్నంగా ఉండాలనే ఆలోచన, తనలో వుందని గ్రహించడం లేదు.**

**కృష్ణమూర్తి:** కాదు, అదంతా శుద్ధపొరపాటు, నాకు మరోరకంగా అవాలని లేదు పరికరం మందకొడిగా ఉన్నదని మాత్రమే నేను చూశాను

దానిని ఏం చేయాలో నాకు తెలియడం లేదు కనుక నేను కనుక్కోబోతున్నాను, దానర్థం, నేను ఆ పరికరాన్ని మార్చాలనుకుంటున్నానని కాదు నేనలాచేయను

ప్ర: **ఏపదమైనా వాడినట్లయితే, అదిచూపుకి ఆటంకమౌతుందా!**

**కృష్ణమూర్తి:** పదం వస్తువుకాదు అందువల్ల మీరొక వస్తువుని చూస్తున్నప్పుడు, పదాన్ని పక్కనపెడితే తప్ప, ఆ పదమే మీకు అత్యంత ప్రధానమై పోతుంది

ప్ర: **నేను మీతో ఏకీభవించలేననుకుంటాను. పరికరాన్ని పరిశీలిస్తున్నపుడు, అందులో రెండు భాగాలున్నట్లు తెలుస్తుంది; ఒకటి చూపు, మరొకటి, వ్యక్తీకరణ; ఈ రెంటినీ తెగ్గొట్టడం చాలా కష్టం. ఇక్కడే, భాషలోనూ, వ్యక్తం చేయడంలోనూ యిబ్బంది వస్తుంది.**

**కృష్ణమూర్తి:** పరిశీలనలో గ్రహింపు – వ్యక్తీకరణ ఉన్నవనీ, అవి రెండూ వేర్వేరు కావనీ అంటున్నారా? అందువల్ల, మీరు గ్రహిస్తున్నపుడు స్పష్టమైన వ్యక్తీకరణ కూడ ఉండాలనీ, దానికి భాషాపరమైన అవగాహన అవసరమనీ, గ్రహించుట – వ్యక్తీకరించుట అనే వాటిని విడదీయరాదని, అవి ఎప్పుడూ జతగానే ఉండాలనీ అంటున్నారా? కనుక, సరైన పదం వాడటం ఎంతో ముఖ్యమని మీరు చెప్తున్నారు గదా?

ప్ర: నేను, 'వ్యక్తీకరించటం', గురించే చెప్పాను. 'ఉద్దేశ్యం' గురించి కాదు.

**కృష్ణమూర్తి:** అర్థమైంది-వ్యక్తీకరణ అందులోనుంచే మరోఅంశం పుట్టుకువస్తుంది గ్రహింపు లేకపోతే, - పదాలలో చెప్పడమే వ్యక్తీకరణ అయితే-అపుడు విభజన ఏర్పడుతుంది కనుక, గ్రహింపే చర్యకాదా? గ్రహించడమే చర్య కొండకొసను చేరామని గ్రహించినపుడే, తక్షణం చర్య తీసుకోబడుతుంది, ఆ చర్య గ్రహించిన దానియొక్క వ్యక్తీకరణ, గ్రహింపు,చర్యలనే వెపుడూ విడదీయలేనివి, అందువల్ల ఆదర్శం-ఆచరించటం అనేవి అసంభవం ఆదర్శంలోని మూర్ఖత్వాన్ని నేను చూచినట్లయితే, ఆ మూర్ఖత్వాన్ని గ్రహించటమే తెలివితో కూడిన చర్య కనుక, మందకొడి లక్షణాన్ని గమనించడంకానీ, ఆమందకొడి లక్షణాన్ని గ్రహించడం కానీ, మనసులోని మందమతి తనాన్ని తొలగించటమే, అదే చర్య

*సానెన్, స్విట్జర్లాండు, ఆగష్టు6, 1969*

# 3. చూచేకళ

## విరామకాలంలేని ఎఱుక. పులిని తరిమే పులి

చూపు, పరిశీలనల యొక్క స్వరూపాన్నీ, సౌందర్యాన్నీ అర్థం చేసుకోవడం ముఖ్యమని నేను భావిస్తున్నాను-నరాల దౌర్బల్యం వల్ల కలిగే ప్రేరణలు, అనుభూతులు, భయం, దుఃఖం, దేహారోగ్యం, అత్యాశ, గర్వాతిశయం, అధికార తాపత్రయం మున్నగు వాటితో మనసు ఏ రకంగా వక్రీకరించబడినా - అంత కాలం అది వినలేదు, గమనించలేదు, చూడలేదు చూచుట, వినుట, గమనించుట అనేకళలు కృషితో సాధించగలిగినవికాదు పరిణామంచెందటమూ, క్రమాభివృద్ధి నొందటమూ అనే ప్రశ్నలేదు ప్రమాద మాసన్నమైనదని తెలియగానే తక్షణం చర్యసంభవిస్తుంది, దేహమూ, స్మృతీ, సహజసిద్ధంగా, తక్షణం స్పందిస్తాయి అవిధంగా ప్రమాదాన్ని ఎదుర్కొనటానికి, బాల్యం నుంచీ మనిషి నిబద్ధీకరింపబడ్డాడు, అందువల్ల ఆ మనసు వెన్వెంటనే, స్పందిస్తుంది లేని పక్షంలో భౌతికంగా సర్వనాశనమే అసలు ఆ నిబద్ధతేలేకుండా, చూచినదే తడవుగా చర్య జరిగిపోవటం సాధ్యమా అని మేము ప్రశ్నిస్తున్నాము మనసు ఏవిధమైన వక్రీకరణకైనా, స్వేచ్ఛగా, తక్షణం స్పందించగలదా, స్పందించి చర్యతీసుకోగలదా? అనగా గ్రహింపు, చర్య, వ్యక్తీకరణ అనేవన్నీ ఒక్కటే, అవి విభజింపబడినవి కాదు, ముక్కలైనవికాదు చూచినదే, చేయబడినది అని దానర్థం, ఆచూపుయొక్క అభివ్యక్తీకరణ భయము కలగగానే, ఎరుక కలిగిన మనసు, దానికత్యంత సమీపంలో పరిశీలిస్తే, ఆ పరిశీలనే దానినుంచి విముక్తి కలిగిస్తుంది, అదే చర్య ఈ ఉదయం మనం దానిని తరచి చూద్దామా? ఇది చాలా ముఖ్యమైన విషయంగా భావిస్తాను ఇలా చూస్తే, ఆ తెలియని దానిలోకి చొచ్చుకుపోగలం కానీ, మనసు స్వంతభయాలతో, ఆకాంక్షలతో, దురాశ-నిరాశలతో, మరితరమైన వాటితో, ఎలాగూ లోతుగా నిబద్ధీకరించబడివుంటుంది కనుక, ఇది దానిలోకి చొచ్చుకుపోలేదు దానికి అసాధారణమైన ఆరోగ్యం, స్వస్థచిత్తం, సమబుద్ధులతో శ్రుతిగలసిన మనసుకావాలి

కనుక, మన ప్రశ్న, ఈ మనసు-అనగా ఈ మొత్తం ఉనికి-ప్రత్యేకంగా ప్రవర్తిల్లే అసహజమైన కోర్కెల్నీ, ఏదో ఒక రూపంలో పోరాడే లక్షణాన్నీ, హింసను తెలుసుకోగలిగి ఉన్నదా, తెలుసుకున్న తర్వాత, క్రమక్రమంగా కాక, తక్షణం అంతం చేయగలిగి ఉన్నదా? దీనర్థం, గ్రహించటానికి-చర్యకి మధ్య కాలాన్ని ప్రవేశించనివ్వరాదన్నమాట. ప్రమాదాన్ని చూడగానే, విరామకాలం లేకుండా తక్షణం చర్య సంభవించాలన్నమాట

రోజులతరబడి గమనించినందువల్ల, సాధన చేసినందువల్ల, క్రమేణా మనం విజ్ఞులం, జ్ఞానులం అవగలమనే అభిప్రాయానికి మనం అలవాటు పడ్డాము అదే మన

అలవాటు, అదే మన సంస్కృతి యొక్క తీరు, అదే మన నిబద్ధత ఇపుడు మేము చెప్తున్నదేమంటే, భయంనుంచి, హింసనుంచి, మనసు తననుతాను క్రమక్రమంగా విముక్తినొందించుకునే ఈ ప్రక్రియలో ఆ భయాన్ని మరికాస్త పెంచటం, ఆ హింసను మరింత ప్రోత్సహించటం జరుగుతున్నదంటున్నాం

హింసనంతం చేయడం సాధ్యమా? బాహ్యంలోనే కాదు, మన ఉనికికి మూలంలోనుంచే- ఈ దౌర్జన్యపరత్వాన్నీ, ఈ అధికార తాపత్రయాన్నీ అంతం చేయగలమా? హింసను సంపూర్తిగా మనం చూస్తున్నసమయంలోనే, కాలాన్ని ప్రవేశించనివ్వకుండా దానినంతం చేయగలమా? మనమీ ఉదయం దీనిని గురించి చర్చించుదామా? సాధారణంగా, మనం చూపు - చర్యలమధ్య, 'ఉన్నస్థితి'- 'ఉండాలనుకునే స్థితి'ల మధ్య కాలాన్ని చొరనిస్తాం ఏదో సాధించుటకు, మరేదోగా అగుటకుగాను, ఉన్నదానిని వదిలించుకోవాలనే కోరిక మనలో ఉంటుంది ఈ విరామకాలం గురించి మనం చాలా స్పష్టంగా అర్థం చేసుకోవాలి చిన్నతనం నుంచీ, మనల్ని పెంచడంలో, విద్యనేర్పడంలో, కాలగతిలో మనం క్రమంగా వృద్ధి చెందుతూ చివరకు ఏదో అవగలమని చెప్పారు కనుక, దానికనుగుణంగానే, మనం ఆలోచిస్తాము బాహ్యంలో, సాంకేతికరంగంలో కాలం అవసరమనేది తెలుస్తూనే వుంది నేనెన్నో సంవత్సరాలు కృషి చేస్తేగానీ, మంచి వడ్రంగి నవను, భౌతిక శాస్త్రవేత్తగానో, మంచిగణిత శాస్త్రజ్ఞుణ్ణిగానో రూపొందను బాల్యమందే గణిత శాస్త్రానికి సంబంధించిన ఓ సమస్యలోని సూక్ష్మాన్ని చూడగలస్పష్టత - అంతఃస్ఫురణ అనే పదం వాడటం నాకిష్టం లేదు- ఓ పిల్లవానికి ఉండవచ్చు ఓ నూతన ప్రక్రియనీ, ఒక కొత్త భాషనీ నేర్చుకొనడానికి అవసరమైన జ్ఞాపక శక్తిని పెంచుకొనుటకు కాలం అవసరమని ఎవరైనా గ్రహించవచ్చు రేపటికి రేపు నేను జర్మన్ భాష మాట్లాడలేను గదా! దానికి ఎన్నోనెలలు పడుతుంది ఇక, ఎలక్ట్రానిక్స్‌ని గురించి నాకు అసలే తెలియదు కాబట్టి, దానిని నేర్చుకోడానికి, బహుశా సంవత్సరాలే పట్టవచ్చు కనుక ఒక నూతన ప్రక్రియను నేర్వడానికి అవసరమైన కాలాన్ని, చూపు-చర్యలమధ్య ప్రవేశించనిస్తే ప్రమాదకరమయే కాలాన్ని, పోల్చుకుని అయోమయంలో పడవద్దు

**ప్ర: పిల్లలు పెరిగి పెద్దవడం గురించి మాట్లాడుదామా?**

**కృష్ణమూర్తి:** పిల్లవాడు పెద్దవాడవ్వాలిసిందే, అతడెన్నోవిషయాలు నేర్వాలిసిందే కానీ వాడితో, 'నువ్వు ఎదగాలిరా' అంటే మాత్రం అది వాడిని కించపరిచినట్లవుతుంది

**ప్ర: సర్, మనలో మానసికమైన మార్పు పాక్షికంగా సంభవిస్తూనే వుంటుంది కదండీ?**

**కృష్ణమూర్తి:** అవునౌను, మనిషికి, ఒకప్పుడు కోపం వచ్చింది,లేదూ, ఇప్పుడు కోపంగా ఉన్నాడు అతను, 'నాకు కోపం ఉండకూడదు', అని అనుకుని దానిని క్రమక్రమంగా తగ్గించుకోడానికి, కృషిచేస్తాడు, పాక్షికమైన మార్పుని సాధిస్తాడు ఇప్పుడతనిలో కోపం కొద్దిగా తగ్గింది, మునుపటంత చిరాకు లేదు, మరికొంత అదుపులో ఉంటున్నాడు

**ప్ర: నా ఉద్దేశమది కాదండీ?**

**కృష్ణమూర్తి:** మరి, మీరంటున్నదేమిటమ్మా?

ప్ర: ఇంతకుముందు మీలో ఏదో ఉన్నది, దానిని ఇపుడు వదిలేశారు అంటున్నాను. మిమ్మల్ని మళ్ళీ అయోమయం ఆవరించినప్పటికీ, అది మునుపటిలా ఉండదు.

**కృష్ణమూర్తి:** అవును, అయోమయమెపుడూ ఒకేలా వుండదు, కొద్దిగా మార్పుకి గురవుతుంది కానీ రూపాంతరంలో కొనసాగుతుంటుంది మీరెవరిమీదో ఆధారపడటం మానేశారు, ఆధారపడినందువల్ల కలిగిన బాధ, ఒంటరితనం వల్ల కలిగిన నొప్పి, అనుభవించిన తర్వాత ఇలా అంటున్నారు. "నేనిక ముందు ఎవరిమీద ఆధారపడను" బహుశా, మీరు దానిని వదిలివేయగలరు కూడ, కనుక, నాలో కొంతవరకు మార్పు వచ్చిందని చెప్తారు ఈ సారి, మీరాధారపడబోయేది, సరిగ్గా పూర్వం లాంటిది కాక పోవచ్చు మళ్ళీ మీరు దానిని విచారణచేసి, విసర్జించవచ్చుగాక ఇపుడు మేమడుగుతున్నదేమంటే అసలు ఈ ఆధారపడే గుణాన్ని, ఆమూలాగ్రం చూడడం, చూచినదే తడవుగా దాన్నుంచి విడివడటం సాధ్యమేనా క్రమక్రమంగా కాదు-ప్రమాదం ముంచుకు వచ్చినపుడు తక్షణ చర్య తీసుకున్నట్లుగా, ఇది నిజంగా, ముఖ్యమైన అంశం కనుక, మనం దీనిని తరచి చూసి, కేవలం, వాచ్యార్థాన్ని మాత్రమే కాకుండా, మనసులోతుల్లో కూడ అర్థం చేసుకోవాలి ఇందులో యిమిడి ఉన్నదేమిటో గమనించండి ఆసియా ఖండం మొత్తం, పునర్జన్మను విశ్వసిస్తుంది అనగా తిరిగి జన్మించడం, అయితే మీరీ జన్మలో జీవించిన తీరునుబట్టే, మీ మరుజన్మ ఆధారపడుతుంది మీరు కనుక, క్రూరంగా, దౌర్జన్యంగా, విధ్వంసకరంగా జీవించినట్లయితే, మరు జన్మలో మీరు దానికి తగిన మూల్యం చెల్లించుకోకతప్పదు తప్పనిసరిగా, మీరు జంతువుగానే పుడతారని కాదు, మానవునిగానే జన్మించినా, మీరు ఇంతకన్నా బాధాకరమైన, ఇంతకన్నా విధ్వంసకరమైన జీవితాన్ని గడపవలసివస్తుంది ఎందుకంటే, ఇంతకుముందు, సుందరతరమైన జీవితాన్ని గడపలేదు కాబట్టి. పునర్జన్మ సిద్ధాంతాన్ని విశ్వసించేవారి, విశ్వాసం ఆ పదానికే పరిమితమైపోయింది, ఆ పదానికున్న లోతైన అర్థాన్ని వారు గ్రహించడం లేదు ఈనాడు మీరు ఏం చేస్తున్నారనేదే ముఖ్యం ఎందుకంటే, రేపు అనేదానిపై దాని అనంతమైన ప్రభావం ఉంటుంది - ఎందుకంటే, రేపు అనేది మీ మరుజన్మే ఈనాటి మీ చర్యలకు మూల్యం చెల్లించక తప్పదు క్రమక్రమంగా, వివిధ రూపాలను సంతరించుకోవటమనే అభిప్రాయం, ప్రాగ్దేశాల్లోనూ, పశ్చిమదేశాల్లోనూ, సారంలో ఒకటే 'ఉన్నస్థితి' - 'ఉండాలనుకున్నస్థితి'ల మధ్య కాలమనే అంశం ఎపుడూ వుంటుంది ఉండాలనుకున్న స్థితిని సాధించటానికి, కాలం అవసరం కాలం, అంటే ప్రయత్నం, ఏకాగ్రత, సావధానత. మనిషికీ సావధానతా, ఏకాగ్రతలు లోపించినందువల్ల, సావధానతలో ఉండటానికి నిరంతరం ప్రయత్నిస్తుంటాడు, దానికి కాలం అవసరమే

ఈ సమస్యని, పరిష్కరించటానికి, పూర్తిగా భిన్నమైన విధానమేదో ఉండితీరాలి మనిషి 'గ్రహింపు' అనగా చూపు - చర్యలని అర్థంచేసుకోవాలి. అవి రెండూ వేర్వేరు కావు, విభజింపబడేవికావు దానితోపాటు చర్య అంటే ఏమిటి, చేయుట అంటే ఏమిటి అనే అంశాలను విచారణచేయాలి చర్య, చేత అంటే ఏమిటి?

ప్ర: దృష్టి కొరవడిన అంధుడు ఏ పనినైనా ఎలాచేయగలడు?

**కృష్ణమూర్తి:** మీరెపుడైనా, ఒక వారం రోజుల పాటు, కళ్ళకుగంతలు కట్టుకుని చూశారా? మేము చేశాం, సరదాకోసం ఏమౌతుందో మీకు తెలుసా, మీ ఇతరేంద్రియాలన్నీ బాగా పనిచేయడం మొదలు పెడతాయి. మీ యింద్రియాలు చురుకౌతాయి ఆ గోడ లేక మేజా లేక కుర్చీవద్దకి మీరు చేరేముందే, అవి అక్కడ ఉన్నట్లు స్ఫురించడం మొదలు పెడతుంది కానీ మనం మాట్లాడుతున్నది, మన ఎడల, మన అంతరంగం ఎడల మనకున్న అంధత్వాన్ని గురించి లౌకిక విషయాలనెన్నిటినైనా, ఎంతగానైనా తెలుసుకుంటున్నాంకానీ, అంతరంగంలో మాత్రం అంధులమే

చర్య అంటే ఏమిటి? చర్య ఎప్పుడూ, ఏదో ఒక భావంపైనో, ఒక సూత్రంపైనో, ఓ విశ్వాసంపైనో, ఒక నిర్ణయంపైనో, ఒక ఆశ, నిరాశల పైనో ఆధారపడి వుంటుందా? మనిషి, ఓ భావాన్నో, ఓ ఆదర్శాన్నో దృష్టిలోపెట్టుకుని, ఆ ఆదర్శాన్ననుసరించడం మొదలుపెడితే, ఆ ఆదర్శానికీ–ఆచరణకీ మధ్య వ్యవధి వుంటుంది, ఆ వ్యవధే కాలం ఆదర్శంతో తాదాత్మ్యం చెందిన నేను – "నేనే ఆ ఆదర్శాన్ని అవుతాను" – చివరకు, ఆ ఆదర్శమే దాని పని అది చేస్తుంది, ఆదర్శానికీ, ఆచరణకీ మధ్య భేదం లేనట్లుగా చేస్తుంది ఆదర్శం–ఆదర్శానికి దరిదాపుగా చేసే చర్యలో ఏమిసంభవిస్తుంది? ఆ రెంటిమధ్యనున్న విరామ ఘడియల్లో జరిగేదేమిటి?

ప్ర: **నిరంతరాయంగా పోల్చుకోవటం.**

**కృష్ణమూర్తి:** పోల్చుకొనుటతోపాటు, మిగిలినదంతాను, మీరు దానిని పరిశీలించినపుడు జరిగిందేమిటి?

ప్ర: **మనం వర్తమానాన్ని పట్టించుకోవటం లేదు.**

**కృష్ణమూర్తి:** అటుపైన

ప్ర: **వైరుధ్యం.**

**కృష్ణమూర్తి:** అవును వైరుధ్యమే అది కాపట్యానికి దారితీస్తుంది నేను కోపంగా ఉన్నాను ఆదర్శం, 'కోపంగా ఉండకూడదు' అంటుంది అందువల్ల నేను దానిని అణిచిపెడుతున్నాను, అదుపులో ఉంచుతున్నాను, అనుసరిస్తున్నాను, ఆదర్శానికి తగ్గట్లుగా నన్ను సరిచేసుకుంటూవుంటాను, అందువల్ల నేనెప్పుడూ ఘర్షణలో వుంటాను, కాపట్యాన్ని ప్రదర్శిస్తుంటాను, ఆదర్శవాది అయినమనిషే కపటి అవుతాడు అంతేగాక, ఈ విభజనలో ఘర్షణ జనిస్తుంది ఇందులోనుంచి, మరిన్ని అంశాలు పుట్టుకువస్తాయి

ప్ర: **పూర్వజన్మలు మనకు గుర్తులేకుండా చేసినదెందుకు? అప్పుడు మన పరిణామక్రమం సులభమైవుండేది.**

**కృష్ణమూర్తి:** ఉండేదంటారా?

ప్ర: **తప్పులు జరగకుండా చూసుకునేవాళ్ళం.**

**కృష్ణమూర్తి:** పూర్వజన్మ అంటే మీ అభిప్రాయమేమిటి? నిన్నటి జీవితమా, ఇరవైనాలుగుగంటల క్రిందటిదా?

ప్ర: గతజన్మ.

కృష్ణమూర్తి: అంటే, పందేళ్ళ కిందటిదంటారా? అది జీవితాన్నింతకన్నా సులభతరం ఎలా చేస్తుంది?

**ప్ర: ఇంతకన్నా, బాగా అర్థం చేసుకునేవాళ్ళం.**

**కృష్ణమూర్తి:** దయచేసి, అడుగు మీద అడుగువేసుకుంటూ అర్థంచేసుకోండి-ఇంతకు ముందు, మీరు చేసినదైనా, చేయనిదైనా మీజ్ఞప్తిలో ఉన్నదనుకోండి, పందేళ్ళక్రితం, మీకు కలిగిన బాధైనా, నిన్నటిదైనా, ఒకటిగానే వుంటుంది నిన్న మీరెన్నో పనులు చేశారు, ఇష్టమైనవో, లేక చేసిన తర్వాత విచారించ దగినవో-అవన్నీ మీకు బాధ, నిరాశ, దుఃఖం కలిగించాయి అదంతా మీకు జ్ఞప్తిలో ఉన్నది, వేయేండ్లనాటిదీ జ్ఞప్తిలో ఉన్నది, అదైనా, నిన్నటిదైనా సారంలో ఒకటే అయినపుడు, దానినే పునర్జన్మ అని ఎందుకనాలి? నిన్నటిజన్మే ఈనాటి జన్మ అవుతున్నదని ఎందుకనుకోరాదు? అది మనకిష్టంలేదు, ఎందుకంటే, మనల్ని మనం, అసాధారణ జీవులంగా భావిస్తుంటాం, లేకపోతే, ఎదగటానికీ, ఏదో అవడానికీ, తిరిగి జన్మించడానికీ, చాలాకాలం ఉన్నదిలే, అంటాం తిరిగి జన్మిస్తున్నదేమిటో, మీరెప్పుడూ పరికించి, చూడటం లేదు-అవి మీస్మృతులే వాటిలో పవిత్రమూ, నిర్మలమూ అంటూ ఏమీలేవు నిన్నటి మీస్మృతే, ఈనాటి మీచర్యలోకి తోసుకువస్తుంటుంది ఇకపోతే, వేయేండ్ల నాటి స్మృతులు నిన్నలోనూ, ప్రవర్తిల్లుతున్నాయి, ఈనాడూ ప్రవర్తిల్లుతున్నాయి కనుక, గతమనేది సతతమూ పునరావృత మౌతూనే వుంటుంది ఇదంతా, ఏదో తెలివిగా, బయటపడేందుకు చేస్తున్న వివరణ అనుకోవద్దు స్మృతికి గల ప్రాధాన్యతనూ, వ్యర్థతనూ కూడ గమనించినపుడు, మీరు పునర్జన్మను గురించిన ప్రస్తావన ఇక చేయరు

చర్య అంటే ఏమిటీ అని అడుగుతున్నాను చర్య ఎపుడూ, స్వేచ్ఛగా, సహజస్ఫురణతో, వెన్వెంటనే జరుగుతుందా? లేక చర్య అనేదెపుడూ, కాలంతో బంధింపబడ్డదా, అనగా ఆలోచనతో, స్మృతితో

**ప్ర: ఒక పిల్లి, ఎలుకను పట్టుతుండగా నేను గమనిస్తున్నాను. ఆ పిల్లి 'ఇది ఎలుకగదా' అని ఆలోచించడం లేదు. తటాలున సహజసిద్ధంగా పట్టుకున్నది అలాగే మనం కూడ, సహజ స్ఫూర్తితోనే చర్య చేయాలి అని అన్పిస్తున్నది.**

**కృష్ణమూర్తి:** 'చేయాలి' 'తీరాలి' అని కాదు సర్, దయచేసి వినండి కాలాన్ని కనుక మనం అర్థం చేసుకుంటే, మనమెప్పుడూ, 'చేయాలీ' 'చేసితీరాలి' అనే మాటలు వాడమనుకుంటాను వాగ్రూపకంగానూ, మేధాపరంగానూ కాకుండా, మనసులోతుల్లో జరిగే చర్య అంటే ఏమిటీ అని అడుగుతున్నాము చర్య అనేది ఎపుడూ కాల బద్ధమేనా? స్మృతిలోనుంచీ, భయంలోనుంచీ, నిరాశలోనుంచీ పుట్టుకువచ్చే చర్య ఎపుడూ కాలబద్ధమే. సంపూర్ణమైన స్వేచ్ఛతో కూడుకున్న చర్య అంటూ ఏదైనా ఉన్నదా, ఉంటేమాత్రం, అది కాలంనుంచి విడివిడిన చర్య అవుతుంది

**ప్ర: ఎవరైనా సర్పాన్ని చూసినపుడు, తక్షణం చర్యకు పూనుకుంటారని మీరన్నారు. కానీ చర్యతోపాటు సర్పాలూ పెరుగుతుంటాయి. జీవితం, అనుకున్నంత సులభం కాదు,**

అక్కడ ఒక సర్పమేకాదు, రెండుఉండవచ్చు, మరెన్నో ఉండవచ్చు. ఇది ఒక గణిత సంబంధమైన సమస్యలాగా వుంటుంది. అపుడు కాలం ప్రవేశించక తప్పదు.

**కృష్ణమూర్తి:** మీరంటున్నదేమంటే మనం పులులతో నిండిన ప్రపంచంలో నివసిస్తున్నామనీ, మనిషి ఒక పులినే కాదు, మానవాకారంధరించిన పన్నెండు పులులను, తారసిల్లుతాడనీ, వారంతా క్రౌర్యంతో, హింసతో, అత్యాసతో, లోభంతో, ప్రతి ఒక్కరూ, తమతమ ప్రత్యేక సుఖ, సంతోషాల కోసం వెతుక్కుంటూ వుంటారనీ అంటున్నారా? ఆ ప్రపంచంలో, నివసించడానికీ, పని చేయడానికీ, ఒక పులివెంట, మరొక పులిని సంహరించుకుంటూ పోవడానికీ, కాలం అవసరమంటారు ఆపులిని నేనే – అది నాలోనే వుంది – నాలో పన్నెండు పులులున్నాయి ఆ పులులను ఒక దాని తర్వాత మరొకదానిని, వదిలించుకోవాలంటే, మీకు సమయం కావాలంటారు అదే మనమందరం కలిసి ప్రస్తావించుకుంటున్నది నాలోని ఆ సర్పాలను క్రమేణా చంపదల్చుకుంటే, కాలం అవసరమని మేము ఒప్పుకున్నాము కానీ ఈ పులులతో, సర్పాలతో కూడుకున్నది ఈ 'నేనే', అందుకని మేమంటున్నది, నాలో ఉన్న ఆ జంతువుల నన్నింటినీ, ఒకదాని తర్వాత మరొకదానిని ఎందుకు చంపాలీ? అంటున్నాం. నాలో వెయ్యి 'నేను'లు ఉండవచ్చు, వెయ్యి సర్పాలుండవచ్చు వాటన్నిటినీ చంపేసరికి, ఆపాటికి, నేనే చనిపోవచ్చు

కనుక, దీనికి వేరే మార్గంలేదా–దయచేసి వినండి, సమాధానం యివ్వద్దు, కనుక్కోండి–ఆ సర్పాలనన్నిటినీ, క్రమక్రమంగా కాకుండా ఒకే విడతలో వదిలించుకోవడం ఎలా? నాలోని ఆ మొత్తం జంతువుల వల్లా, ఆ మొత్తం వైరుధ్యాల వల్లా కలిగే ప్రమాదాన్ని చూడగలనా, వాటినుంచి తక్షణం విడివడగలనా? అదే గనుక చేయలేకపోతే, నాకిక గతిలేదు నేనెన్నో రకాలుగా నటించవచ్చు, కానీ నాలోని ప్రతి ఒక్కదానినీ తక్షణం తుడిచి పెట్టలేకపోతే మాత్రం, నేను ఒక జన్మకాదు, పదివేల జన్మలనెత్తినా, నేను శాశ్వతంగా వాటికి బానిసనే కనుక, క్షణమాత్రపు వీక్షణలోనే, నాలోని, ఆ మహాసర్పాన్నీ, ఆ ప్రత్యేకమర్కటాన్నీ, అంతంచేసి వేసేటంతగా, చూసే విధానాన్నీ, చర్యనాచరించే విధానాన్నీ, నేను కనుగొనవలసి ఉన్నది

**ప్ర: అలానే చేయండి.**

**కృష్ణమూర్తి:** కాదమ్మా, ఇది నిజంగా అత్యంత అసాధారణమైన విషయం యాదాలాపంగా, 'ఇలా చెయ్యమ'నీ లేక, 'అలా చేయవద్దు' అనీ మీరు చెప్పగలిగిలేరు దీనికి బ్రహ్మాండమైన విచారణ చేయాలి మీకిది తెలిసిపోయిందనీ, లేక, ఇలాచేయాలీ, అలాచేయాలీ అనిగానీ చెప్పవద్దు అలాంటి మాటలపై నాకు ఆసక్తిలేదు–నేను కనుక్కోవాలి

**ప్ర: నేను దానిని అలా చూడగలిగితే బాగుండు!**

**కృష్ణమూర్తి:** దయచేసి, 'కలిగితే' అనవద్దు

**ప్ర: నేను దేనినైనా, చూడగలిగితే, దానిని మాటలలో వ్యక్తం చేయవచ్చునా, లేక నా మనసులోనే ఉంచుకోవలెనా?**

**కృష్ణమూర్తి:** అత్యంత సరళమైన భాషలో, చెప్పబడుతున్నదానిని మీరు ఎందుకు

అనువదిస్తారు? చెప్పినదానిని చెప్పినట్లుగా, ఎందుకు చూడలేకుండా ఉన్నారు? మనలో ఎన్నో జంతువులున్నాయి, ఎన్నో ప్రమాదాలున్నాయి. వాటన్నిటి నుంచీ, ఒకే ఒక గ్రహణశక్తితో, స్వేచ్ఛనొందగలనా-తక్షణం వీక్షించగలనా? మీరిది చేసి వుండవచ్చును, అమ్మా, మీరిది చేశారా, లేదా అని నేనడగటం లేదు అలా అడగడం కొంటెతనమవుతుంది నేనడుగుతున్నదల్లా, 'ఇది సాధ్యమేనా' అని

**ప్ర: చర్యలో రెండు భాగాలున్నవి, అంతరంగంలో, నిర్ణయం చేసే భాగం, తక్షణం సంభవిస్తుంది. బాహ్య ప్రపంచానికి సంబంధించిన చర్యలకు సమయం కావాలి నిర్ణయమంటేనే, అంతర్గత క్రియ. ఈ రెండు రకాల చర్యలమధ్య వంతెన వేయదానికి కాలం అవసరం. భాష, ప్రసారాలకు సంబంధించిన సమస్య ఇది.**

**కృష్ణమూర్తి:** అర్థమైంది సర్, బాహ్యంలోని చర్యకు సమయం అవసరం అంతర్గత క్రియ అనగా గ్రహింపు-చర్య; గ్రహింపు, నిర్ణయం, తక్షణ చర్యలతో కూడిన అంతర్గత క్రియను, కాలం యొక్క అవసరం ఉన్న బాహ్యచర్యకు, వంతెనవేసి కలపడం ఎలా కుదురుతుంది? ప్రశ్నస్పష్టంగా ఉన్నదా? నన్ను చెప్పమంటే, రెంటినడుమ వంతెన అవసరం లేదంటాను రెంటి మధ్యా వంతెన వేయడము, రెంటినీ జత కలపడము అనే ప్రశ్నేలేదు దీని అర్థమేమిటో, వివరిస్తాను. ఇక్కడి నుండి అక్కడికి చేరటానికి, సమయం అవసరమనేది స్పష్టంగా గ్రహించాను ఒక భాషని నేర్చుకోవాలన్నా, బయటి ప్రపంచంలో ఒక పని నిర్వహించాలన్నా కాలం అవసరమే అయితే, అంతర్గత క్రియకు కాలం అవసరమా? కాల స్వభావాన్ని నేనర్థం చేసుకోగలిగితే, బాహ్యంలో కాలం యొక్క అవసరం ఉన్న పనులను చక్కగా నిర్వర్తించి, అంతరంగస్థితిలో మాత్రం కాలాన్ని జోక్యం చేసుకోనివ్వను బాహ్యానికి కాలం అవసరమని గుర్తించానుకాబట్టి, నేను, బాహ్యంతో మొదలు పెట్టను కానీ. నన్ను నేనిలా ప్రశ్నించుకుంటున్నాను, అంతరంగంలో గ్రహింపు-నిర్ణయం-చర్య; 'వీటిలో కాలమనేది అసలున్నదా' అని 'అసలు నిర్ణయమనేదాని అవసరం ఏమైనా ఉన్నదా' అని కూడ అడుగుతున్నాను-నిర్ణయమంటే కాలంలో అతి స్వల్ప భాగం - ఒక సెకనో, బిందు మాత్రమో, 'నేను నిర్ణయించాను' అంటే అక్కడ కాలాంశం స్వల్పంగానైనా ఉన్నట్లే కనుక, నేనడుగుతున్నదేమంటే, ఇందులోకి నిర్ణయమనేది అసలు ఎందుకు ప్రవేశించాలి? లేక, నిర్ణయించడమనేది, నా నిబద్ధతలోభాగమా? అందుకనే అది, 'నీకు కాలం కావాలి' అని చెప్తుంది కనుక, నిర్ణయంతో సంబంధంలేని గ్రహింపు, చర్యలనేవి ఉన్నాయా? అనగా నాకు భయం కలిగిందని తెలిసింది ఆలోచన ద్వారా, గతస్మృతుల ద్వారా, అనుభవాల ద్వారా నిన్నకలిగిన భయం, ఈనాటి భయంగా పునరుత్పత్తి చెందింది. ఆ భయం యొక్క పూర్తి స్వరూపాన్నీ, దాని నిర్మాణాన్నీ, దాని అంతర్భావాన్ని, అర్థం చేసుకున్నాను నిర్ణయంతో నిమిత్తం లేకుండా చూచినదే-చర్య, అనగా, అదే దానినుండి స్వేచ్ఛ. ఇది సాధ్యమేనా? అవుననవద్దు, నేను చేశాను, మరెవరో చేశారు అనవద్దు-అది కాదు విషయం భయం ఉద్భవిస్తున్న సమయంలోనే, అది తక్షణం అంతం కాగలదా? ఉపరితలానికి సంబంధించిన భయాలున్నాయి, అనగా ప్రపంచపు భయాలు

ప్రపంచమంతా పులులతో నిండివున్నది నాలో భాగమైన ఆ పులులు మారణధ్వంసం చేయబోతున్నవి, అందువల్ల పులిలో భాగమైన నాకూ-మిగిలిన పులులకూ మధ్య యుద్ధం

ఇవికాక, లోనిభయంకూడ ఉన్నది - మానసికమైన అభద్రత, మానసికపరంగా అనిశ్చయత్వం - అంతా ఆలోచన ద్వారానే తీసుకు రాబడుతున్నది ఆలోచన సుఖాన్ని పెంచుతున్నది, ఆలోచన భయాన్నీ పెంచుతున్నది - అదంతా చూస్తున్నాను సర్పం వల్ల జరిగే ప్రమాదాన్ని, కొండకొసవద్ద, లోతుగా ప్రవహించేనది వద్ద జరిగే ప్రమాదాలను చూస్తున్నట్లే, భయం యొక్క ప్రమాదాన్ని చూస్తున్నాను - సంపూర్తిగా చూస్తున్నాను అలా చూచుటే అంతమొందించటం, ఇక నిర్ణయించుటకు లిప్తకాలం కూడ మధ్యలో ఉండదు

**ప్ర: కొన్నిసార్లు, మీరొక భయాన్ని గుర్తించగలిగినప్పటికీ, ఆ భయమింకా మీలో మెదులుతూనే వుంటుంది.**

**కృష్ణమూర్తి:** ఈ విషయాన్ని మనం చాలా జాగ్రత్తగా తరుచుకుంటూ వెళ్ళాలి మొట్టమొదట, నాకసలు భయాన్ని వదిలించుకోవాలని లేదు నేను దానిని వ్యక్తం చేయాలనీ, దాని నర్థం చేసుకోవాలనీ, దాన్నలాగే ప్రవహించనిచ్చి, రానిచ్చి అది నాలో బ్రద్దలవాలని, అలాగే మరితరమైనవన్నీ జరగాలని ఉంది నాకసలు, భయమంటే ఏమిటో తెలియదు, కానీ దాన్నిచూసి, బెదిరిపోతున్నానని మాత్రం తెలుసు ఇపుడు నేను ఈ భయం ఏస్థాయిలో, ఎంతలోతులో ఉన్నదీ, వ్యక్తి చేతన లోనా లేక దానికి మూలంలోనా, నా ఉనికి లోలోతు స్థాయిల్లోనా నా మనసులో, పరిశోధించబడకుండా ఉన్న భాగాల్లోనా అనేది కనుగొనాలనుకుంటున్నాను అదంతా బయటికి వచ్చి, బట్టబయలవాలని కోరుతున్నాను మరి, దీనినెలా చేయాలి? నేను చేసితీరాలి-క్రమేణాకాదు-అర్థమౌతున్నదిగదా? అది నా ఉనికిలోనుంచే సంపూర్తిగా వెలికి వచ్చితీరాలి

**ప్ర: అక్కడ వెయ్యిపులులుండగా, నేను నేలమీద కూర్చుంటే, నేను వాటిని చూడలేను. కానీ, ఎత్తైన ప్రదేశానికి వెళ్ళినట్లయితే, నేను వాటితో వ్యవహరించగలను.**

**కృష్ణమూర్తి:** 'అయితే' అనవద్దు 'నేనెగరగలిగితే అపుడు నేను ఈ పుడమిసౌందర్యాన్నంతా తిలకించగలను, కానీ నేనెగరలేను నేనున్నదిక్కడే. ఇలాంటి సిద్ధాంతపరమైన ప్రశ్నలకు ఏమాత్రం విలువ లేదు, అయితే, ఆ విషయాన్నింకా మనం గ్రహిస్తున్నట్లు లేదనిపిస్తుంది నేను ఆకలితోవుంటే, మీరు నాకు సిద్ధాంతాలు వడ్డిస్తున్నారు ఇక్కడ ఓ సమస్య ఉంది, దయచేసి దాని వంక చూడండి ఎందుకంటే, అందరికీ భయం ఉంటుంది, ప్రతి ఒక్కరూ ఏదో ఒక రకమైన భయంతో వుంటారు మనసులోతుల్లో నిగూఢంగాదాగిన భయాలెన్నో ఉంటాయి, పైపైభయాలు, ప్రాపంచిక భయాలు, ఉద్యోగం పోయినందువల్ల జనించిన భయాలు లేక ఇదో, అదో-భార్య పోవడం, కొడుకుపోవడం అవన్నీ నాకు బాగానే తెలుసు బహుశా, అట్టడుగు పొరల్లోదాగిన భయాలు ఎన్నో ఉండివుంటాయి, కానీ వాటినన్నిటినీ నేను, ఈ మనసు, ఆ మొత్తాన్ని తక్షణం ఎలా బయటపెట్టగలదు? మీరేమంటారు?

ప్ర: అంటే, మనం ఆ జంతువుని ఒకే విడతలో తరిమివేయాలని మీరు అంటున్నారా, లేక ప్రతిసారి దానిని వేటాడవలసిందేనా?

**కృష్ణమూర్తి:** ఆయన ఏమంటున్నారంటే, ఆ జంతువుని పూర్తిగా, శాశ్వతంగా తరిమివేయడం సాధ్యమేననీ, ఒకరోజు తరిమేసి మర్నాడు రానివ్వడమంటూ, వుండదనీ మీరు సూచిస్తున్నారని 'అంటున్నారు' అదే మేమంటున్నది, నేను ఆ జంతువుని మళ్ళీమళ్ళీ వేటాడదల్చుకోలేదు అన్నిరకాల బోధనాపద్ధతులు, అందరు సాధువులు, అన్నిమతాలవారు, మానసిక శాస్త్రజ్ఞులందరు అనేది దానిని కొద్దికొద్దిగా తరిమివేయమని ఆ మాటలవల్ల ప్రయోజనం లేదు అది మళ్ళీ తిరిగి రాకుండా వుండేటట్లు, దాన్ని తరిమివేయడమెలాగ అనే విషయాన్నే నేను కనుక్కోవాలి. అది తిరిగి వచ్చినపుడు, నేనేంచేయాలో నాకుతెలుసు, దాన్నసలు ఇంట్లోకే రానివ్వను మీకు బోధపడిందా?

**ప్ర: మనమిపుడు ఆ జంతువుకి, దాని అసలు పేరు పెట్టాలి. దానిపేరు ఆలోచన. అది వెనక్కితిరిగి వస్తే, దాన్నేం చేయాలన్నది మనకి తెలుసు.**

**కృష్ణమూర్తి:** ఏం చేయాలో నాకు తెలియదు - చూద్దాం - మీరంతా ఆతురతతో ఉన్నట్లున్నారు

**ప్ర: ఇది మా జీవితం కదండీ-ఆతురతతో ఉండకతప్పదు.**

**కృష్ణమూర్తి:** మీ ఆత్రం సమాధానం చెప్పడంలో ఉన్నట్లున్నది, ఆతురత ఉండాల్సిందే, కానీ, ఇది ఎంతో కష్టమైన విషయమండీ, ఊరికే, మాటలను దొర్లించినందువల్ల, ప్రయోజనమేమిటి? దీనికి జాగ్రత్త కావాలి

**ప్ర: ఇప్పటికిప్పుడే మనం దీన్నిని ఎందుకు గ్రహించకూడదు?**

**కృష్ణమూర్తి:** మేమంటున్నదీ అదే

**ప్ర: మిమ్మల్ని చూసినప్పుడు ఏం జరుగుతున్నది? ముందు మీరూపం కనిపిస్తుంది. మీరు నన్ను చూడండి, మొదట జరిగేదేమంటే, మీ కంటికి కనిపించేది నా రూపం. సరేనా? ఆ తర్వాత, ఏం జరుగుతున్నది? రూపాన్ని గురించిన ఆలోచన మెదుల్తుంది.**

**కృష్ణమూర్తి:** ఆమె చెప్తున్నదీ అదే, సరిగ్గా అదే ఆలోచనే జంతువు దయచేసి, ఆ విషయానికే కట్టుబడి వుండండి. ఆ జంతువుని ఆలోచన అనీ, 'ఆత్మ' అనీ, 'నేను' అనీ, 'అహ' మనీ, భయం, ఈర్ష్య, లోభం అంటూ ఇంకా ఏవేవో పేర్లు పెట్టి, ఆ తర్వాత, దానిని రకరకాలుగా వర్ణిస్తూ పోకండి ఇదంతా, ఆ జంతువేనని మేమంటున్నాం ఆ జంతువుని క్రమేణా తరిమివేయలేమని తెలుసుకున్నాం ఎందుకంటే, అది ఎప్పుడూ వివిధ రూపాలలో తిరిగి వస్తుంటుంది నాకు కొద్దిపాటి ఎరుక ఉన్నది కాబట్టి, ఈ మూర్ఖమంతా ఏమిటి, నిరంతరం ఇలా ఈ జంతువుని, తరిమికొట్టడం-అది తిరిగి రావడం, మళ్ళీ తరిమికొట్టడమనే విధానం కాకుండా, అది మళ్ళీ తిరిగి రాకుండా, శాశ్వతంగా తరిమి వేయడం సాధ్యమా అని కనుక్కోవాలి

ప్ర: నాలో పలురకాల క్రియలు, పలురకాల వేగాలతో ప్రవర్తిల్లుతున్నట్లు చూశాను ఒక క్రియ మరో క్రియను, ముందుకు తోస్తూవుంటే, ఏమీ సంభవించదు. ఉదాహరణకి, భావోద్వేగం భావాన్ని వెంబడించటం; మనిషి అన్ని రకాల క్రియలతోనూ చూడాలి.

**కృష్ణమూర్తి:** అదే విషయాన్ని, మీరు భిన్న పదాలతో చెప్తున్నారు

ప్ర: మీరు దేనినో వివరించటం మొదలు పెట్టారు. దానికి అంతరాయం కలిగింది. మీకు భయాన్ని వదిలించుకోవాలని ఎంత మాత్రం లేదంటూ చెప్పడం మొదలు పెట్టారు.

**కృష్ణమూర్తి:** మొట్టమొదట, నాకు ఆ జంతువుని వదిలించుకోవాలని లేదని చెప్పాను నాకు దానిని తరిమి కొట్టాలని లేదు చేతిలోకి చెన్నాకోలనిగానీ, పట్టు త్రాటినిగానీ, తీసుకోకముందే, దానిని తరిమి వేయాలని చూస్తున్న వారెవరు, అని కనుగొనదల్చుకున్నాను బహుశా అలా దానిని తరిమి వేయాలనుకున్న వాడు అంతకన్నా పెద్దపులేమో! కనుక, నాకు నేను చెప్పుకున్నదేమంటే, 'నాకు దేనినీ తరిమి వేయాలని లేదు' అని దీనికున్న ప్రాముఖ్యమేమిటో చూడండి

ప్ర: తరిమి వేయాలనుకోవడం, చివరకి మీకు మీరే. వేసుకున్న మరణ దండన అవ్వచ్చునేమో!

**కృష్ణమూర్తి:** నాకు తెలియదు మెల్లగా కదులుదాం సర్, నన్ను వివరించనివ్వండి ఇంతకు ముందు నేనన్నట్లు, ఆ జంతువుని తరిమి వేసే ముందు, తరిమి కొట్టదల్చుకున్న జీవి ఎవరో కనుక్కోవాలనుకున్నాను అది ఇంతకన్నా పెద్దపులేమో నంటున్నాను ఆ మొత్తం పులులను వదిలించుకోవాలనుకుంటే, చిన్నపులిని తరమడానికి, పెద్దపులిని తెచ్చి ప్రయోజనం లేదు. కనుక, 'ఆగు', 'నేను దేనినీ బైటికి తరిమివేయాలనుకోవడం లేదు' అన్నాను నామనసులో ఏం జరుగుతున్నదో చూడండి నేను దేనినీ తరిమి వేయాలనుకోవడం లేదు కానీ, నేను వేచి చూడాలనుకున్నాను నేను పరిశీలించదల్చుకున్నాను పెద్దపులి, చిన్నపులిని తరిమికొట్టగలదా అనే విషయం స్పష్టంగా తెలుసుకోదల్చుకున్నాను ఈ ఆట ఎప్పటికీ యిలాసాగి పోతూనే వుంటుంది ప్రపంచంలో జరుగుతున్నదదే-ఓ ప్రత్యేకదేశపు నిరంకుశత్వ ధోరణి, చిన్నదేశాన్ని వెంటాడుతున్నట్లే

కనుక, నేనిపుడు అత్యంత సావధానుడినై ఉన్నాను-వినండి-నేను దేనినీ తరమకూడదు, ఏదో ఒక దానిని బయటికి తోసేయాలనీ, దానినధిగమించాలనీ, దానిపై ఆధిపత్యం చెలాయించాలనే సూత్రాన్ని, దాని మూలం వద్దనే ఛేదించాలి కారణం ఏమంటే చిన్న పులిని వదిలించుకోవాలని చేసిన ఆ నిర్ణయమే పెరిగిపెరిగి పెద్దపులిగా అవ్వచ్చు అందువల్ల, నిర్ణయమనేదంతా అంతరించాలి, దేనినో వదిలించుకోవాలి దేనినో తరిమి వేయాలి అనే ప్రేరణలన్నీ ఆగిపోవాలి అప్పుడే నేను చూడగలను అపుడు నాతో నేనిలా అనుకుంటాను 'నేను దేనినీతరిమి వేయను' అందువల్ల కాలమనే బరువు నుంచి నేను విముక్తి చెందాను, అనగా ఒకపులిని మరొకపులితో తరిమివేయడం అందులో విరామకాలం వుంటుంది కనుక నేనంటున్నదేమంటే, "అందువల్ల నేనేమీ చేయను, నేను తరిమివేయను, నేను ఏచర్య చేయను, నేను నిర్ణయించను, నేను ముందు చూసి తీరాలి'-

నేను చూస్తున్నాను - 'అహ' మని కాదు నా అర్థం, కానీ, నా మనసు చూస్తున్నది, మెదడు గమనిస్తున్నది పలు రకాల పులులను గుర్తుపట్టగలను తల్లిపులి తనపిల్లలతో, తన భర్తతో ఉన్నది, అదంతా నేను గమనించగలను కానీ నాలో ఇంకా లోతుగా మరెన్నో వుండివుండాలి, అవన్నీ బయటపడాలనుకున్నాను వాటిని ఎలాబైటికి తేవాలి, చర్య ద్వారానా, చేతల ద్వారానా? ఆగ్రహాన్ని పెంచీ, పెంచీ, ఆ తర్వాత నెమ్మదిస్తూ, వారం తిరిగేసరికల్లా మళ్ళీ ఆగ్రహం చెందడం, మళ్ళీ నెమ్మదించడం; అంతేనా! లేక, అన్నిపులుల్నీ, చిన్నదానినీ, పెద్దదానినీ, అప్పుడే పుట్టిన దానినీ - ఆ మొత్తం పులుల్ని, చూచుటకు వేరే విధానం ఏదైనా ఉన్నదా? ఈ మొత్తం వ్యవహారం అర్థం అయేటంత సంపూర్తిగా నేను గమనించగల్గి వున్నానా? ఆవిధంగా చేయలేనట్లయితే, నా జీవితం పూర్వంలాగే, పెద్దమనుష్యుల సరళిలో, క్లిష్టంగా, తెలివితక్కువగా, యుక్తితో సాగుతుంది అంతే-మీకు, వినడమనేది తెలిసినట్లయితే, ఈ ఉదయపు బోధ ముగిసింది

ప్రతి ఉదయం, ఓ మాస్టరుగారు తన శిష్యులతో ప్రసంగించటం గురించిన కథ మీకు గుర్తున్నదా? ఎప్పటివలెనే, ఒకరోజున, ఆ గురువు వేదికపై కూర్చున్న సమయంలో, ఒక పక్షివచ్చి కిటికీ రెక్కపైన వ్రాలింది, పాట పాడటం మొదలు పెట్టింది. గురువుగారు దానినలాగే పాడనిచ్చాడు కొంతసేపు, అలా పాడినతర్వాత అది ఎగిరిపోయింది. అప్పుడు ఆ గురువు, తన శిష్యులతో, 'ఈనాటి ప్రవచనం పూర్తి అయింది' అంటూ లేచారు

*సానెన్, స్విట్జర్లాండు, ఆగష్టు 7, 1969*

# 4. తెలియనిదానిలోనికి చొచ్చుకుపోవుట

**అణచివేత, నిశ్చలత్వంలో నుంచి చర్య. తనలోకి తాను చేసే ప్రయాణం, బూటకపు ప్రయాణాలు - ఊహాకల్పితమైన 'తెలియనిది.'**

**కృష్ణమూర్తి:** మనిషి తనలోని జంతుసమూహాన్నంతా తీసి పక్కన పెట్టడం ఎలా అని అడుగుతున్నాము మనం దీనినంతా చర్చిస్తున్నది ఎందుకంటే మనిషి తెలియని దానిలోకి చొచ్చుకుపోవలసి ఉన్నదని చూశాము కాబట్టి - కనీసం నాకైనా అలా అన్పించింది కనుక , నిజానికి, ఇలాంటి విషయాన్ని ఏమంచి గణిత శాస్త్రజ్ఞుడైనా, భౌతిక శాస్త్రవేత్త అయినా, తెలియని దానిని పరిశోధించవలసిందే బహుశః తన భావోద్వేగంతో, ఊహాపోహలతో అతిగా కొట్టుకుపోకుండా ఉండగల కళాకారుడైనా కూడ పరిశోధించక తప్పదు ఇక, నిత్య జీవిత సమస్యలతో జీవించే మనవంటి, సాధారణ మానవులంకూడ ఒక లోతైన అవగాహనతో జీవించవలసిందే మనం కూడ ఆ తెలియని దానిలోకి తొలుచుకుంటూపోవలసిందే మనసు, స్వయంగా కల్పించుకున్న సర్పాలు, క్రూరసర్పాలు, వానరమూకలు, వాటితోపాటు వచ్చిన కష్టాల్నీ, వైరుధ్యాల్నీ తరిమివేయవలసి వచ్చినందున-అనగా మనమే-తెలియని దానిలోకి చొచ్చుకుపోవడం సాధ్యం కావడం లేదు సాధారణ మానవులమైన మనకు, మిరుమిట్లుగొలిపే మేధగానీ, గొప్ప స్వాప్నిక దర్శనాలుకానీ అనుగ్రహింపబడ నందువల్ల, కేవలం విసుగుతో, వికృతమైన దైనందిన జీవితాలను గడుపుతూవున్నాం దానినంతటినీ, తక్షణం మార్చటమెలా అనే విషయంలో మనం శ్రద్ధ వహించాం ప్రస్తుతం మన పరిగణనలో ఉన్న విషయమిదే నూతనాన్వేషణల ద్వారా కల్పించబడిన వాటివల్లగానీ, కొత్త ఒత్తిడులు, కొత్త సిద్ధాంతాలు, రాజకీయ రంగంలో ఏర్పడిన కొత్త పరిస్థితులవల్లగానీ మనుష్యులు మారతారు, అవన్నీ గుణాత్మకమైన మార్పుని కొంతవరకు సాధిస్తాయి కానీ, మనం మాట్లాడుకుంటున్నది, మనిషి ఉనికిలోనే మౌలికంగా రావలసిన సమూల విప్లవం గురించి, అయితే అలాంటి మార్పు క్రమక్రమంగా తీసుకురావాలా లేక తక్షణం సంభవించాలా! నిన్న మనం క్రమక్రమంగా వచ్చే మార్పులో యిమిడి ఉన్నవన్నీ, అనగా మార్పుని సాధించేలోపల, దానిని చేరుటకు అవసరమైన కాలం, ప్రయత్నం వగైరాలను తరచిచూశాం లక్షలాది సంవత్సరాలుగా మానవుడు ఈ ప్రయత్నం చేస్తూనే వున్నాడని, కానీ ఎందుచేతనో అతడు దీనిని సాధించలేక పోయాడనీ చెప్పాము - బహుశా ఏ ఒకరిద్దరోతప్ప

కనుక, మనం, మనలో ప్రతి ఒక్కరం, దానిని బట్టే ఈ ప్రపంచం- ప్రపంచమేమనం, మనమే ప్రపంచం కనుక, అవి రెండూ వేర్వేరుస్థితులు కావు కనుక-మనంతట మనమే సృష్టించుకున్న ఈ అవస్థలు, ఈ ఆగ్రహం, ఈ ద్వేషం, ఈ శత్రుత్వం, వీటివల్ల అనుభవించవలసిన ఈ చేదునంతా-తక్షణం తుడిచి పెట్టగలమా అనే విషయాన్ని తరచి చూడవలసిన అవసరం ఉన్నది చూడగా, చూడగా, మనిషికీ చేదు అనుభవాలనేవి సర్వసాధారణమా అనిపిస్తున్నది ఈ చేదునీ (మనోవ్యాకులత) దానికి గల కారణాలనీ, దాని మొత్తం నిర్మాణాన్నీ చూస్తూ, తెలుసుకుంటూ, తక్షణం దానిని తుడిచి వేయగలమా? పరిశీలన జరిపినపుడు మాత్రమే అది సాధ్యమౌతుందని చెప్పాం మనసు కనుక, అతి తీవ్రంగా పరిశీలించగలిగినపుడు, ఆ పరిశీలనే, చర్యగామారి ఆ చేదునంతా అంతం చేసేస్తుంది చర్య అంటే ఏమిటి స్వేచ్ఛగా, సహజ స్ఫురణతో తక్షణం ఆచరించగల చర్య ఏదైనా ఉన్నదా? అనే ప్రశ్నను కూడ తరచి చూశాం లేక, చర్య ఎపుడూ మనస్మృతుల మీద, మన ఆదర్శాలమీద, మనలోని వైరుధ్యాలమీద, మానసిక గాయాలమీద, మనోవ్యాకులతమీద, మరికొన్నింటిమీద ఆధారపడి ఉంటున్నదా, లేక, చర్య ఎప్పుడూ ఓ ఆదర్శానికో, ఓ సూత్రానికో, ఓ నమూనాకో సరిచూసుకుంటూ జరుగుతుంటుందా? అటువంటి చర్య, 'ఉండాలనుకున్నదానికీ', 'ఉన్నస్థితి'కీ మధ్య వైరుధ్యం సృష్టిస్తుంది కనుక, అలాంటి చర్య, చర్యేకాదన్నాం మీ దృష్టిలో, ఒక ఆదర్శం ఉంటే, మీరున్నదానికీ, ఉండాలనుకున్నదానికీ, మధ్య నున్న దూరం దాటవలసి వుంటుంది ఆ ఉండాలనుకున్నది సంభవించటానికి సంవత్సరాలు పట్టవచ్చులేక, అనేకానేకులు, విశ్వసించినట్లు, ఊహాజనితమైన ఆ ఆదర్శాన్ని చేరుటకు, జన్మవెంబడి జన్మ, అనేక జన్మల నెత్తవలసి రావచ్చు నిన్నటిదే, ఈనాడు తిరిగి జన్మిస్తుందని చెప్పాము ఆ నిన్నటిది లక్షలాది సంవత్సరాల వెనకనుంచీ సాగుతూవచ్చిన దవ్వచ్చు, లేక ఇరవై నాలుగు గంటల క్రిందటిదే కావచ్చునని చెప్పాం, చర్యకనుక వర్తమాన-భవిష్యత్తులమధ్య ఉన్నవిభజనపై ఆధారపడినట్లయితే అనగా, 'ఉండాలనుకున్నదానిపై దృష్టినుంచి నంతకాలం, తత్సంబంధమైన గతమింకా వెన్నాడుతూనే వుంటుంది ఇదంతా, వైరుధ్యాన్నీ, ఘర్షణనీ, దుఃఖాన్నీ కలిగిస్తుంది కనుక, అది చర్యకానేకాదు గ్రహించటమేచర్య మీరు ప్రమాదాన్నెదుర్కొంటున్నపుడు, దానిని గ్రహించటమే చర్య అది తక్షణం సంభవిస్తుంది నిన్నమనం అంతవరకు వచ్చామనుకుంటాను

ఓ గొప్ప సంక్షోభం, ఓ సవాలు, ఓ పెనుదుఃఖం ఆవరించిన ఓ క్షణం ఉంటుంది అపుడు ఆ మనసు ఆ క్షణకాలం, అసాధారణంగా నిశ్శబ్దమైపోతుంది, అది దిగ్భ్రమకులోనయింది ఈ స్థితిని మీరు ఎపుడైనా పరిశీలించారో, లేదో నాకు తెలియదు సాయం సమయాన కానీ, ప్రాతఃకాలమందుకానీ, అపూర్వమైన ఆ కాంతి, ఆ పర్వతంపై ప్రసరిస్తుండగా, ఆ వెలుగు నీడల మధ్య బ్రహ్మాండమైన దానిరూపమూ, దాని రీవీ, లోతైన దాని ఏకాంతత్వం-అదంతా మీరు చూసినపుడు, మీ మనసు, దానినంతా తనలో యిముడ్చుకోలేదు, ఒక్కక్షణం అది అలా నిశ్శబ్దంలో ఉండిపోతుంది అనతికాలంలోనే అది ఆ దిగ్భ్రమనుండి తేరుకుని, స్వంత నిబద్ధత ననుసరించి, స్వంత సమస్యల కనుగుణంగా

స్పందిస్తుంది క్షణకాలం మాత్రమే, అది సంపూర్ణనిశ్శబ్దంలో ఉన్నది, కానీ అంతటి సంపూర్ణ నిశ్శబ్దతను, అది తనలో నిలుపుకోలేక పోయింది దిగ్భ్రాంతికి గురిచేసి, ఆవిధమైన నిశ్చలతలో మనసుని వుంచవచ్చు దిగ్భ్రాంతులమైనపుడు, అలాంటి కదలని మెదలని స్థితి మనమందరం ఎరిగే వుంటాము బాహ్యంలో ఒక సంఘటన ద్వారా కానీ, జెన్ మతస్థులు వరుసగా అడిగే అసాధ్యమైన ప్రశ్నలకు నిరుత్తరులయేటట్లు చేసిగానీ, అంతరంగాన్ని, కృత్రిమంగా నిశ్శబ్దం చేయవచ్చు లేక, ఏదో కొన్ని భ్రమలద్వారా, కొన్ని సూత్రాల ద్వారా మనసుని బలవంతంగా నెమ్మది చేయవచ్చు-ఇవన్నీ బాల్య చేష్టలనీ, ప్రాజ్ఞతాలేమిని సూచిస్తాయనీ తెలుసుకోవచ్చు మేము చెప్తున్నదేమంటే, గ్రహించగలశక్తి ఉన్నమనసుకి, మనం ఏ అర్థంలో ఆ పదాన్ని వాడుతున్నామో, దానిని బట్టి, గ్రహించే చర్య గ్రహించుటకై మనసు సంపూర్ణంగానిశ్చలమవాలి, కాని పక్షంలో అది చూడజాలదు, మీరు చెప్తున్నదానిని, నేను వినదల్చుకుంటే, నేను నిశ్శబ్దంగా వినాలి ఎటెటో విహరించే ఆలోచనతో వింటేను, చెప్తున్నదానిని వ్యాఖ్యానిస్తేను, ప్రతిఘటిస్తేను - అవన్నీ నిజమైన శ్రవణాన్ని ఆటంకపరుస్తాయి

కనుక, వినదల్చిన, పరిశీలించదల్చిన, చూచి లేక గమనించదల్చిన మనసు అసాధారణమైన నెమ్మదితో ఉండాల్సిన అవసరం ఎంతైనా ఉన్నది అలాంటి నిశ్చలత, మనసుని దిగ్భ్రమకు గురిచేయడం ద్వారా, ఒక ప్రత్యేక భావంతో లీనమై పోయేటట్లు చేయడం ద్వారా తీసుకురావడం సాధ్యంకానిపని ఒక పిల్లవాడు ఒక బొమ్మను చూచుకుంటూ, దానితో లీనమైపోయినపుడు సద్దుమణిగివుంటాడు, కానీ వాడు దానితో ఆడుకుంటున్నాడు నిజానికి ఆ బొమ్మే ఆ పిల్లవాని మనసుని ఆకట్టుకుంది, ఆ బొమ్మే వాడి మనసుని నిశ్శబ్దంచేసింది మత్తుమందుపుచ్చుకున్నా, లేక కృత్రిమమైనదేది చేస్తున్నా, ఏదో ఒక విస్తృతమైనదానితో లీనమైపోయిన భావం కలుగుతుంది-ఒక చిత్రం, ఓ ప్రతీక, ఓ ఊహాజగత్తు అన్నివైరుధ్యాలనూ, అసహజమైన కోరికలనూ, నిబద్ధతనూ, భయాలనూ, వక్రీకరణలనూ అర్థంచేసుకొనడం ద్వారానే నిశ్చలమైన, నిశ్శబ్దమైన మనసు లభ్యంకాగలదు ఆ భయాలు, ఆ దుఃఖాలు, ఆ అయోమయాలు అవన్నీ తుడిచి పెట్టబడగలవా అని మేమడుగుతున్నాము, అప్పుడు ఆ మనసు పరిశీలించుటకు, చొచ్చుకుని పోవుటకుగాను నిశ్శబ్దమవుతుంది మనిషి నిజంగా దీనిని చేయగలిగి ఉన్నాడా? పూర్తినిశ్చలత్వంలో ఉంటూ మిమ్మల్ని మీరు నిజంగా చూచుకొనగలరా? చురుకుగా నున్న మనస్సు ఎపుడూ, తాను చూసిన దానిని, వక్రీకరిస్తూ, అనువదిస్తూ, వాఖ్యానిస్తూ, నాకు ఇది ఇష్టమనీ, నాకు, 'అదియిష్టంలే'దనీ చెప్తుంటుంది అది బ్రహ్మాండమైన ఉద్రిక్తతతో, ఉద్వేగంతో వుంటుంది, కనుక, అలాంటి మనసు చూడజాలదు

కనుక 'మనవంటి సాధారణ మానవులు దీనిని చేయగలరా'అని అడుగుతున్నాం నన్ను నేను చూసుకోగలనా? నేనెటువంటివాడినైనాగానీ, 'భయము' లేక 'మనోవ్యాకులత' వంటి పదాల యొక్క ప్రమాదాన్ని, అనగా నాలో, 'ఉన్నస్థితి'ని నేను నిజంగా చూసేసమయంలో ఆ పదమే ఆటంకం కాబోతున్నదని తెలుసుకుంటూనే నన్ను నేను చూసుకోగలనా? భాష అనే బాటలోని గోతుల్ని, తెలుసుకుని కూడ, నన్ను నేను

పరిశీలించుకోగలనా? ఇంతేకాక, కాలమనే దాన్నేమాత్రం చొరనివ్వకుండా- ఏదో సాధించాలనే తలపు' లేకుండా, 'వదిలించుకోవాలను' కోకుండా – నిశ్చలంగా, ఏక దృష్టిలో, సావధానతలో నుంచి కేవలం పరిశీలించగలనా? అలాంటి తీవ్ర సావధానతా స్థితిలోనే, మనసులోని గుప్తమార్గాలు, అజ్ఞాత కోణాలు చూడబడుతాయి ఆ స్థితిలో విశ్లేషణ అనేదేలేదు విశ్లేషణలో కాలము, విశ్లేషకుడు, విశ్లేషించబడేది అనేవి యిమిడి ఉంటాయి విశ్లేషించబడే వస్తువుకి విశ్లేషకుడు భిన్నంగా ఉన్నాడా? – భిన్నం కాని పక్షంలో, ఇక విశ్లేషణకు అర్థమే లేదు కాలం, విశ్లేషణ, ప్రతిఘటన, ఏదో అందుకోవాలని, – దేనినో అధిగమించాలని – వీటినన్నిటినీ తెలుసుకోవలసి వున్నది తెలుసుకున్న తర్వాత త్యజించవలసివున్నది – ఎందుకంటే, ఆ ద్వారం గుండా పయనిస్తే, దుఃఖానికి అంతులేదు

ఇదంతా విన్న తర్వాత, మనిషి నిజంగా దీనిని చేయగలిగి ఉన్నాడా? ఇది చాలా ముఖ్యమైన ప్రశ్న 'పద్ధతి' అంటూఏమీ లేదు ఏమి చేయాలో చెప్పేవారుగానీ, దానికవసరమైన శక్తి నిచ్చేవారు కానీ లేరు పరిశీలించుటకు గొప్ప శక్తి అవసరం ఏ మాత్రం శక్తి వృధా పోని మనసే నిశ్చలమైనమనసు, లేని పక్షంలో అది నిశ్చలం కాదు చూచుటే చేయుట, అందువల్ల అది అంతమైపోవడం కాబట్టి, చూచి, అంతంచేసేయగల సంపూర్ణమైన శక్తితో మనిషి తనను తాను చూచుకొనగలడా?

**ప్ర: సర్, మీరు వేసిన ప్రశ్నే అసాధ్యమేమో?**

**కృష్ణమూర్తి:** ఇది అసాధ్యమైన ప్రశ్న అంటారా? అది అసాధ్యమైన ప్రశ్నే అయితే, మీరంతా, యిక్కడ ఎందుకు కూర్చున్నట్లు? కేవలం మాట్లాడుతున్న ఈ వ్యక్తి కంఠస్వరాన్ని వినడం కోసమా? పక్కనే పారుతున్న ఆ సెలయేటి గలగలల్ని వినడం కోసమా, ఈ కొండలూ, గుట్టలూ, పచ్చిక బయళ్ళ మధ్య హాయిగా మీ సెలవు దినాలను గడుపుకోవడం కోసమా? దీనిని మీరెందుకు చేయలేరుట? ఇది అంత అసాధ్యంగా ఉన్నదా? చురుకైన మెదడుంటే చాలుననుకుంటున్నారా లేక, మీ జీవితంలో, మిమ్మల్ని మీరెపుడూ నిజంగా పరిశీలించుకోనందువల్ల, ఇది మీకు అసాధ్యంగా కనిపిస్తున్నదా! ఇల్లు తగలబడిపోతుంటే, ఏదో ఒకటి చేయాలి కదా! 'ఇది అసాధ్యం, నేను దీనిని నమ్మను, ఈ విషయంలో నేనేమీ చేయలేను' అని చెప్పి, తగలబడుతున్న, దానిని చూస్తూ అలా కూర్చోరుగదా! అక్కడ నిజంగా జరుగుతున్న దేమిటో చూసి, తత్సంబంధంగా ఏదో ఒకటి చేస్తారు కానీ, మీరుండాలనుకున్నదానిని బట్టి చేయరు వాస్తవం ఇల్లు తగలబడటం – అగ్నిమాపక యంత్రం వచ్చేలోగా మొత్తం మంటల్ని మీరు ఆర్పలేకపోవచ్చు, కానీ ఈ మధ్య కాలంలో – ఈ మధ్య అనే ప్రసక్తేలేదు – ఆ మంట విషయంలో మీరేదో ఒకటి చేస్తారు

కనుక, ఇది అసాధ్యమైన ప్రశ్న, ఒక చిన్న సీసాలోకి ఒక బాతుని దూర్చటమెంత అసాధ్యమో, అంతకష్టమని మీరు చెప్పిననపుడు – మీకు ఇల్లు తగలబడి పోతున్నదన్న విషయమే తెలియదనే దానినే సూచిస్తున్నది ఇల్లు తగలబడుతున్నదని, మనిషి కెందుకు తెలియడం లేదు? ఇల్లు అంటే ఆ ప్రపంచం – ఆ ప్రపంచమంటే, మీరు, మీ అసంతృప్తి, మీ లోపల జరుగుతూ వున్నవి, మీ బయట, బాహ్యంలో జరుగుతున్నవీ – (అన్నీ మీరే)

ఇది మీకు తెలియడం లేదంటే, మీకెందుకు తెలియడం లేదు! మనిషికి తెలివిలేకనా, అసంఖ్యాకంగా పుస్తకాలు చదవనందువల్లనా? తనలోన సంభవిస్తున్న దానిని, నిజంగా జరుగుతున్న దానిని తెలుసుకోగల సున్నితత్వం అతనిలో లోపించిందా? మీరు కనుక, 'క్షమించండి, నాకేమీ తెలియదు' అనేటట్లయితే, ఎందుకని? మీకు ఆకలి వేసినపుడు తెలిసింది, మిమ్మల్ని ఎవరైనా అవమానిస్తే తెలుస్తుంది మిమ్మల్నెవరైనా పొగిడితే, మీకు బాగా తెలుస్తుంది లేక శృంగారపరమైన తృప్తిని పొందాలనుకున్నపుడు యింకా బాగా తెలుస్తుంది కానీ, ఇక్కడ మాత్రం, 'నాకు తెలియదు' అంటున్నారు ఇక ఎవరైనా ఏం చేయగలరు? ఇతరులనుంచి కలిగే ప్రేరణలపైనా, ప్రోత్సాహం పైనా, ఆధారపడదామా?

**ప్ర: మీరు, ఉత్పరివర్తనం వచ్చి తీరాలనీ, మనిషి తన ఆలోచనల్నీ, తన కోరికల్నీ గమనించుకోవడం ద్వారా అది సాధ్యమౌతుందనీ, అయితే అది తక్షణం జరగాలనీ చెప్పారు. నేనొకసారి చేసి చూశాను, కానీ మార్పురాలేదు. మీరు సూచించినట్లే చేసినట్లయితే, అపుడొక శాశ్వత స్థితి నెలకొంటుందా, లేక దానిని క్రమం తప్పకుండా రోజూ చేయవలసిందేనా?**

**కృష్ణమూర్తి:** ఈ గ్రహింపు, అనగా చర్య ఇది ఒక్కసారి చేస్తే చాలునా లేక ప్రతిరోజూ చేసితీరవలసిందేనా? మీరేమనుకుంటున్నారు?

**ప్ర: సంగీతాన్ని విన్న తర్వాతనైతే చేయగల మనుకుంటున్నాను.**

**కృష్ణమూర్తి:** మత్తుమందులాగా సంగీత శ్రవణం కూడ అవసరమంటారు కాకపోతే, మత్తుమందుకన్నా, సంగీత శ్రవణం అత్యంత గౌరవ ప్రదమైనది ఇదీ ప్రశ్న, మనిషి ప్రతిరోజూ, ప్రతినిమిషం, గమనించవలసిందేనా లేక ఒకేరోజున, ఆ మొత్తం అంతమయ్యేటంత, సంపూర్తిగా గమనిస్తే చాలునా? ఒకసారి ఆ మొత్తాన్నీ చూసిన తర్వాత, అటుపైన, నేనిక నిద్రించవచ్చునా? ప్రశ్న, అర్థమైంది గదండీ! అనునిత్యం గమనించవలసిందేనండీ, నిద్రించే అవకాశం లేదు అవమానాలు, పొగడ్తలు, నిరాశ, కోపం, వైఫల్యాలనే కాక, మీచుట్టూనూ, మీలోనూ సంభవిస్తున్న అన్ని విషయాలనూ, అన్ని వేళలా తెలుసుకుంటూనే వుండాలి 'ఇపుడు, నాకు పూర్తిగా జ్ఞానోదయమైనది, ఏదీ నన్నిక ముట్టుకోదు' అని మీరనే వీలులేదు

**ప్ర: మీరు అవమానించబడ్డప్పుడు, ఆ నిమిషంలో ఆ క్షణంలోదానిని చూడడం, అర్థం చేసుకోవడం మొదలు పెట్టారనుకోండి, అది అవమానింపబడినపుడు మీలో రేగిన తీవ్ర ప్రతిక్రియను మీరు అణిచిపెడుతున్నట్లేగదా! ఇలా చూడడమనేది, మీలో నుంచి ఉబికివస్తున్న ప్రతిక్రియను బయటికి రానీయకుండా నిరోధించినట్లేకాదా! ప్రతిక్రియకు బదులుగా చూడండి, అంటున్నారు–చూచుట అనేది కేవలం ఆ ప్రతిక్రియను అణచిపెట్టటమే.**

**కృష్ణమూర్తి:** మనం ఈ విషయాన్ని పాకల్యంగానే చర్చించాం కదండీ. నాకు అయిష్టం కలిగింది, అది ఒక ప్రతిక్రియ–నాకు మీరంటే యిష్టంలేదు నేను దానిని గమనిస్తున్నాను నేనత్యంత సావధానతతో దానిని గమనించినట్లయితే, అది విచ్చుకుంటుంది, అది నానిబద్ధీకరణను, నేను ఏ సంస్కృతిలో పుట్టిపెరిగానో వెల్లడి

చేస్తుంది నిద్రావస్థలోకి జారకుండా, నేనింకా గమనిస్తూనే వుంటే, ఎన్నెన్నో విషయాలు బహిర్గతమౌతుంటాయి అలా వెల్లడయిన వాటిని మనసు గమనిస్తుంటే, మరెన్నెన్నో బయటబడుతాయి.

– ఇందులో అణిచిపెట్టే ప్రసక్తేమీ లేదండీ. ఎందుకంటే, ఏమేమి సంభవిస్తున్నవో వాటిని చూడడంలోనే నాకు శ్రద్ధ అంతేకానీ ప్రతిక్రియల నధిగమించాలని లేదు, 'నేను' 'అహం', 'స్వ' అనే నిర్మాణాన్ని మనసుచూడగలదా, గ్రహించగలదా అనేది కనుగొనడంలోనే నాకు ఆసక్తి ఉన్నది అందులో అణిచివేత ఏ రూపంలో ఉండగలదు?

ప్ర: **నాకు అప్పుడప్పుడు ప్రశాంతంగా ఉన్నట్లు అనిపిస్తుంది. ఆప్రశాంతతలో నుంచి చర్యజరుగుతుందా?**

**కృష్ణమూర్తి:** ఈ నిశ్చలత్వాన్ని నిలుపుకోవడం, స్థిరీకరించుకోవడం, కొనసాగించడం ఎలా?–అదేనా మీ ప్రశ్న?

ప్ర: **దైనందిన విధులను కొనసాగించుకో గలనా?**

**కృష్ణమూర్తి:** నిశ్చలత్వంలో నుంచి, నిత్యకృత్యాలు నిర్వర్తించబడగలవా? మీరందరూ నాసమాధానం కోసం ఎదురు చూస్తున్నారు గదా! ప్రవక్తవలె, ప్రామాణికంగా చెప్పడం, నాకిష్టంలేదు ఈవేదికపై నేను కూర్చోవటమనేది, సంభవించింది తత్కారణంగా నాకు అది ఏ అధికారాన్నీ కల్పించినట్లుకాదు ఇపుడు ప్రశ్న అత్యంత ప్రశాంతంగా ఉన్న మనసు దైనందిన జీవితంలోని విధులను ఆచరించగలదా? నిత్యజీవితాన్ని, నిశ్చలత్వం నుంచి, ఊహాజగత్తు నుంచి ఆదర్శం నుంచి–అనగా నిశ్శబ్దంనుంచి–వేరు చేసినట్లయితే, ఆరెండూ ఎన్నటికీ జతకావు. ఆరెంటినీ వేరుగా ఉంచగలనా, ఇది ప్రపంచమనీ, ఇది నా దైనందిన జీవితమనీ, ఇది నేను అనుభవించిన నిశ్శబ్దమనీ, ఇది నేనందులోకి ప్రవేశించినపుడు కలిగిన అనుభూతి అనీ చెప్పగలనా? ఆనిశ్శబ్దాన్ని నిత్యజీవితంలోకి అనువదించగలనా? మీరు చేయజాలరు. అవి రెండూ వేర్వేరు కానప్పుడు–కుడిచేయే, ఎడమచేయి అవుతుంది–రెంటి మధ్యా శ్రుతి కలుస్తుంది నిశ్శబ్దము, నిత్యజీవితమూ ఏకమైపోతే, 'నిశ్శబ్దంలోనుంచి, నేనేమైనా చేయగలనా' అనే ప్రశ్న ఎప్పుడూ వేయరు

ప్ర: **మీరు తీక్షణమైన ఎఱుక, తీక్షణమైన ఆలోకన, తీక్ష్ణమైన చూపులను గురించి మాట్లాడుతుంటారు. మనిషిలో మౌలికంగా ఈ తీక్ష్ణత అనేది ఏ స్థాయిలో ఉన్నదో, దానిని బట్టే గదా, అది సాధ్యమయేది?**

**కృష్ణమూర్తి:** మనిషిలో స్వతః సిద్ధంగా ఈ తీక్ష్ణత అనేది, ఉన్నప్పుడేగదా, అతడు దానిని అన్ని విషయాలలో కనపర్చగలడు? అదేనా మీ ప్రశ్న!

ప్ర: ఏ ఒక్కదానిపైన కాకుండా, ఈ గాఢాభినివేశమనేది అన్నిటి ఎడలా ఉండాలని, అది ప్రాధమికావసరమని తోస్తుంది.

**కృష్ణమూర్తి:** అది మనకిప్పటికే ఉన్నదిగదా?

ప్ర: ఉన్నది, లేదు.

**కృష్ణమూర్తి:** సర్, ఇన్నన్ని ఊహలెందుకండీ? ఏమీ తెలియకుండా, ఈ సముద్రయానం

ప్రారంభించి, పరీక్షిస్తు పోవచ్చుగదా? ఏదిమంచో, ఏది చెడో, ఏది ఒప్పో, ఏది తప్పో, ఏది ఉండాలో, ఉండితీరాలో - ఏ ఒక్కటీ తెలియకుండా ఏ బరువూ లేకుండా, తనలోకి తానీయాత్రను సాగించవచ్చుగదా! అంతరంగంలోకి ఏ బరువూ లేకుండా, యాత్ర చేయడమనేది, అతి కష్టమైన పనుల్లో ఒకటి యాత్ర చేస్తూ, కనుగొంటూ వుంటారు - బయల్దేరకముందే 'ఇదిలా ఉండకూడదు' 'ఉండాలి' అని అనవద్దు అది ఎందుకంత కష్టమై పోయిందో, నాకు తెలియడం లేదు సర్, ఇలాచూడండి, వక్తతోసహా, మీకు తోడ్పడేవారెవరూ లేరు, విశ్వాసం పెట్టుకోదగిన వారెవరూ లేరు మీరు ఎవరిలోనూ విశ్వాసం పెట్టుకోలేదని ఆశిస్తున్నాను ఏది ఉన్నదో, ఏది ఉండాల్సిందో, ఏవైపు వెళ్ళాలో, వెళ్ళకూడదో అని చెప్పేవారులేరు ఆ దారిలో పోతె గోతులుంటాయి, అవన్నీ మీకే ఉద్దేశించబడ్డాయి - మీరేమో ఒంటరిగా వెడుతున్నారు అనిచెప్పే అధికారమెవరికీ లేదు మరి, మీరు దీనిని చేయగలరా? 'అమ్మో, నాకు భయం, నేను చేయలేనని, మీరనేటట్లయితే, ఆ భయాన్నే తీసుకుని, దానిని తరచి చూసి, దానినే అర్థం చేసుకోండి ఈ యాత్రసంగతి మర్చిపోండి, ఆధిపత్యాన్ని పట్టించుకోకండి-భయమనే అంశాన్ని మొత్తం పరీక్షించండి-మీకు ఆసరా ఎవరూ లేరనీ, ఏం చేయాలో చెప్పేందుకు ఎవరూలేరనీ, అందువల్ల తప్పులు చేస్తామేమోననే భయం వేస్తే తప్పులు చేయండి, చేసిన తప్పుని పరిశీలిస్తూ ఉన్న సమయంలో, తక్షణం మీరొక గంతువేసి ఇవతలకి రాగలరు

పయనిస్తూ కనుగొనండి, ఇందులో గొప్ప సృజనాత్మకత ఉన్నది, చిత్రం గీయడంలో కన్నా, పుస్తకం రాయడంలోకన్నా, రంగస్థలంపై కోతివేషం వేయడంలో కన్నా అతి గొప్ప - నేనాపదాన్ని వాడగలిగితే - ఉద్వేగం, ఉద్వేగభరితమైన

**ప్ర: హర్షోద్వేగమా?**

**కృష్ణమూర్తి:** ఓ! అలా పదాలనందించకండి

**ప్ర: పరిశీలకుడిని ప్రవేశపెట్టకుండా, దైనందిన జీవిత వ్యవహారాల్ని నిర్వర్తిసుంటే అపుడు ఆ నిశ్శబ్దాన్నేదీ భంగపరచదు.**

**కృష్ణమూర్తి:** మొత్తం సమస్య అదే కానీ, పరిశీలకుడెప్పుడూ, పలుయుక్తుల్ని ప్రయోగిస్తూనే వుంటాడు, ప్రతిదానిపై తన నీడ పడేటట్లుచేస్తూ, సమస్యల్ని మరింత పెంచుతుంటాడు మీరు కానీ, నేను కానీ ఏ ఒక్కవిషయమూ తెలియకుండా, ఈ అంతరంగ యాత్రను కొనసాగిస్తూ, సాగిస్తున్న సమయంలోనే కనుగొంటూ వుండగలమా? మనిషి మనసులోని శృంగారపరమైన ఆ కళ్ళు, తీరని ఆ కళ్ళు, ఉద్దేశ్యాలు, ఇది ఒక బ్రహ్మాండమైన సాహసకృత్యం, చంద్రమండలానికి వెళ్ళడం కన్నా గొప్ప విషయం

**ప్ర: ఇదే సమస్య; వారెటు వెడతున్నారో, వారికి తెలుసు; చంద్రమండలయాత్రకు సిద్ధమైనపుడే, వారికి ఆ దిశ తెలుసు. అంతరంగంలో దిశ అంటూ లేదుకదా!**

**కృష్ణమూర్తి:** ఆయన ఏమంటున్నారంటే, చంద్రమండలయానం వస్తుపరం కాబట్టి, మనమెటువెళ్ళాలనేది మనకు తెలుస్తుంది ఇక్కడ, అంతరంగ యానానికి సిద్ధపడినమనకు, ఎటువెళ్తున్నామనేది తెలియదు అందువల్ల, ఇక్కడ అభద్రత, భయం

వగైరాలు ఉంటాయి మీరెక్కడికి వెడుతున్నారనేది మీకు ముందే తెలిసినట్లయితే, మీరెప్పటికీ తెలియనిదానిలోకి చొచ్చుకుపోలేరు, అందువల్ల శాశ్వతమైన దానిని కనుగొనేటువంటి నిజమైన మానవులు ఎప్పటికీ కాలేరు

**ప్ర: మాస్టరు సహాయం లేకుండా, ఆ మొత్తాన్నీ తక్షణం చూడటమనేది జరుగుతుందా?**

**కృష్ణమూర్తి:** దానిని గురించే కదా, మనం మాట్లాడుకుంటూ వున్నది

**ప్ర: ఇంకో ప్రశ్నను మనం పూర్తి చేయలేదు; మనం ఎక్కడికి వెడుతున్నామో మనకు తెలుసుకాబట్టి, ఇదొక సమస్యగా తయారైంది. మనకు సుఖాన్నే అంటిపెట్టుకుని ఉండాలని వుంటుంది. మనకు నిజంగా కనుక్కోవాలని లేదు.**

**కృష్ణమూర్తి:** అవును, మనకు సుఖపు అంచులనే పట్టుకువేళ్ళాడుదామని వుంటుంది మనకు తెలిసిన వాటిని పట్టుకుని వుండాలనే మన కోరిక అదంతా తోటే పెట్టుకునే ప్రయాణం చేయాలంటాము మీరెప్పుడైనా ఒక కొండని ఎక్కారా! మీ దగ్గిర ఎంత బరువుంటే, అది అంత కష్టమౌతుంది బరువుని మోస్తూవుంటే ఈ చిన్న కొండల్ని ఎక్కడం చాలా కష్టం ఓ పర్వతాన్ని అధిరోహించ దల్చుకున్నప్పుడు మీరు చాలా తేలికగా ఉండాలి ఇందులోని కష్టమేమిటో నాకు తెలియడం లేదు మనం, మనకు తెలిసున్న వాటన్నిటితో సహా – మన అవమానాలు, ప్రతిఘటనలు 'మన తెలివితక్కువలు, మన సంతోషాలు, మన ఔన్నత్యం, మనకి ఉన్నవన్నీ తీసుకువెళ్ళాలంటాం మీరు ఆ మొత్తం నాతో పాటే తీసుకుని వెడతాను' అన్నట్లయితే, మీరు మీ ప్రయాణాన్ని ఎటువైపో సాగిస్తున్నారు అందువల్ల, మీ యాత్ర ఊహల్లోనే కనుక అది, అవాస్తవికం మీరు మోస్తున్న వాటిలోకి అంటే మీకు తెలిసినదానిలోకి పయనించి చూడండి, తెలియనిదానిలోకి కాదు–మీకిప్పటికే తెలిసున్నవాటిలోకి మీ సుఖాలు, మీ సంతోషాలు, మీ నిరాశలు, మీ దుఃఖాలు వాటిలోకే పయనించండి మీకున్నదంతా అదే, మీరు, 'నేను దీనినంతా, తెలియని దానిలోకి తీసుకునే వెడతాను, దీనికే ఆ తెలియని దానిని, అందులోని యితర సంతోషాలను, యితర సుఖాలను కలుపుతాను' అంటారు లేకపోతే, ఇదంతా ప్రమాదభరితంగా వున్నదని అనిపించి, నేనీ ప్రయాణమే చేయదలుచుకోలేదు అనవచ్చు

*సానెన్, స్విట్జర్లాండు, ఆగష్టు 8,1969*